శ్రీ

# నూర్జహాన్

# NURJAHAN

గ్రంథకర్త

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, బి. ఏ. ఆనర్సు

ప్రకాశకులు

అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు

సరస్వతీ గ్రంథమండలి

రాజమహేంద్రవరము



1927

వెల 1—0—0

DEDICATED

TO

THE HALLOWED MEMORY

OF

THE LATE LAMENTED

SIR ASHUTOSH MUKHERJEA

THE FATHER

OF

THE GREAT UNIVERSITY OF CALCUTTA

*As a Humble Token of Esteem Admiration,*

*Veneration and Gratitude*

*FOR THE PATERNAL AFFECTION*

*He always bestowed upon His Students*

BY

His Humble Alumnus

THE AUTHOR.

# అంకితము

—:x:—

సీ. బాల్యకాలమునందె పల్విద్దెలన్నేర్చి
పండితశ్లాఘంబు బడసి తీవు;
స్వాతంత్ర్య మంత్రము స్ఫూర్తితో జపియించి
తల్లి నేమము నెప్డు తలఁచితీవు;
వెఱవును సుంతైన నెఱుఁగక నెన్నండు
దొరలను నెదిరించి వరలితీవు;
భూరివిభూతిని పొందియు, సర్వదా
కష్టజీవివె యాచుఁ గ్రాలితీవు;
గీ. అకట! పృథు విశ్వవిద్యాలయంబు కీవు
జ్యోతివై; యట్టి నిర్వాణమైతి వాశు
తోషమహనీయ! సత్క్రియా ధూర్వహుండ!
అందుకొనుమేను రొసఁగు నీ యంకితంబు.

# పీ ఠి క

ప్రస్తుతమున( గానంబడు భారతేతిహాసములందు( బెక్కులు భారతేతరుల చేతనే వ్రాయంబడియె. దుర్భాగ్యవశమున మహాత్ములు కొందఱుకుధరమూషకములంచును, వేశ్యాప్రణయాభిలాషులంచును, కలహాపరతంత్రులంచును కతిపయ యాంగ్ల మహాశయులచే వర్ణింపఁబడిరి. మహాపురుషుల నిలయమైన నిజసీమ నిజవృత్తాంత మెఱింగిన భారతీయులు చాల యరుదుగ నున్నారు. మాతృభాష మఱచు టొక గొప్పయని దలంచి, గృహప్రసంగములం దొక్కొక్కపుడు పూర్ణహూణ పదప్రయోగము సలిపియు, మఱొక్కొక్కపుడు వేడినీటికిఁ జన్నీరు సాయమను లాగున నాంధ్రపదముల కాంగ్లపదముల సాయపఱచియు విద్యాధికుల మనిపించుకొన గడంగు మన విద్యార్థులనేకు లితర సీమ చారిత్రపఠనమం దభిరుచి సూపు తెఱంగున నిజవిషయవిషయముల నెఱుంగుటందు దానిఁ జూపుట లేదు. ఈ శోచనీయ విషయముల కవగతుండైన ద్విజేంద్రుఁ డితిహాసాంశముల నాటకరూపమున లిఖించి నిజదేశమహిమను నిరుపమాన ప్రజ్ఞతోఁ దెలిపి, పవిత్రములైన భారతేతిహాసముల వైపుగ వంగదేశీయుల చిత్తములఁ ద్రిప్పెను. మదాంధ్రీకృత ద్విజేంద్రనాటకములఁ జదివి, వీరపూజాధురంధరులైన యాంధ్ర మహాశయులు తమ ప్రాచీనవీరుల మహిమఁ దెలిసికొని, నిజమహత్వ మెఱుంగుదురుగాక!

తక్కుంగల ద్విజేంద్రలిఖిత గద్య నాటకములంబలె 'నూర్జహాను' మిగుల హృద్యమైనది. పలుమాఱులిది పండిత పంచాస్యులచే వంగరంగమందభినీతమాయెను. గద్యనాటక హీరాహారముచే మాతృభాషానతి నలంకరింప దొరఁకొను యాంధ్రతజ్ఞు లాదరపురస్సరముగ నీ నాటకరాజము నాహ్వానించెదరంచు విశ్వసించుచున్నాఁడను.

కించిజ్ఞుండ నగు నా యుద్యమమునకు సంపూర్ణ సానుభూతి నొసఁగుచు దీని ముద్రణభారము నిజమాళిని వహించిన సుహృద్వరులగు శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారికిని, వంగ మాతృక నుండి దీని నాంధ్రీకరించుటకుఁ బ్రణయపూర్వకముగ ననుమతి నొసంగిన శ్రీ దిలీపకుమార రాయలుగారికిని యశ్రాంతము కృతజ్ఞుండనై యుండును.

కలకత్తా
10-12-1925

ఇట్లు విన్నవించు సుధీవిధేయుఁడు
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

# ఈ నాటకమునందు వచ్చు ముఖ్యపాత్రలు

(పురుషులు)

| | |
|---|---|
| జహాంగీర్ | భారతసామ్రాట్టు. |
| శర్ఖాన్ | సామ్రాట్టు పుత్రుడు. |
| మహాబత్ ఖాన్ | చక్రవర్తి సేనాధిపతి. |
| అయాసా | సామ్రాట్ - కోశాధ్యక్షుఁడు. |
| అసఫ్ | అయాసా కుమారుఁడు. |
| కర్ణసింహుఁడు | మీవార్ రాణా. |
| ఖుస్రు | (రీవాతనయుఁడు) |
| పరభేజ్ | జహాంగీర్ కుమారులు. |
| ఖురమ్ (షాజహాన్) | |
| శర్యార్ | |
| విజయసింహుఁడు | మీవార్ సేనాధిపతి. |

స్త్రీలు

| | |
|---|---|
| రీవా | భారత చక్రవర్తిని |
| మిహిరున్నిసా (నూర్జహాన్) | శర్ఖాన్‌సతి. |
| లయలా | నూర్జహాన్ కూతురు |
| ఖాదిజ (ముంతాజ్) | అసఫ్ తనయ. |

శ్రీరస్తు

శ్రీ పరమాత్మనేనమః

# నూర్జహాన్

# NURJAHAN

## (A Historical Drama)

## ప్రథమాంకము

### ప్రథమదృశ్యము.

ప్రదేశము—వర్ధమాన నగరమునందలి శర్ఖాను గృహోద్యానవనము.

శర్ఖాను సతీసమేతుఁడై యా యుద్యానవనమందలి యొక చలువ రాతి తిన్నెపైఁ గూర్చుండియుండును. భాద్రపదమాస మగుటచే, ప్రక్కన నున్న దామోదరానది నిండుగా తీవ్రవేగముగాఁ బ్రవహించుచుండును. అస్తమింపనున్న వర్షాకాలసూర్యుని సాంధ్య స్వర్ణకాంతి యానదీవక్షముపై శయనించియుండును. నదీకూలములు బంగారుపూత బూసినట్లు సంధ్యారాగమునఁ బ్రకాశించుచుండును. శర్ఖాను దంపతుల యెదుట నిలిచి లయులాఖాదిజాలు పాడుచుందురు.

గీతమాల.

అతులచిరవిమోహన కుసుమితము నగుచు,
మలయమారుతసేవిత నిలయమగుచు,
సుందరగృహోపవన విభాసురమునగుచు,
నిర్ఝరీగాన ఝుంకృతోన్మేషమగుచు,

శతవిహంగమ కలనాద చలితమగుచు,
దేవతాధామమై ప్రభా దివ్యమగుచు,
బరగు నల యమరావతీపురము దివిని.

శఖ్రాన్—సౌందర్య తిలకములారా! మీరు రిఁక పోయి యాడుకొనుఁడు.

(బాలికాద్వయము దూరముగ నరుగును.)

నూర్జహాన్—ఆహా! ఈవంగభూమి సౌందర్య మనిర్వాచ్యమై భూతల స్వర్గమగు గాంధ్రసీమను తలపించుచున్నది. శ్యామల తరంగము లీసీమా విస్తీర్ణక్షేత్ర వక్షోభాగమునుండి ప్రవహించుచుఁ జూపఱు కు నేత్రపర్వం బొనర్చుచుండెను. అగాధసలిలసంభృతసరిల్లా మము లుద్ధతబాలలవలె వంగజనని యానఁ బాటింపక నిజ వల్లభుఁ జేర వారాశి కభిముఖముగ సాగిపోవుచున్నవి; పరస్ప రాలింగిత పుష్పలతా సుగంధసంగీత విభ్రాజిత సుందర ప్రమదో ద్యానకుంజములు నందనవనమును బోలియున్నవి. సీమ యంతయు నొక యపార్థివ సుఖస్వప్నమువలెఁ దోఁచుచున్నది!

శఖ్రాన్—ఇట్టి సుందర వర్షము నిచటి యధివాసుల కీశ్వరుఁ డొసఁ గియు, నద్దానిని రక్షించుకొనఁగల శక్తిని వారల కొసఁగ లేదు.

నూర్జహాన్—ప్రియతమా! ఈ సీమవాసు లింత సుఖము సహింపఁ జాలరని దోఁచెడిని. ఇట్టి సుఖం బసహ్యము కాదా!

శఖ్రాన్—ప్రేయసీ! ఈ దేశమాత సౌందర్యమే వారల సమక్షమునఁ గాలస్వరూపమై నిలచెను. వంగజనని నిజసుతులకత్యధి కా దరంబు చూపి వారలఁ జదిమివైచెను. ఆదరము కడు నుత్తమమైనదే! వృష్టిధార వడువున నది వసుంధరను శ్యామల మొనరించును; కాని, యత్యధికాదర మతి వృష్టివలె నిజకార్య వినాశ మొనరించుకొనును!

నూర్జహాన్—అటులైన మీ రత్యధికాదరముఁ జూపి, నన్నుఁ జఱచుచుండిరా!

శర్ఖాన్—ఏణాక్షీ! నీకు సముచితాదరణము చూప నే నశక్తుఁడ నని దలఁచెద.

నూర్జహాన్—వల్లభా! లీయలాఖదిజాలప్సరబాలికల పగిది పరస్పర భుజాలింగితులై యెట్లు శైవలినీకూలమున విహరించుచుండిరో విలోకించితిరా ?

శర్ఖాన్—పల్లవాంఘ్రీ! నిక్కువముగ వా రచ్చరబాలల చెన్నునఁ దోఁచుచుండిరి.

నూర్జహాన్—ఆ బాలికల సమీపమునఁ బద్మములు ప్రస్ఫుటితవదనములై నగుచున్నవి. ఫుల్లసరోజంబులపైవలె న బ్బాలల ప్రఫుల్లవదన వనజంబులపై సూర్యుని శేషస్వర్ణరశ్మి సోకుచుండెను! ఝరీగర్భమందలి వారిజంబు లధికసుందరంబులో, లేక స్రవంతీకూలమందలి మన యీ కమలద్వయం బధిక సౌందర్యోపేతమో తెలుపఁగలరా ?

శర్ఖాన్—నీలవేణీ! మన నీరజంబులే యెక్కుడు సుందరంబులు కావా!

నూర్జహాన్—ప్రవాహపూరితమైన దామోదరా నదీమతల్లి రెండు గట్ల నొరసుకొని యుద్దామజవమునఁ జనుచుండెను! ఆహా! ఏమి! ఆసరిల్లలామసౌందర్యము !

శర్ఖాన్—ఇవ్విధంబున సౌఖ్యసామ్రాజ్య మశ్రాంత మేలగల భాగ్యమును బరాత్పరుఁడు మనకుఁ బ్రసాదించుగాత! (ఇట్లని యతఁడు యామె కరములందు తన హస్తముల నిడును.)

నూర్జహాన్—(ఉలికిపడి యన్యమనస్కయై)—కాని, యీ దృశసౌఖ్య మనహ్యమని దలఁచెద.

శర్ఖాన్—అసహ్యమేల ! మన మెవరి కేకీడును గావించి యుండలేము. పరస్పరానురాగంబున సుఖులమై యుంటిమి. ఇట్లుండుటొక యపరాధమా !

నూర్జహాన్—నాథా ! 'ఇది యపరాధమా' యని యడుగవలదు చుంటి-రేల ! నిజసుఖపయోధిమగ్నులైన యీ వంగవాసు లెట్టి యపరాధ మొనరించిరి ! సౌఖ్యానుభవము వారి కివు డేల యసహ్యమై యుండె ? నిజసుఖంబును వారలు సహింపగలిగినను పరు లద్దానిని సహింపజాలరు. ఎదుటివారల్సుఖం బుండిరను నీర్ష్యలోకులను బలుమారు వెఱ్ఱివారిం గావించి వైచును. దానంజేసి వారల సౌఖ్యమున కంతరాయముం గలిగింప యత్న మొనరింతురు.

(వెనుకనుండి నూర్జహాన్ సోదరుం డాకస్మికముగం బ్రవేశించి మందస్మితముఖుండై).

అసఫ్—"కాని నేను మీకు—"

నూర్జహాన్—చమకితయై—ఎవరు ? అసఫా యేమి !

శర్ఖాన్—అవు నసఫే ! ఇట్లని చివాలున లేచి నిలువంబడి వాని కరంబును బట్టుకొనును.

అసఫ్—ఈర్ష్యచే మీ సౌఖ్యమును హరించుటకు బదులు ప్రమోదమనస్కుండనై మీసుఖంబు నధికం బొనర్ప నరుదెంచితిని. ఒక సువార్తను దెలిపెద.

శర్ఖాన్—ఆ సువార్త యేమి ?

అసఫ్—వేగమ చెప్పంజాలను—ముందు—

నూర్జహాన్—జనకుని మంగళవార్తయా?

అసఫ్—అవును. జహాంగీరు చక్రవర్తి—

శర్ఖాన్— జహాంగీ రెవరు ?

అసఫ్—ఎవ రేమి ? సలీమ్ ! అక్బరు చక్రవర్తి మరణానంతర మాతండు

జహాంగీరు బిరుదము వహించి సింహాసనాసీనుఁ డాయెనను విషయ మెఱుంగరా ?

నూర్జహాన్—ఏమి ! అక్బరుచక్రవర్తి మరణించెనా !

అసఫ్—అక్బరు ప్రభువు మరణించుటే యెఱుగవా!—అబ్బుర మబ్బురము !

శర్ఖాన్—నిజసుఖ నిమగ్నులమై యున్న మాకది దెలియుటకుఁ దగు తరుణము చిక్కలేదు !

అసఫ్—నిక్కంబుగ మీ రెఱుంగరా ?

శర్ఖాన్—ఎఱుఁగము. అది తెలియగవలసిన యవసరమేమి ! బెల్లమమ్ముకొను పల్లెశెట్టి యోడవచ్చు వార్త నెఱుఁగనేల నిచ్ఛగించును ?

అసఫ్—ఎఱుంగవలయు నవసర మేమో మీ కిప్పుడ దెలిపెద.

శర్ఖాన్—మంచి దిపు డీక లోనికి పోదము రండు. అంధకారము ఘనీభవించుచున్నది. సతీ ! రమ్ము.

నూర్జహాన్—వచ్చుచుంటి నథుపుఁడు.

(అసఫ్ శర్ఖానులు గృహాభ్యంతరమున కరుగ నుద్యుక్తులగుదురు.)

అసఫ్—తనయ యేది ?

శర్ఖాన్—అదిగో ! లయలాతోఁ గలసి యాటలాడుచున్నది.

అసఫ్—అవును. ఏమి వారి యుల్లాసము!—మన మింక లోని కరుగుదము రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు.)

నూర్జహాన్—సలీమ్ సామ్రాట్టాయెనా!—సలీ మానాఁడు—ఆవిషయము మరల జ్ఞప్తికి వచ్చుచున్న దేల?—ఆ చింత నిఁక నాచిత్తమునఁ జొరనీయను!— చొరనీయను!! అది ప్రథమ యౌవనలీల మాత్రమే ! ఇప్పు డిఁక నా చింతయేల ? సలీముచక్రవర్తియైన నా కేమి ! బెల్లమమ్ముకొను పల్లెశెట్టి నౌకాగమనవార్త నెఱుఁగ నిచ్ఛగింపనేల !

శర్ఖాను—(మరలఁ బ్రవేశించి) ప్రేయసీ—సువార్త! సువార్త!

నూర్జహాన్—ఏమి నాథా ?

శర్ఖాన్—జహాంగీరు చక్రవర్తి నన్నైదు వేల యశ్వసైన్యమునకు నాయకునింగావించి నూతన పదస్వీకరణమునకై యాగ్రానగరమ్మునకమ్మ నంపెను.

నూర్జహాన్—వినాశకూపము త్రవ్వుట యారంభమాయెనా !

శర్ఖాన్—వినాశమేల ? ఇది నా కొక మహత్సన్మానము కాదా ?

నూర్జహాన్—ఇపు డాగ్రాకుఁ బోఁ దలఁచుచుంటిరా ?

శర్ఖాన్—నిక్కవముగ పోఁ దలచుచుంటిని.

నూర్జహాన్—పోవలదు. పోయిన,—(క్షణకాలము నీరవయై) పోకుఁడు! జాగ్రత్త! పోయిన,—

శర్ఖాన్—సతీ ! నీ విట్లుత్తేజితవగుచుంటి వేల? ఈపదవిని స్వీకరించుట పరమాహ్లాదకర విషయము కాదా ?

నూర్జహాన్—వల్లభా! పోకుఁడు.—మీహృదయేశ్వరి పలుకుల నాలింపుఁడు ! ఇపు డప్రమత్తులై యుండు టుచితము !

(ఇట్లని నూర్జహాన్ వేగముగ వెడలిపోవును.)

శర్ఖాన్—ఆశ్చర్య మాశ్చర్యము ! అర్ధాంగి యాకస్మికముగ నిట్లుత్తేజితయైనదేల! అపుడపు డామె విచలిత యగుచుండుట నిక్కమే, కాని, యిట్లు కలవరపడుట నే నిటీవలఁ జూచియుండలేదు!

ద్వితీయ దృశ్యము

(ప్రదేశము—ఆగ్రాయందు జహాంగీరు నంతఃపుర మందిరము—ప్రాతఃకాలము

రేవా మహారాజ్ఞి యప్పుడే స్నానముచేసి, చలువబట్టలఁ గట్టుకొని, తల యార్పుకొనుచు పూజాపాత్రను కరములం దిడుకొని యుండును. జహాంగీరు ఆమెతో మాట్లాడుచుండును.

రీవా—నిజము దెలుపుఁడు.

జిహాంగీరు—సఖి! సత్యమే వచించుచుంటిని. శేర్ఖాన్ మిగుల దక్షుం డైన ధనాఢ్యుఁడగు నయూసాజామాత. మిగుల బల్లిదుఁడని ప్రజలతనిఁ గొనియాడుచుందురు. ఆ విశిష్టవ్యక్తికిఁ దగు పదవి నొసఁగ నాగ్రాకు నాహ్వానించితిని.

రీవా—అతని యర్ధాంగిపై మీ కెట్టి యనురాగము లేదా! నిక్కము దెలుపుఁడు.

జిహాంగీర్—నా యంతర్గుహాయం దెట్టి గూఢోద్దేశ్యము లేదు. నీ వూరక బేలవుగాకుము.

రీవా—నాథా! ఆ కాంత పరకీయ యగుట నేనిట్లు వగచుచుంటి. ఆమెను పరిణయమాడుట సంభవమే యని తోఁచిన, నేనేమియుఁ బలుక కూరకుందుదానను. సఫలమనోరథులు కాదలఁచి తామిత రుల యింటిని గూల్పయత్నించుచుంటిరి. ఒక రమణి సుఖసామ్రాజ్యమును గొల్లగొట్టఁ దలఁచుచుంటిరి. అట్లొనర్చుట ఘోరపాపమున కొడిఁగట్టుకొంటగాదా! అందుకే నేను విచారించుచున్నా ను.—నిజారిష్టమును దలఁచి నే దుఃఖించుచుంటలేదు. వల్లభా! మీ కొఱకే నేనును చింతించుచుంటినని విశ్వసింపుఁడు.

జిహాంగీర్—సతీ! నాకొఱకే వ్యశాంతము చింతించుచున్నట్లు నన్ను ప్రేమించియున్న,—

రీవా—నాథా!—యింకను యా ప్రసంగమే గావించుచుంటిరా?

జిహాంగీర్—ఏల కావింపను! ఆనాఁడు నేనెట్లు నీ ప్రణయభిక్ష వేఁడితినో, నేఁడుకూడ నట్లే నీ ప్రేమభిక్షను వాంఛించుచుంటిని! ఆ జీవన రహస్యమయ ప్రభాతమం దేను నీహృదయతీర్థోద్దేశమున యాత్ర సలిపి, నిన్ను సమీపింపఁగలిగితిని. కాని ఆపవిత్ర తీర్థాభ్యంతర మందుఁ బ్రవేశించు భాగ్యము నాకలవడలేదు.

రేవా—ప్రభూ! నాయుద్దేశ్యము నీవలికే బలుమారు వ్యక్తీకరించితిని. మన పాణిగ్రహణము రాజనైతిక బంధనము మాత్రమేకదా. అది యొకజాతీయోద్దేశ్య సాధనార్థమై కావింపఁబడిన యుపాయము. హిందూ మసల్మాను సమ్మేళనాభిలాషులైన మీ తండ్రిగారు నన్నుఁ దమకోడలిగఁ బరిగ్రహించిరి! ఆ యుద్దేశ్యము మహత్తరమైనదే! దాని పూర్ణార్థము మన మిరువురము నిజసుఖవిసర్జనము సలుపబాధ్యులమైతిమి.—ప్రభుకర్తవ్య మతికఠోరమైనది. నాథా! తామా కర్తవ్యసాధన మొనరింపఁ జాలకుండిన నీ సామ్రాజ్యమంతయు మేఘప్రాసాదమువలె నభమందు విలీనమైపోవును! మన జీవనమంతయు కష్టభూయిష్ఠమైనది కాని, దుఃఖాబ్ధియందుఁ బరులకై మునింగినకతన మన మిరువురము సుఖులమై యుంటిమని తలంపవలయును!

జహాంగీర్—సతీ! సహనసాధ్యము లందఱికి నొక్క తీరుననుండవు— పోనిమ్ము! గతమునుగురించి చింతించిన నేమి ప్రయోజనము? ఆతలం పేల. మనఃచిత్తములకుఁ దట్టినో యెఱుంగజాలము!— అదుగో! మన పెద్దకొడుకీయడకే వచ్చుచుండెను. తగురీతివిమ్మందలింపవలయును!

(ఖుస్రు ప్రవేశించి జనకున కభివాదన మొనరించును.)

జహాంగీర్—తనయా! నిన్నేల పిలిచితినో యెఱుంగుదువా?

ఖుస్రు—ఎఱుఁగను.

జహాంగీర్—నీనేరము నా కెఱుక యైనది.

ఖుస్రు—నా నేరమేమి?

జహాంగీర్—నీతండ్రిగారికి ప్రతిపక్షివై విద్రోహ మొనరింప గమకించుటే నీనేరము. ఇప్పుడైన నీవు నీతప్పునొప్పుకొందువా?

ఖుస్రు—జనకా! నాయం దెట్టి దోషమునులేదు.

జహాంగీర్—నీ వెట్లు బొంకినను బొంకుము. కాని కొఱికిచే తలఁ గోకికొనఁ జూచుచుంటివని నమ్ము. నాకు జ్యేష్ఠపుత్రుఁడవౌట నీవు భావిభారత సార్వభౌముఁడవు. నిజదోషంబున సర్వనాశన మొనరించుకొనకుము.

ఖుస్రు—తండ్రీ! నాయందు లేశమైన దోషంబులేదు.

జహాంగీర్—చెడ్డపని చేసినపుడు నీవు నా యగ్ర నందనుండవైనను నీతల్లికి ప్రణయప్రతిమవైనను, సర్వజన ప్రియుండవైనను,—సముచిత దండార్హుండ వగుదువు. నీవొందు గారబముకాని, నీతల్లిగారి కన్నీరుగాని, నీజనకుని వాత్సల్యముకాని నిన్ను కఠినశిక్షనుండి తప్పింపఁజాలవని నమ్ముము

(ఇట్లని చక్రవర్తి నిష్క్రమించును.)

రాజ్ఞి—(తనయుని భుజముపైఁ జేయివైచి ప్రేమపూర్వకముగ)—తనయా!

ఖుస్రు—ఏమి తల్లీ!

రాజ్ఞి—ఇది నిక్కవమేనా?— మాటలాడవేమి?— దాపక నిజంబంతయు వ్యక్తీకరింపుము.

ఖుస్రు—అమ్మా! నిజంబుగ వ్యక్తీకరించుచుంటిని—ఇది వట్టిమిథ్య.

రాజ్ఞి—వత్సా! మిథ్యకాదు. నీచూపులు, నీభగ్నస్వరము, నీమనస్థైర్యము నీపద్ధతులు, నిజమునంతయుఁ జెప్పక చెప్పుచున్నవి—నీ జననికడ నీకు వెఱపేల? నాయనా! నిక్కము వచింపుము.

ఖుస్రు—(క్షణకాలము స్తబ్ధుడై నతమస్తకుఁడై యుండి)—జననీ! ఇది నిక్కవమే!

రాజ్ఞి—అట్లని ముందే గ్రహింపఁగలిగితిని. తండ్రీ! ఎన్నడిట్టికార్య మొనరింపనని వచింపుము.

ఖుస్రు—మాతా! నేనట్లు వచింపఁజాలను. ఈ కార్యసాధన మొనరింతునని నే వీరులకడ వాగ్దాన మొనరించితిని!—

రాజ్ఞి—అనుచితవాగ్దాన మొనరించితివి. దానిని భంగ మొనరించుటు త్తమము. శపథ—.

ఖుస్రు—"జననీ"—యనితలవంచును,

రాజ్ఞి—బిడ్డా! నేను జనయిత్రిని. తల్లిమనఃకాయ ప్రాణముల వాంఛలు,—వేయేల? యిహజీవనమంతయు సంతాన ల్యాణార్థమై ఘటితమైయున్నది! అట్టి మాతనగు నేను దివారాత్రములందు నీమంగళంబునే వాంఛించుచుందును. దానికిఁ బ్రతిఫలముగ నేనేమియు నభిలషించుటలేదు. నీ కళ్యాణమే నావాంఛకుఁ బ్రత్యుపకృతి యనిఁ దలంచుచుందును. నీ కళ్యాణార్థిని గాన నిట్టి కార్యం బెన్నఁడును గావింపవలదని బ్రతిమాలుకొనుచుంటిని. తండ్రీ! నీ జనని పలుకులఁ బాటింపుము.

ఖుస్రు—అమ్మా! ఇక నెన్నఁ డట్టి పని సలుపను.

రాజ్ఞి—నాచరణముల నంటిశపథ మొనరింపుము.

ఖుస్రు—(తల్లి యాజ్ఞానుసారముగ నామె చరణ సరోజములనంటి)-జననీ! ఇఁక నెన్నఁడట్లు గావింపనని శపథ మొనరించుచుంటిని!

రాజ్ఞి—వత్సా! మంచిది! ఇఁక నీవు వెడలిపోవచ్చును.

(ఖుస్రు నిష్క్రమించును.)

రాజ్ఞి—మాతృసుఖ మెంత యధిక మైనది! ఈశ్వరా! ఆత్మజుల శుభంబు నభిలషించియే జనని యెట్టి సుఖము ననుభవింపఁగలదు!

## తృతీయదృశ్యము

[The reader may be frankly told that this scene is not at all my addition. What is in colloquial Bengalee I rendered into colloquial Telugu. When I translated this, replacing the Bengalee names by Telugu names—they are the names of villagers—I had my own doubt that the incorporation of a lengthy comic scene in a literary production might not be tolerated by the grave. In spite of myself I could not delete

the scene since my business is to correctly interpret what the great dramatist, who more than anybody knew the needs of dramatic art, spoke in his sweet language. The actors of the play may — if they so like — omit this scene.]

కొండప్రక్క ప్రదేశము—శీతకాలప్రభాతము—ఆగ్రా పరిసరమున వసించు కొందఱు పల్లెవాసులు ప్రసంగించుచుందురు.

మొదటివాడు—ఏమోయీం! పెంటయ్యా బావా! నువ్వేమంటావ్?

2 వ వాడు—నేనేనా! మాంబాగా సెలవిచ్చావోయి!

1 వ వాడు—అయితే నువ్వు శ్ఖానుగోరిని చూచావంటోయి?

2 వ వాడు—చూడకేం,—ఆడిని మొట్ట మొదట నుంచీ యెఱుగుదును. పైగా, ఆగ్రావచ్చాకా ఆణ్ణి రెండు మూడు బిరకలు చూశాను.

3 వ వాడు—(సగర్వముగ)—నాకూ ఆడికి సాలా జత! నేనంటే ఆడి కెంతో ఆపేచ్చ!

1 వ వాడు—ఆ డాగ్రా యెపు డొచ్చాడు?

2 వ వాడు—మా పెద్దోడి పెళ్ళినాడే వచ్చాడు! నిరైండేమో? ఏమోయి మామా అవలేదూ?

3 వ వాడు—అయిందోయి! ఎందు కవదేటి?

1 వ వాడు—ఆమనిసి యెల్లా వుంటాడు?

2 వ వాడు—అచ్చంగా పిల్లకొండలా వుంటాడు!

3 వ వాడు—వోరయ్యో! ఆడికొరేళం యెల్లావుంటుందో నువ్వయినా చూడలేదేంటో? ఆడిగుండే వుంటుంది మాసోళుపు పొలంలాగ!

1 వ వాడు—కాకపోతే, ఆడు పెద్దపులితో యెల్లా దెబ్బలాడ కలడనుకున్నారు?

3 వ వాడు—కత్తికటారం పుచ్చుకుండి మాత్రం పెద్దపులితో యెవళ్ళు పోట్లాడగలరు?

4 వ వాడు—కాని ఆడు పెద్దపులితో దెబ్బలాడి నెగ్గేడంటే నే నమ్మను.

2 వ వాడు—ఇదేంటి కూత!—ఈకూత!

3 వ వాడు—నువ్వు చెప్పిందంతా అబద్ధమేంట!

1 వ వాడు—అబద్ధ మెందుకైంది?

3 వ వాడు—చాల్ చాలు! మామా! నేర్చుకుపోయావ్, ఇది అబద్ధమా—అబద్ధ మెందుకైంది?

4 వ వాడు—ఎందుకైందా?-సరే, యిను-శక్రాన్—కాని,—అవును! ఆడిశరీరంలో బలం ఉందనుకుందాము, కాని,—

2 వ వాడు—అనుకుందాం వేటి?

4 వ వాడు—సరే బలం ఉందని ఒప్పుకున్నాను! అనుకుంటాలు గినుకుంటాలు, మానేశాను కాని వ్యత్తసేతులతో నే పెద్దపులితో దెబ్బలాడుంటే, ఆదెబ్బలాడినోడు యింద్రజిత్తైయుండాలి! లేకపోతే, ఆపోరినోడే శరకాన్నైతే ఆ జంతువు, పెద్దపిల్లి అయివుండాలి!

1 వ వాడు—ఆడికూడా యెల్లినారంతా ఆడు పెద్దపులితో నే దెబ్బలాడేడన్నారు!

4 వ వాడు—ఆసెప్పటాలికేంలే! అల్లాఅని అంతాఅంటారు. దున్నపోతు యీనిందంటె దూణ్ణి కట్టెయ్యమనేరకం! సెప్పాడు మాటల్లోనా కేమీ గురిలేదు. కళ్ళతో చూత్తే యేమో అనుకోవచ్చు! మణిసేంటీ పెద్దపులితో యిద్దం సేయటం యేంటి!

3 వ వాడు—'ఇద్దం సేయటం యేంటి' అంటేనే తేలిపోయిందా యేంటి.

4 వ వాడు—అవునో! దెబ్బలాడేడంటే యెల్లాగో? ఓగుద్దుతో కొండంతా బద్దల్ కొట్టానంటే నమ్ముతావా? నీవు సెప్పేదానికి తలా తోకా లేకుండా ఉన్నది! ఇట్టం వచ్చినట్లు వాగితే

సరేంటి. పోనీ. సాచ్చెం సూపెట్టకలవా?

2 వ వాడు—దెబ్బలాటకోరులా గాపడుతోనాడు! ఆమాటపుచ్చుకు వాకేవరనగా సాగుతున్నాడు!

4 వ వాడు—నీ వాగుడు బాగావుంది కామోసు ! సెప్పాడుమాటలు యెట్టాగోళ్లు నమ్మతారు!

మఱొక పల్లెవాసి కొంచెము దూరమందు నెండలోఁగూరు చుని, తోటివారల మాటలు వినుచు, చివాలునలేచి ముందర కరుదెంచి, 4వవాని నుద్దేశించి. నువ్వు నిజం సెప్పేవో! సెప్పుడు మాట్లు యెట్టాగోళ్లే నమ్మతారు- కాని తర్చించి నిన్ను పెళ్నించు తాను, రా!

4 వ వాడు—మంచిది! ఏమి తర్చించుతావో తర్చించు ! (యిట్లని సదర్పమున నతఁడు ముందునకరుగును.)

5 వ వాడు—నీ పేరేంటి ?

4 వ వాడు—గెరటయ్యగోరు!

5 వ వాడు—గెరటయ్యని యెల్లా తెల్సింది ?

4 వ వాడు—ఆ పేరు మా అయ్య పెట్టేడు!

5 వ వాడు—మీాయయ్య పెట్టడం నీవు చూాచావూ ? యెపుడు పెట్టేడో గేపకం వుందా?

4 వ వాడు—లేదు,—కాని నన్నంతా గెరటయ్యని పిల్సుత్తారు.

5 వ వాడు—అల్లా అయితే, యిను—నీపేరు గెరటయ్యకాదు!

1 వ వాడు—కాకపోవటం యేంటో!

3 వ వాడు—మా బాగాపడింది! పోతుకు పోతుకూ పడింది. (నాలు గవవాని నుద్దేశించి) ఓరయ్యో ! మేము యేమీా యెఱుగని యెట్టి మొకాలమని నీయిద్దంతా సూపిద్దా మనుకొన్నావా?— సరే ! సూావు! యెల్లా సూావుతావో సూావు! (బుల్లెంకన్న నుద్దే

శించి) పూరుకుంటావేంటో! యెయ్యి! పెశ్నెయ్యి!

2 వ వాడు—(5 వ వాని నుద్దేశించి) యెనక్కి—తిరక్కు!—యెయ్యి! పెశ్నెయ్యి! ఆణ్ణి తలొంచుకోనేటట్టు చెయ్యి!

5వ వాడు—(గెరటయ్య నుద్దేశించి) నీబాబు పేరేంటో?

4వ వాడు—నల్లెంకన్న.

5వ వాడు—ఇది కూడా నువ్వు యిన్న ముక్కేనా?

4వ వాడు—ఇన్నముక్కెల్లా అయిందా?

5వ వాడు—ఇన్నముక్క కాపోతే, నీ అయ్యపేరు నల్లెంకన్నని నీకెల్లా తెల్సింది? యెవళ్లో సెపితే యిన్న మాటేనా?

4వ వాడు—అవును. అదో మోత్తరిన్నమాటనే సెప్పాలి!

5వ వాడు—మంచిది! నీ బాబు పేరు నల్లెంకన్న కాదు.

(మొదటి మువ్వురు వ్యక్తు లుత్సాహముతో 'వహావ్వా! వహావ్వా!!' యని గంతులు వైవ దొడంగుదురు.)

2వ వాడు—ఎయ్యి! పెశ్నెయ్యి! పెశ్నేసి కింద మడేయి. ఎంత పొగరు సూపేడో. గాడిద!

4వ వాడు—సరే, మా బాబుపేరు నల్లెంకన్న కాపోతే యింకేటి?

5వ వాడు—అది నాకేం తెల్సును? ఆడిపేరు చిట్టియ్యో లేక పొట్టియ్యో అయి వుంటుంది!

4వ వాడు—(క్రుద్ధస్వరమున) ఏంటీ! నేను గెరటైనైతే మా బాబు సిట్టెయ్యవుతాడా?

5వ వాడు—నువ్వు గెరటయ్యవు కావు!

4వ వాడు—నేను గెరటయ్యను కాకపోతే, యింకెవణ్ణి?

5వ వాడు—పిలకయ్యవు!

4వ వాడు—నిజమే! నేను పిలకయ్యనే! నేను పిలకయ్యనెల్లా అయినానో చూపిత్తాను నిలమడు!—(ఇట్లనిసి అతఁడు 5వ వాని శిరో

జముల చేబట్టుకొనివానిని చావమోద దోడంగెను.)

5వ వాడు—ఒరే! ఒరే!! నన్ను వదలరా బాబూ! అబ్బా అబ్బా! ఓయి నాయనో? వదలరా వదలరా!—ఏంట్రా చూత్తో ఊరు కుంటారు!—ఓయి బాబో!—

4వ వాడు—ఏలా వుంది. పులుచు! ఇపుడు సెప్పు నేను గెర టయ్యానో పిలకయ్యానో!—గెరటయ్యనే కాదా!

5వ వాడు—అవునవును! నువ్వు గెరటయ్యావు, నీ బాబు గెరటయ్యా, నీతాత గెరటయ్యా, నీముత్తాత•లందరు గెరటయ్యాలే!

4వ వాడు—నా బాబో?

5వ వాడు—గెరటయ్యని చెప్పేను కాదూ?

4వ వాడు—నేను గెరటయ్యనే నా బాబూ గెరటయ్యే! మల్లీ యిదేంటి. నా బాబు నల్లెంకన్నని ఒప్పుకో! లేకపోతే కిందపడేసి నీ మక్కెలు యిరగ మొత్తా.

5వ వాడు—ఓరి నాయనా వూరుకో! నల్లెంకన్న నీ బాబు అంటె నీకు సంతోసం అయితే, అల్లాగే అనుకో!

4వ వాడు—(వానిని వదలివైచి) గాడిదా! నా బాబును తాత ముత్తాతలును చెటిపేద్దా మనుకున్నావా?

5వ వాడు—ఇపుడు నేను వోడిపోయాను.

1వ వాడు—ఓడిపోడం యేంటి—దెబ్బలు తిన్నావనా.

3వ వాడు—ఎల్లా వోడిపోయినా డేంటి?

2వ వాడు—తర్కంలో నువ్వే గెల్చావు.

5వ వాడు—బాబుల్లారా! ఎవళ్ళకి వొంటో తీటుందో ఆళ్ళే తర్కంలో గెలుత్తారని నేనాళ్ళనుండి యెరుగుదును. అడిగో రహీమాన్ రాజా యిల్లా వస్తూన్నాడు—పరిగెయండి!—పరి గేయండి!! పరిగేయండేహే!!!

1వ వాడు—రహిమాన్ రాజా యెవడు?

4వ వాడు—పరిగేయుటం యెందుకు?

2వ వాడు—ఆ వచ్చేవోడేనా యేంటి? ఆడు మనిసేనా?

3వ వాడు—ఆడికి కోతికి రూపంలో పోలికుంది! ఏమంటావోయి బావా?

5వ వాడు—కాని బావ్యగారూ! ఆడుమనుసుల్నే తినేత్తాడుట యిన్నావా నువ్వు?

1వ వాడు—ఏంటి ఏంటి! తినేయడం మనుసుల్నే?—ఓరయ్యో!

5వ వాడు—ఆడు కిస్కింద దేశమునుంచి వచ్చాడు.

4వ వాడు—ఏంటి నిజమే నిజమ్మే. (5వ వాని మీదికి వచ్చును: 5వ వాడు రెండవవాని వెనుక దాగుకొనును)

4వ వాడు—(నవ్వుచు) పర్వా లేదు. రావోయి బావియ్యా (5వ వాని ముందుకు వచ్చును)

5వ వాడు—ఆడు కుంబకర్ణుడి మనవడు.

2వ వాడు—ఓర్ నాయనో!

5వ వాడు—ఆడి మీసాలు కాపట్టం లేదూ?

3వ వాడు—అవునురో! ఒరయ్యో! వాడచ్చంగా గజ్జిలిగాడులా ఉన్నాడు.

5వ వాడు—పరుగేయండి! పరుగేయండి!!

తక్కంగలవారందరు 'పరుగేయండి!!' అనుచు పలాయనమొనరించిరి. పిదప రెండవదిక్కునుండి రహిమానురాజా ప్రవేశించును.

రహిమాన్ రాజా—(5వ వాని నుద్దేశించి) ఒహో! కెరామత్! కాపు వేసము బాగుగా ధరించితివి!

కెరామత్—నన్నిక్కడున్నమన్నారు కాదా? కావందుగోరిని కని పెట్టుకున్నాను.

రహిమాన్ రాజా—మంచి పని చేసితివి! నీకు జెప్పిన విషయము మఱువక జ్ఞప్తియం దుంచికొంటివా?

కెరామత్—ఈడు ఝిట్టే మరచిపోయే మనిసికాడని కావందుగారు యెరగరేంటి? కాని బాబయ్యా! మీరు నాతో సెప్పిం దేంటండి?

రహిమాన్ రాజా—అది—వాడిని పట్టుకొనుట!

కెరామత్—వచ్చింది వచ్చింది జ్ఞాపకం వచ్చింది.

రహిమాన్ రాజా—అటులైన రేపు సిద్ధముగ నుండుము. ఉదయమే పాలకీ నెక్కి శర్ఖాన్ రాజసభకు పోవు సమయమందే సుమీ! తెలిసినదా?

కెరామత్—చిత్తం బాబయ్యా!

రహిమాన్ రాజా—ఈలోగా దూపటివానికి నేను చెప్పియుంచెదను. కాని అతఁడు శర్ఖాను నెఱుఁగడు—అందుచే వానిని గుర్తింపఁ జాలఁడు. వ్యాఘ్రముతో పోరి శర్ఖానయిదారు దినములనుండి మంచము బట్టియుండెను; ఇలువెడలి యావ్వలకు రాలేదు. రేపటి దినమున ప్రభాతకాలమందు రాజసభకు రమ్మని శర్ఖానుకు చక్రవర్తి కబురంపెను. అందుచేనతఁడు తప్పక నా తావునకు వచ్చును. ఆసమయము కనిపెట్టి నేఁ జెప్పిన ట్లాచరింపుము. వాని కాయమందు పులిచేసిన గాయము లింకను మాని యుండలేదు—తెలిసినదా!

కెరామత్—తెల్సింది బాబయ్యా! తెల్సింది!!

రహిమాన్ రాజా—నీవు శర్ఖానును బాగుగా నెఱుంగుదువా?

కెరామత్—అణ్ణి చూత్తూ చూత్తూ ఉండగానే నాగెడ్డం నెరిసిపోయింది! అణ్ణి యెరకపోవాలి కర్మం!

రహిమాన్ రాజా—మంచిది! నీ వా యేనుఁగుపైఁ గూరుచుండి

మావంటివానికి శఖ్రాసును చూపుము — తెలిసినదా?

కెరామత్ — కావలసినగోరూ! తెల్పియుండి!

రహిమాన్ రాజా — ఈ విషయ మెవరితో చెప్పకు సుమీ! కొంప మునిగిపోవును!

కెరామత్ — (జిహ్వాగ్రభాగమును ముఖము నుండి యీవలకు తీసి, దంతములతో దానిని నొక్కి నేత్రములఁ బెద్దగావించి) — అల్లా సెప్పేయటమే. యీడంత యెట్టిమాలోకం అనుకున్నారా యేంటి? (అని బిగ్గరగ నవ్వుచు.)

రహిమాన్ రాజా — మెల్లగ వచింపుము! కార్యసాఫల్యము కాగనే నీకు గొప్ప బహుమానము లభించును! నీ వింకఁ బొమ్ము.

(కెరామత్ నిష్క్రమించును.)

రహిమాన్ రాజా — తన పథమునుండి, శఖ్రానును తొలగించితినని చక్రవర్తి యెఱింగిన నతఁడెంత సంతసించును? "శార్దూలముతోఁ బోరి శఖ్రాను గెలుచుటచే మిగుల నానందించితిని; కాని శఖ్రానే కూలి, శార్దూలమే గెలిచిన నేనంతకంటె నెక్కుడుగ నానందించువాఁడ"నని ఆనాటిరాత్రి సామ్రాట్టు తెలిపినపుడే యతని యుద్దేశ్యము విశదమాయెను — రేపటినాయత్నములు విఫలములు కాకున్న, జిహాంగీ రెంత సంతసించును! ఇంతకు అదృష్టమే కారణముకదా!

## చతుర్థదృశ్యము

ఆగ్రాయందు శఖ్రానుగృహము — రాత్రికాలము.

రెండవ యంతస్థు నందలి యాగారమందుఁ గూరుచుండి నూర్జహాను చారుమతి యను చెలికత్తెతోఁ బ్రసంగించుచుండును.

నూర్జహాన్ — ఆ నాఁడు సార్వభౌముఁ డనుచరసహితుఁడై వేటనుండి మగుడి వచ్చుచు, మన యింటి ప్రక్కనున్న మార్గమునఁ బోవుటఁ జూచితివి కదా! రాజాను చరులలో ననేకులు 'శబాన్ శఖ్రాన్'

సెబాసు! శేర్ఖా'నను జయధ్వనులఁ గావించిరి. కుతూహలముతో నుత్సవమును జూడ నే గవాక్షము దరి కరిగితిని.

చారుమతి—తదుపరి?

నూర్జహాన్—గవాక్షపథమునుండి వెలుపలికిఁ జూడఁ గన్నుల పండువౌనట్టి మహాసమారోహ మొకటి కానంబడియె. సార్వభౌముఁ డొక యలంకృత ఘోటకముపై నుపవిష్టుఁడై యుండెను. అతఁ డాకస్మికముగఁ బైకి చూచెను. మా యిరువురి దృక్కు లొక దానినొకటి దారసిల్లెను. సార్వభౌముని ముఖ ముజ్జ్వలమైపోయెను. నానాడు లందుష్ణరక్తస్రోతము ప్రవహింపఁదొడంగెను. రోషలజ్జా క్షోభలు మనంబునఁ బెనఁగొన నే వెనుకకు మరలితిని. తదనంతరమే నా ప్రియుండు క్షతపూరితగాత్రుఁడై యింటి కేతెంచెను. వచ్చి, యట్టుంటి వేల యని నన్ను ప్రశ్నించెను. అతని స్వరము దూషణ భాషణముకంటె నధిక కర్కశమై యుండెను.

చారుమతి—ప్రథమమునుండి చక్రవర్తియందు నీ చిత్తంబు తగుల్కొని యుండ నీవు శేర్ఖాను పత్ని వగుటకు సమ్మతించుట కడు ననుచితము గాదా?

నూర్జహాన్—నే నెన్నండును చక్రవర్తిని ప్రేమించి యుండలేదు. ఆ యితిహాసమును నీకు నే నెన్నఁడును దెలిపియుండలేదు. అదెవ్వరికిని తెలియదు. కాని నీకు నేఁడు దానిని దెలిపెదను. ఏలనన ఈ యవసరమందున నాకు నీ యుపదేశ మత్యంతావశ్యకంబు.

చారుమతి—మంచి దాయితిహాసమేమో దెలుపుము.

నూర్జహాన్—(ఒకించుక చింతించి)—తెలిపెదను-వినుము. అపుడు నాకింకను పరిణయము కాలేదు. కాని శేర్ఖానునకు నన్నొసఁగి పాణిగ్రహణ మాచరింప నా జనకుఁడు నిశ్చయించెను. అపుడు భారత చక్రవర్తి యక్బరుసాహా ఒకనాఁటి నిశీథమునఁ జక్రవర్తి పరి

వారము భోజన మొనరించిన పిదప నతిథి యభ్యాగతులందరు తమతమ నిలయములకు మగుడి చనిరి. అంతఃపురమందపుడు సార్వభౌముని పరిజనులు తక్క మఱెవ్వరును లేరు. అత్తఱి నేనును మఱికొందఱు కాంతలును గూడి, మోములు వంచుకొని తేనిసమ్ముఖమందు నృత్య మొనరింప సాగితిమి.

చారుమతి—నృత్య మేల సలిపితిరి?

నూర్జహాన్—చక్రవర్తి యాత్మీయుల కాంతలు మేలిముసుగులు దాల్చి యపుడపుడు పాదుషాయెదుట నృత్యంబు సలుపు టొక వాడుక యని యెఱుంగవా?

చారుమతి—అటులనా!

నూర్జహాన్—నా జనకుఁడు సార్వభౌమున కత్యంతప్రియపాత్రుఁడగుటచే, చక్రవర్తి యాత్మీయులలో నొక్కఁడుగఁ బరిగణింపఁబడుచుండెను. రాత్రులందు నృత్యము సల్పు టనుచితమని యతఁడు కతిపయదినంబులు నన్ను నిలయాభ్యంతరమందె యుంచి తాను చక్రవర్తి కడకరుగుచుండువాఁడు. పిమ్మట "యవకుంఠనవతివై నృత్యం బొనరించిన నెవ్వరును గుఱితింప జాలరనియు దానం జేసి నర్తనక్రియాభిరతవైన సోదరిప్రార్థన నాలించి యప్పటి యట్లామెను మహిళాపరివారంబునఁ గలసి నాట్యక్రీడావినోదముల సలుప నిండ"నియు నాసోదరుఁడగు యసఫ్ జనకుని వేఁడ యతఁ డందున కీయకొనెను.

చారుమతి—(ఆతురయై) తరువాత తరువాత?

నూర్జహాన్—గభీరనిశీథమున వివిధ విద్యుద్దీపద్యుతులు కనుల మిరుమిట్లు గొలుపుచుండ మేము నృత్య మొనరింపసాగితిమి. యావనుం డగు సలీము మానమత్తునునఁ గూరుచుండి యనిమేష నయనుండై నర్తనంబు విలోకింప దొడంగెను. వాద్యంబుపైఁ

దేలు మానృత్యము తరంగాగ్రములందుఁ దేలియాడు పడవవలె మృదుస్వనమున నూగసాగెను. పిమ్మట రాగాలాపన మొన రింపఁ బొడఁగి, మేలిముసుఁగులోనుండియే విలోకించితిమి. ఆయు వకుఁడు నానృత్యగానంబులచే ముగ్ధుండై నాపై తన యనురాగ విలోకనముల బ్రసరింపసాగెను. అపుడు నాముఖమును గప్పి యున్న మేలిముసుంగు తనంతదానె వసుంధరపైఁబడిపోయెను. అపుడు మా యిరువురి దృష్టులు సమ్మిళితంబులై పోయెను. మిగుల సిగ్గుపడి నేను ముఖావరణమును నేలనుండి దీసికొని ముఖంబున కప్పివైచుకొంటిని. సలీ మపుడు చివాలున లేచి, నాముందున కరుదెంచి యున్మత్తప్రాయుండై నన్నుఁ గదియ గమకించెను. అది గాంచి రాజపరివార మతనిని వెనుకకు మర లించిరి. దాన సభా భంగమాయెను. విజయ గర్వంబున నేను నిజాలయంబు నేరితిని.

చారుమతి—ఇవు డంతయు గ్రహింపఁ గలిగితిని.

నూర్జహాన్—రెండు దినములు గడచిన పిదప, నాజనకుఁడును, నాసో దరుఁడును సదనమున లేని సన్న మెఱిఁగి సలీము మెల్లగ నా శయన మందిరములోని కరుదెంచెను. ఆయువకుని యుద్భ్రాంత ప్రసంగమువలన నాజయము సంపూర్ణమాయెనని గ్రహింపగలిగి తిని. నే నేమియుఁ బలుకక నతముఖినై యుంటిని. అత్తఱినా జనయిత్రి నిజావాసమునకు మగుడివచ్చెను. నాజనకుని జాడ నెఱింగి సలీము మెల్ల మెల్లగఁ బ్రాంగణమునుండి యావలికి దాటెను. తదనంతరమే యక్బరు పాదుషా శక్ఖానునకు నన్నొసంగి పెండ్లి యొనరించి, నాభర్తను వర్ధమానురాష్ట్ర (Burdwan) శాసన కర్తను గావించి మమ్మా తావున కంపెను.

చారుమతి—తదనంతరమున సలీమును నీవుమఱలఁగలసికొన లేదా?

నూర్జహాన్—లేదు. తిరుగ నాగ్రా వచ్చిన పిదప నానాఁడు గవాక్ష మార్గమున మాయిరువురి దృక్కులు మాత్రము కలిసికొనెను.

చారుమతి—ఇప్పుడు నీ కింకను వానిపై ననురాగమున్నదా?

నూర్జహాను—అనురాగము లేదు. కాని యుచ్ఛ్రుప్రత్యాశయాహాం కారముల వంటి యుద్దామప్రవృత్తి మాత్రము నాహృదయమును వేధించుచుండెను.

చారుమతి—సుందరీ! నీ విందుండక బిజాన వర్ధమాను పోవు టుత్త మము. లేకున్న నీకెన్నేని యరిష్టములు వాటిల్లును. నీవు దూరంబుగనరిగినచో, చిత్తంబు పురాతనమందు మరల విలీన మైయుండును.

నూర్జహాను—(అర్ధస్వగతమున) కాని శ్ఖానువంటి పతి లభించు టరిది. వీర్యౌదార్య పవిత్రచరితంబు లందు నతని బోలిన వా రీజగంబం దెందుగలరు?—అరుగో! నాజనకునితో వా రిట్లే వచ్చుచున్నారు.

చారుమతి—సోదరీ! ఇఁక నేనరిగెద.

నూర్జహాను—మంచిది. ఈవిషయ మెవ్వరికిని దెలుపకు సుమీ. ప్రాణసఖివగుట నీకు నాయతీతగాధనంతయుఁ దెల్లంబుగఁదెలిపి వైచితిని.

చారుమతి—అట్లు తెలుపుదానను గాను—కాని, నెచ్చెలీ! ఆలస్య మాచరింపక నీవు మరల వర్ధమానునకు పొమ్ము.

నూర్జహాన్—రమ్మి! నిన్ను మార్గమ్మువఱకు సాగనంపి వచ్చెదను.

ఇట్లని ఆయిరువురు నెలంతులు నిష్క్రమింతురు. క్షణకాలా నంతరమున ప్రసంగించుచు శ్ఖాను యయాసా లాయింటఁ ప్రవేశిం తురు.

అయాసా—చేత నాయుధము లేకుండ భయానక భయ నకంబు

తో భండన మొనరింప నీవరిగి నపుడు నే నెంతయో భయపడి తిని. నిర్విక్రమ పరాక్రముఁడవగుట, నీవాఘాతుక మృగంబును జంపివచ్చితివి. కాని నేఁడు మరల నతఁడు నిన్ను మదపుటేనుఁగు కాళ్ళమట్టింపఁ దలఁచెను. ఈయత్నంబులవలన, చక్రవర్తి నీయసువులఁ గొనఁగడునాతురుండై యున్నట్లు తెల్లమగుచున్నది. కాని న్యాయవిచార దక్షుండనను గర్వంబుననే చక్రవర్తి ప్రకాశముగ నిన్ను జయింపఁ దొడగక యిట్టి గుప్తోపాయంబుల నవలంబించు చున్నాఁడు. నీవు గాన, నామత్తేభమును ద్రుంచి వచ్చితివి! మరొక్కఁడైన నిశ్చయముగ నాగంధగజేంద్ర చరణాఘాతమునఁ జూర్ణమై యుండును.

శర్ఖాన్—నాయనమరులఁగొనిన సామ్రాట్టు కేమి మేలు నేనురునో నేనెఱుంగఁ జాలకుంటిని.

అయాసా—శర్ఖానూ! సరళోదారుండవగుటచే నిన్ను నే నెంతయుఁ బ్రేమింతును. పాదుషా జేయుచున్న కార్యము లందలి మర్మంబును నీ కీ వరలో నే నెన్నండును తెలిపియుండలేదు. ఇపు డీక నిజంబును దాచియుంచుట యయుక్తము. నీవు మరణించిన చక్రవర్తికిఁ గలుఁగు మేలు నీపత్ని వానికి లభ్యమగుటే!

శర్ఖాన్—ఏమి!—అట్లైన చక్రవర్తి—యిట్లని శర్ఖా నాకస్మికముగఁ గత్తిపైఁ జేయివైచెను.

అయాసా—నీవిట్లుద్రేకుఁడవుగాకుము. స్థిరచిత్తుఁడవై, నేఁ జెప్పు దానిని వినుము. మిహిరునిస్సాకును నీకును పరిణయము కాక పూర్వము జరిగిన విషయములు జ్ఞప్తియందున్నవా?

శర్ఖాన్—జ్ఞప్తియం దుండ కేమి—కాని, మనుష్యుఁ డింత నీచుఁడై పాపంబని తలంపక పరదారా—

అయాసా—శర్ఖానూ! నాయుపదేశము వినుము. నీవు వేగమే వంగ

భూమికి వెడలి పొమ్ము. చక్రవర్తి దృఢ చిత్తుండై యుండును. నీవిందుండిన, నీజీవములు నిలువఁ జాలవు.

శఖ్రాన్—తిరిగి పోదునా?

అయగాసా—అవును. మఱలి పొమ్ము! ఇచట నిఁక నుండు నంత కాల మప్రమత్తుండవై యుండుము. నిలయంబు వీడి వెలుపలి కరుగకుము. నీశరీరమందింకను మున్న వ్యాఘ్ర మొనర్చిన గాయములు గానవచ్చుచుండెను. నీవు మరల బట్టుదువేమోయని వెఱగొందుచుంటిని. వెలుపలి కరుగక నిజసదన ద్వారమును బంధించికొని శయనింపుము—రాత్రి చాలా గడచిపోయెను. ఇఁక నేఁ బోయెదను.—

(యిట్లని యా వృద్ధుఁ డయ్యాగారమునుండి మెల్లగ వెలుపలి కరుగును.)

శఖ్రాన్—పరవతి యనిఁ దలంపక సామ్రాట్—ఏమి ఘోర మేమి ఘోరము?

(ఈ సమయమున నూర్జహా నాయాగారమునఁ బ్రవేశించును).

శఖ్రాన్—ప్రియా! ఇంతదనుక నెందుంటివి?

నూర్జహాను—చారుమతి యను నా చెలికత్తె యొకర్తుక యియ్యెడ కరుదెంచెను. ఆమెను సాగనంపఁ గ్రింది కరిగితిని. నా జనకుఁ డరుదెంచెనా?

శఖ్రాన్—అరుదెంచెను. (మృదుస్వరమున) ప్రియా! మనము మరల వర్ధమానము పోదము రమ్ము.

నూర్జహాన్—(ఆకస్మికముగ)—మంచిది! మంచిది!!—అటులనే పోదము!—రేపే పోదము!—

శఖ్రాన్—ఇంత యుత్తేజిత వౌచుంటివేల? ఏ మాయెను?

నూర్జహాను—ఏమియుఁ గాలేదు. ఒక్కనిముసమైన నిందుండ నిచ్చగింపను—(దృఢస్వరమున) నే నిచ్చో నిలువఁజాలను!

శ్ఖర్గాణ్—మంచిది. మన మచిరకాలములోనే వర్ధమానను వెడలి పోదము. ఇఁకఁ గ్రిందికి నడువుము-భోజన మొనర్చి శయనింతము.

పంచమ దృశ్యము

ఆగ్రాయందు జిహాంగీరు ప్రాసాదము

అపరాహ్ణకాలము చక్రవర్తి యేకాకియై ఆ యాగారమందుఁ బచారు చేయుచుండును.

జిహాంగీరు—ఇఁక నీకోరిక నడంచుకొనఁ జాలను! ఆ దినంబునుండి యున్మాదము, నాచేతనంబును స్వాధీనము గావించుకొనియెను! స్మృతికారణమును దొలఁగింప నేరకుంటిని. నీలపయోదాభ్యంతర సౌదామినివలె నా యెలనాగ మోమానాఁడు గవాక్షపథమున దోచి నిముసకాలము నా హృదయాంధకారమును బాపెను. కాని మరల నట్టి తటిత్కాంతిని గాంచు భాగ్యము నా నేత్రముల కెన్న డబ్బునోకదా! ఆ పంకరుహదళాయతాక్షి సౌందర్యమెంత యద్భుతంబైనది! ఆకాంత కాంతి సునుమంచు తెరలపైఁ బ్రకాశించు నుషఃకాంతివలె గన్పట్టెఁగదా! నిక్కంబుగ నదేమి గ్రహింపఁ జాలకుంటిని! స్తబ్ధనిశీథమందలి భైరవీరాగ ప్రథమాలాపఝుంకారమై యుండునా! లేక, మనుష్య ప్రథమయౌవన ప్రభాతమేమో! అదొక నిఃసంగసుఖంబువంటిది కాదు!—మధురరాగిణివంటిది కాదు! ప్రస్ఫుటిత పుష్పస్ఫూర్తి కాదు! అదొక యానందోద్యానమో, సౌందర్యతరంగ కల్లోలమో, మహిమసమారోహమో నై యుండవలెను!—అది భారతవర్షంబునకుఁ జెందినదికాదు! ఇరాను విషయంబునకుఁ జెందునది కాదు! అరబ్బీసీమకుఁ జెందునది కాదు. భూతభవిష్యద్వర్తమానములకుఁ జెందునదికాదు! స్వర్గంబునకుఁ జెందునదికాదు! మర్త్యంబునకుఁ జెందునదికాదు! అది అన్నిసీమలకు, నన్ని

కాలంబులకుఁ జెందినదై యుండును. స్వర్గమర్త్య లోకాభ్యంతరసంరక్షిత పృథక్సృష్టియై యుండును!—అమరప్రేషణంబని గాని, కవి స్వప్నంబని కాని, బ్రహ్మాండవిస్మయంబనిగాని, దానిఁ దలంపవచ్చును!— ఆహా! ఏమి మాయానిర్వాచ్యలావణ్యము !, ఏమి యీ యుంచిత సౌందర్యము !!

ఈసమయమున రహిమాన్ రాజా యరుదెంచి
చక్రవర్తి కభివాదన మొనరించును.

జహాంగీరు—రాజా! వచ్చితిరా! ఇంతవనుక నత్యాతురతతో మీ కొఱకై ప్రతీక్షించుచుంటిని.

రహిమాన్—దేవర యనుజ్ఞ సెలవిండు.

జహాంగీరు—నే నేల మి మ్మాహ్వానించితినో గ్రహించితిరని తలంచెద.

రహిమాన్—చిత్తము మహాప్రభూ!

జహాంగీరు—శేర్ఖా నిచటనుండి వంగసీమకు వెడలిపోయెను— ఈ హేతువువలననే బోయెననుట నిక్కువము! మఱొక కారణంబైన, నిస్సందేహముగ నతడు నాతోఁ జెప్పియే యుండును!

రహిమాన్—అవునవును.

జహాంగీరు—ఇఁక నాయభీష్టమును దాచి యుంచుటయేల? శేర్ఖాను నర్ధాంగియైన యీ యప్సరఃకాంత నాకు గావలయును. (ఆవేగముతో) గ్రహించితిరా?

రహిమాన్—(కంపాన్వితకాయుఁడై యస్ఫుటస్వరమున) "చిత్తము మహాప్రభూ!"

జహాంగీరు—భయపడకుఁడు. నేనత్యంతోత్తేజితుఁడనైతిని. శేర్ఖానుపైఁ గోపించుచుంటినిగాని మీపైఁ గినియుటలేదు. తాము నాయభీష్టమును ముందే గ్రహించియుంటిరని తలఁచెద. అట్లయ్యు దానిని

మీకడ వ్యక్తీకరింప సాహసించితిని. మీయందు నేను మిగుల ప్రసన్నుఁడనై యున్నాను. సఫలీకృత మనోరథులు కాఁగలరు గుచో, తమకు నే నాశాతీతపురస్కార మొసఁగెదను.—ఆ హేమాంగిని బడసినగాని నేను నిదురింపఁజాలను.

రహిమాన్—ప్రభూ! మీరు తెలిపినది తెల్లమయ్యెను.

జహాంగీరు—ఈ కార్యనిర్వహణార్థమై యప్రమత్తుఁడవై యుండుమని వంగసీమ సుబేదారునకు లిఖించితిని. అతఁడు కడు భీరుఁడై ఈ విషయమున నుదాసీనత్వమును జూపుచుండెను. మీ రచటి కరిగి తగు విధంబున వానికి ప్రోత్సాహ మొసరింపవలయును. గ్రహించితిరా?

రహిమాన్—చిత్తము మహాప్రభూ!

జహాంగీరు—రేపే—రేపకడనే పోవలయును. గ్రహించితిరా! ఆలస్య మాచరింపరాదు. కార్యము త్వరితమ్ముగఁ గావింపఁబడవలయును! ఆ వనజగంధిని వేగమ నా బాహుద్వంద్వమునఁ బడవేయవలయును—గ్రహించితిరా?

రహిమాన్—చిత్తము మహాప్రభూ!

జహాంగీరు—ఇఁక మీరు వెడలిపోవచ్చును—ఆశాతీతపురస్కారము!—గ్రహించితిరా?

రహిమాన్—చిత్తము మహాప్రభూ!

జహాంగీరు—ఇఁకఁ బొండు.

(రహిమాన్ నిష్క్రమించును.)

జహాంగీరు—ఇది ఘోరతరాన్యాయమని నే నెఱుంగుదును. నిక్కముగ నిది భయానకవిచారము! ఎట్లైనను శర్ఖానును జంపినఁగాని నా కా ప్రఫుల్లముఖి యలవడు టసాధ్యము. నిజదార పరిత్యాగము నలిపి, స్వర్ణసమానకాయయగు తన భార్యను మిహిరు

నిస్సాను నాకర్పింపవలయునని నయంబున భయంబున నేనాతనితో జెప్పితిని. కాలంద్రొక్కిన భీకరదర్వీకంబువలె నా ఘాతుకుండు ఘోరోచితప్రత్యుత్తర మొసంగెను. ఆ కనకాంగిని నా భుజ మృణాళబంధమం దుంచుకొనవానిని మట్టుపెట్టవలయును — వికారంబున వాంతియగు తరిని స్వాదు హితకర భోజ్యవస్తువులు కూడ వెలువడవలయును! న్యాయాన్యాయ విచారము బహుదూరము పోయినది! హితాహిత వివేచనాశక్తి నన్ను విడచి మెచటికో యరిగినది! ఇంక దుర్నయంబున కొడిగట్టవలయును! నిక్కముగ నతండు యమాలయము నేగవలయును! అనంతర మా సీమంతినీ చూడామణి ఆహా! ఆ రాజానన పొందు లభించు భాగ్యము నా కెపుడలవడునో గదా!

షష్టమ దృశ్యము.

పాండువాయందు శర్ఖానుగృహము — రాత్రికాలము లయలా పాడుచుండును. శర్ఖాను నూర్జహాను లొక్కచో నుపవిష్టులై పాట వినుచుందురు.

గీ. వర్షధారలు పుడమిని బడకయున్న,
వసుధముఖమునం దోంపదు హాసరేఖ;
తోంచెబో, లోన నుజ్జ్వల ద్యుతులతోడ
భయముగొలుపు స్ఫులింగసంచయము మెవుడు.

నూర్జహాన్ — లయలా! నీకా పాట నెవరు నేర్పిరి?

లయలా — పినతల్లి.

నూర్జహాన్ — ఏమి ఆమె సాహసము?

శర్ఖాన్ — సతీ! ఈపాటం బాడినందున దోసమేమి?

నూర్జహాన్ — అదేమో మీ రెఱుంగంజాలరు. లయలా! ఇంక నెన్నడీగీతము నాకడం బాడకుము. తెలిసినదా?

లయలా—జననీ! పాడను.

నూర్జహాన్—ఇఁకఁ బోయి పరుండుము. నే నిప్పుడే వచ్చెదను.

(లయలా వెడలిపోవును. నూర్జహాన్ కొంతసేపు గవాక్ష మార్గమునుండి వెలుపలికిఁదనదృక్కుల సారించును.)

శఖ్రాన్—(సమీపించి తన కొనగోళ్ళతో నామె శిరోజములదువ్వుచు) "చిత్తగంజనీ! ఇటు చూడుము."!

నూర్జహాన్—నాథా! మన్నింపుడు.

శఖ్రాన్—ప్రియా! నీయందెట్టి తప్పును లేదు. ఏలకో నీ మనంబు కలవరపడుచున్నట్లు తోచుచున్నది. ఇట్లేల నీ ప్రఫుల్లవదనము వాడియున్నదో తెలుపుము.

మిహారునిస్సా—(నిస్తబ్ధయై యుండును)

శఖ్రాను—(ఆమె కరపల్లవముల నిజహస్తంబుల నిడికొని, ఆమెను చెంతకుఁ జేరదీసి) "నిశ్చయముగ నేదేని జరిగియుండవలెను. విషకీటకమువంటి చింత యేదియో నీ చిత్తమందు ప్రవేశించి యుండును. ప్రేయసీ! ఆ చింత యేదియో తెలుపుము. నేను నీ పతిని గానా? నిక్కమ్ము నాకడఁ దాపఁదగునా!"

నూర్జహాన్—వల్లభా! నేఁ దెలుపవలసిన దేమియు లేదు. రాత్రి చాల గడచిపోయెను. ఇఁక శయనింపుఁడు. నే నిప్పుడ వచ్చెదను. తనయ యొక్కతియె యున్నది. (ఇట్లని నూర్జహాన్ తలవంచుకుని మెల్లగ వెడలిపోవును)

శఖ్రాన్—ఆగ్రానుండి పాండువా వచ్చినప్పటినుండి నా సతి విశేషాధీరయై, ప్రసంగించు సమయమున నాకస్మికముగ, విచలితయగుచు, తదనంతర మనునయ మొనరించుచుండెను. బహిఃప్రాణంబగు నా యర్ధాంగి యిట్లుండుటకు గత మేమి? నీ దుఃఖ మేమో తెలుపుమని యడిగిన నిరుత్తర యగుచుండెను. సుఖంబునకు నిధానమైన

నా నిలయమునం దేల నీ యుత్పాతచిహ్నము లంకురించుచున్నవి.
ఓ అదేమి శబ్దము! వ్యాఘ్రరవమై యుండును! పాండుయా యరు
దెంచినపిదప సౌఖ్యంబుగ నుండకున్నను విపత్తు లేకుండ నుంటిని.
ఓ? ఏమి యీ గభీర నిశీధిని;—నిదుర వచ్చుచున్నది.

(శర్ఖాను శయనించి నిదురించును. క్షణాంతరమునం
గొందరు దస్యు లప్రమత్తులై మెల్లమెల్లగ నడుగులిడుచు,
నాయాగారమందుం బ్రవేశింతురు)

దండుండు—(నిమ్నస్వరమున) నిదురపోవుచుండెను!

సాంబుండు—(అట్లే) యెయ్యి! దెబ్బెయ్యి!!

శంభుండు—(అట్లే)—అందఱు కత్తులం బైకిం దీసి సిద్ధముగ నుండుండు.

సాంబుండు—(అట్లే)—ఇంకా సిద్ధ వేంటి!

మల్లుండు—(అట్లే)—పాఱిపోకుండం జూడవలయును!

వీరుండు—(అట్లే)—ఇంకం జూడవలసిన దేమి? వేయండి! ఇదిగో! నేను కత్తిని దీశాను.

[దస్యుపంచకము శర్ఖానును జంప నుంకించ నుద్యుక్తులై తురు!]

దస్యునాయకుండు—(దస్యు సమక్షమునకు వచ్చి) మన మందరముం గలసి యొక్క మానిసిని హతం బొనరించుటం దగదు. పైగా నీతండు నిదురించియుండెను! వానిని మేల్కొంచనిండు. వెనుకకు రండు!

(దొంగల వచనంబులచే శర్ఖానుకు నిద్రాభంగ మాయెను.)

శర్ఖాన్—(కండ్లు నులుముకొని లేచి దొంగల వీక్షించి) మరల దండధరుని కింకరు లరుదెంచిరి! వచ్చిన నేమి! (యిట్లని యతండు స్వీయకృపాణమునుదీయనుద్యుక్తుండౌతరి, దస్యులతనిం జుట్టుముట్టిరి.

దొంగల నాయకుండు — (నిజానుచరుల నుద్దేశించి) "ఒకిం

చుక తాళుఁడు. తరవారిని దీసికొననిండు"

శ్ఖాను—(చివాలున శయ్యపైనుండి వసుంధరపై లంఘించి నిజ ఖడ్గమును చేఁబూని దాని ఝళిపించుచు)—"యిఁక రండు"

శ్ఖాను—(కొంతసేపు పోరి, చోరపంచకంబును హతంబొనరించి, నాయకు నుద్దేశించి).

"శూరా! నిన్ను నేను సమయింపను—నీవు నాకుఁ బ్రాణదానమొసఁగితివి. నీ యస్త్రము పరిత్యజింపుము.

దస్యుభర్త—(కత్తివిడిచిపెట్టును)

శ్ఖాన్—దొంగలఱేఁడా! నీ వెవరి యాజ్ఞచే నన్నీ సమయమున సమయింపవచ్చితివి?

నూర్జ—(ప్రవేశించి గృహమ్మంతయు శవములతో, రక్తముతో నిండియుండుటయు, నిజేశుఁడు రక్తాక్తుఁడగుటయుఁ గాంచి, భీతిచేత నక్లైమై భయకంపితాంగయై,)—"ఇదేమి! నాథా! ఈ మృతనరులెవ్వరు? భీతిఁ గొంపు దయ్యమువలెఁ గన్పట్టుచుంటి రేమి?" యనెను.

శ్ఖాన్—సతీ! భీతిఁ జెందకుము. నేను వీరల నందఱఁ దుదముట్టించితిని. ఈ దొంగల యొడయుఁడొక విధంబున నన్ను రక్షించెనని చెప్పవచ్చును.--దస్యునాయకుఁడా! నీ వెవ్వరి బనుపున నన్ను వధింపవచ్చితివో తెలుపుము.

దస్యుపతి—సుబేదారు పనుపున

శ్ఖాన్—అతఁడు నన్నేల వధింపనిచ్ఛగించెను?

దొంగల రాయఁడు—అట్లొనర్పఁ బాదుషా వాని కాజ్ఞ నొసఁగెను.

శ్ఖాను—(పత్నిపై నొకమారు చూడ్కుల నిగిడించి, పిదపఁ జోరయేలికఁ గాంచి)—"ఇఁక నీవు పొమ్ము."

(దస్యుపాలకుఁడు నిష్క్రమించును.)

నూర్జహాన్—చక్రవర్తి హింస యుచటికిఁగూడ నడచివచ్చెనా? ఏమి యత్యాచార మేమి దౌర్జాత్మ్యము!

సప్తమదృశ్యము

అక్బరుచక్రవర్తి సమాధిదగ్గర కాననము—రాత్రికాలము

చక్రాంతకారు (Plotters) లందు నిలువంబడి-యెవరికొఱకో యెదురుచూచు చున్నట్లుండిరి.)

కరభకుఁడు—పాదుషా యగ్రనందనుఁడు విద్రోహ మాచరించుట కియ్యకొనునేమో చూడవలయును.

శ్యాలకుఁడు—అతఁ డందుల కీయకొనునని తలంపను.

కాపాలికుఁడు—చంచలమతి!—అతఁ డేమి గావింపఁగలఁడు!—

మాధవ్యుఁడు—మానసింహుఁడే మనకుఁ దోడ్పడినచో,

కరభకుఁడు—జహంగీరుకు విరుద్ధముగ నెన్నఁడును కృపాణముఁ జేబూననని మహాత్ముండగు నక్బరు యవసాన సమయమందతఁడు సమయ మొనరించెను. అతఁడు తన యచలప్రతిజ్ఞను భంగంబుఁ గావింపఁజాలఁడు.

శ్యాలకుఁడు—విఫలయత్నులమయ్యు, మన కేమియుఁ గొఱంత రాదు.

కాపాలికుఁడు—అదుగో! ఆతఁ డిచటకే వచ్చుచుండెను.

(ఖుస్రు ప్రవేశించును.)

కుట్రగాండ్రందఱు—వందేగి (సలాము) యువరాజా!

మాధవ్యుఁడు—చాలసేపటినుండి నీకొఱకై వేచియుంటిమి. యువరాజా! ఇంత యాలస్య మాచరించితి రేల?

ఖుస్రు—జనకుఁడు నా యాచరణముల శంకింపసాగెను. పితామహుని సమాధికి సుమపూజఁ గావింతునని జనకుని కెఱింగించి వచ్చితిని. కాని గూఢచారులు నన్ననుసరించి చాలదూర మరుదెంచిరి.

కరభకుఁడు—ఆ విషయము లెటుంచుఁడు. తా మిపుడందుల కియ్యకొంటిరా?

ఖుస్రు—జనకునికి విరుద్ధముగ విద్రోహము సలుపుట సాధ్యాతీతమని బహు వివేచనానంతరమున నెఱింగికొంటిని.

శ్యాలకుఁడు—యువరాజా! అట్లనుచుంటిరేమి!--ఇంధనములు ప్రస్తుతములై యున్నవి. మీరందగ్నిని మాత్రము రగుల్పవలయును. తా మొనరింపవలసిన దింతియే. శేషకృత్యమును మేమే కావించి వైతుము. ఇప్పుడు వెనుదీయు టుచితము కాదు!

ఖుస్రు—ఈ యాచరణ నిర్వహణార్థము నేనెట్టి ప్రతిజ్ఞను గావించి యుండలేదు.

కాపాలికుఁడు—ప్రతిజ్ఞ గావింపలేదా! అట్లొనర్చితిరని తలంచుచున్నారము.

ఖుస్రు—ఈ యత్నములన్నియు నిష్ఫలంబులగుట నిక్కువము. మనము జయోపేతులము కాఁజాలము. మేనమామగారగు మానసింహుఁడేతోడైన,—

మాధవ్యుఁడు—"తోడైన" ననుచుంటి రేమి? అతఁడు మనకుఁ దోడు పడసంసిద్ధుఁడై యుండెను.

ఖుస్రు—అటులనా! అట్లని నే నెఱుంగను.

మాధవ్యుఁడు—కాని బహిరంగముగ నతఁడేమియుఁ గావింపఁడు. చేయు సాయమంతయు రహస్యమునఁ గావించును!

ఖుస్రు—అట్లా!—నిక్కువమును మీ రెఱుంగుదురా?

అందరు—ఎఱుంగుదు మెఱుంగుదుము.

ఖుస్రు—(క్షణకాల మాలోచించి) కాని,—

కరభకుఁడు—యువరాజా! ఈ విషయమందు మరల 'కాని' యనుచుంటిరేల? జహాంగీరును సింహాసనచ్యుతునిగావించి మీకు

రాజ్యాభిషేక మొనరింప మేము ప్రతినఁబూనితిమి.

ఖుస్రు—(మరల యోచించి,) తుదివరకు మీరలు నాకుఁ దోడ్పడుదురా?

అందఱు—నిశ్చయముగఁ దోడ్పడుదుము.

ఖుస్రు—ఈ గభీరనిశీథమును విలోకింపుడు. పూజ్యులైన పితామహుని సమాధిని వీక్షింపుఁడు. ఈ తావునం దీనముహూర్తమునఁ గడ వరకు మీకు సహాయ మొనరింతు మని గంభీరభావమున శపథంబు పలుకుఁడు.

అందరు—అట్లే యని శపథపూర్వకముగ బలుకుచుంటిమి.

ఖుస్రు—మంచిది నేనిఁక సమ్మతించితిని.

మాధవ్యుఁడు—రా కొమరుని కొక మంచియోచన దెలుపుదునా?

ఖుస్రు—ఏమి?

మాధవ్యుఁడు—పితృహ—

ఖుస్రు—ఏమి! పితృహత్యయందువా!—అట్టి ఘోరకృత్యము నే నొనరింపఁజాలను. రాజ్యచ్యుతుఁడైనను నాజనకుఁడు సుఖంబుగ గాలంబు బుచ్చవలయును. పితృరుధిరసిక్త హస్తుండనై నే రాజదండధారణ మొనరింపనేరను.

అందఱు—మంచిది మంచిది. యువరాజిట్లు వచించుట సమంజసము.

కరభకుఁడు—అట్లైన రేపటి ప్రభాతమందె నిజసైన్యముల దోడ్కొని ఢిల్లీనగరమును ముట్టడింతము.

శ్యాలకుఁడు—నిక్కువముగ నట్లొనర్పవలయును. కాని మన మిప్పుడా ధనబండారములను శస్త్రభాండారములను హస్తగత మొనరించుకొన వలయును.

కాపాలికుఁడు—యువరాజా? మీరిఁక సంసిద్ధులరుకండు.

ఖుస్రు—మంచి దట్లనే రణసంసిద్ధుఁడ నౌదును. నాయుద్దేశ్యము నెవ్వ

రును నెఱుంగ కుండవలయును.

మాధవ్యుఁడు—బ్రహ్మమైన నెఱుంగఁజాలఁడు! సరే! అట్లొనర్చుటే స్థిరమాయెను. ఇప్పుడిఁక వెడలిపొండు..

(మేఁటగాండ్రు నిష్క్రమింతురు)

(మరొండు దిక్కుగ ఖుస్రు వెడలిపోవును.)

## అష్టమ దృశ్యము

వర్ధమానమందలి శేర్ఖాను పురాతననిలయము-ప్రభాతకాలము

నూర్జహా నేకాకినియై గృహాళిందముపై నిలువంబడి దామోదర ప్రవంతిపై తన దృక్కులఁ బఱపుచు, దీర్ఘనిశ్వాసమును విడచి యిట్లనును.—"మరల నీ వర్ధమానభూమిని గాంచుభాగ్యము నాకలవడెను! కాని పూర్వంబునకు నిప్పటికి నెంతవ్యత్యాసమున్నది! ఆ కాలపుసుఖ నిశీథము లింకను నాజ్ఞప్తికి వచ్చుచున్నవి" (మరలనిట్టూర్పునిగుడించి, సతము ఖమై, రెండడుగులు ముందువైచి) "ప్రథమ యౌవన చాంచల్యమును జయింపఁగలిగితిని. అది శైశవలీల మాత్రమేయని—చిత్తప్రబోధ మొనరించితిని. ఆవాంఛ యపుడణఁగియే యుండెనుగాని, యంతమొందలేదని యెఱుఁగనైతి. ఆస్ఫులింగము నూతనేంధన సంయోగమున మరలఁ బ్రజ్వలితమగుచున్నది. భగవాన్! నారీహృదయమునేల యిత్తెఱంగున దుర్బలం బొనర్చి వైచితివి!—ఈ ప్రవృత్తి నణఁచుకొనఁ జాలకుంటినేల!"

(ఈసమయమున శేర్ఖాను ప్రవేశించును)

నూర్జ—(యబ్బురమున) "నాథా! యీ వేష మేల? మీరెందరుగుచుంటిరి?"

శేర్ఖాన్—వంగదేశ సుబేదారగు కుతబుద్దీను వర్ధమానమున కరుదెంచుచుండెను. వానిని దోడ్కొనిరా నెదురుగా నేఁగుచుంటిని.

నూర్జహాన్—(సవిస్మయమున) ఏమి యీ సాహసము! మీరు వాని

నాహ్వానింపఁబోవు చుంటి రేల?

షేర్ఖాన్—సతీ! నీ కింత వెఱపేల? అతఁడు సుబేదారుఁ గాఁడా! వర్ధమానవమందుండు నావంటి సంభ్రాంతోద్యోగి వాని కిత్తరిఁ దగు రీతి యభ్యర్థన మొనరింపవలయును గదా!

నూర్జహాన్—పాండుయా యం దానాఁటి నిశీథమును మఱచితిరా?

షేర్ఖాన్—మఱువలేదు.

నూర్జహాన్—అట్లయ్యు పోఁదలఁచు చుంటిరా?

షేర్ఖాన్—అట్లయ్యు పోఁదలఁచుచుంటిని.

నూర్జహాన్—పోవలదు! పోయినచోఁ బ్రాణభయము కలుగునని నమ్ముడు. మిమ్ము జయింప విశేషయత్నము సలుపక, సుబేదారిప్పు డీయెడకు వచ్చుచుంటలేదు. తామరిగినచోఁ దిరిగి వచ్చుట దుర్ఘటమని నమ్ముఁడు!

షేర్ఖాన్—(మందహాసము నభినయించి) అట్లే జరుగుచో నీవు ..భారతసామ్రాజ్ఞివి కాఁగలవు. నే వెడలి పోయిన మాత్రమేమి!

నూర్జహాన్—నాథా! ఇది పరిహాసవిషయమా?

షేర్ఖాన్—సతీ! పరిహాసవిషయము కాదు. జీవనమరణ విషయము. ఈ జీవనమందు నాకిఁక నెట్టి యాశ లేదని నమ్ముము.

నూర్జహాన్—నాథా! అట్లను చుంటి రేల?

షేర్ఖాన్—ప్రేయసీ! బ్రతుకుపై నాసచే నిత్తెఱంగున సారెసారెకు స్థలాంతరములకుఁ బలాయన మొనరించుకంటె మరణించుటే యుత్తమము! సందేహసంకోచ శంకలు, దివా రాత్రములందు నామనంబును బీడించుచున్నవి—ఇట్లు పీడించుటకు హేతువేమి? నేనేమి యపరాధ మొనరించితిని?—ఒకప్పు డీవు బలికిన మాట జ్ఞప్తియం దుంచికొంటివా?

నూర్జహాన్—ఏమది?

షర్ఖాన్—"ఇట్టి సుఖమును సహింపఁజాల" నని!

నూర్జహాన్—(క్షణకాలము నీరవయైయుండి)—

"నాథా! మన మీహింసామయ సంసారమునుండి పలాయన మొనరించి, యేదైన గహన—గ్రామమున కరిగి, పాలికుల చందమ్మున హాయిగఁ గాలముఁ బుచ్చుదము రండు. జహాంగీరు హింస యంత దూరము దనుక మనల ననుసరించి రాఁజాలదు.

షర్ఖాన్—మోహనాంగి! ఇఁక నేఁ బలాయన మొనరింపను. ఈమారు సంశయ రహితమనస్కుండనై ముందడుగువైచి, యాహ్లాద పురస్సరముగ విపత్తు నాలింగన మాచరించుకొందును! మృత్యువు నన్నొడిసి పట్టినను పట్టనిమ్ము—ఇపుడు నీచరణంబుల బంధించిన నా సౌహార్దలతికలను, నీసౌఖ్యార్థమై త్రెంచుకొని మృత్యుకాంతను కౌఁగిలించుకొందును. (గద్గదస్వరమున) స్వర్ణాంగీ! నీసుఖంబు కొరకు మరణించిన నాకు సుఖం బొదవును—హృదయేశ్వరీ! మరొక విషయము జెప్పివైతునా?—సాహసింపనా?—ఏల!—సంకోచమా! కాదు! చెప్పి వైచెద!—నే నేల మరణింపఁ గోరుదునో యెఱుంగుదువా?

నూర్జహాన్—నాథా! యేమో తెలుపుఁడు.

షర్ఖాన్—సఖీ! తెలిపి వైతును! గ్రహించితిని,—గ్రహింపనేల? స్పష్టముగ నెఱిఁగితిని—యెఱుంగుటేమి? హృదయగభీరగహ్వరమం దనుభవ మొందితిని. అదేమో యెఱుఁగుదువా?—నీవు నన్నుఁ బ్రేమించుట లేదని!—

నూర్జహాన్—ప్రేమించుట లేదా?

షర్ఖాన్—లేదు-నీ దృక్కులందును, నీ క్షీణహాసమందును, నీ భగ్నస్వరమందును, నీ యీ "ప్రేమించుట లేదా" యను ప్రశ్నయందును నీ యాంతర్భావంబు బ్రకాశమానమగుచున్నది! నన్నుఁ బరి

ణాయమాడుటచే, నీవు నీ సుఖంబును బోనాడు కొంటివని తలంచు చుంటిని.

నూర్జ— నతవదనయై మారువలుకక కూరకుండును.

శర్ఖాన్— ఆ సేతుహిమాచల పర్యంత మహీమండల మేలు సార్వభౌమున కర్థాంగివిగా వాశించిన నీవు—ఆతని దాసానుదాసుఁడ నగు నాకు భార్యవైతివి! ఆగ్రానగరమందలి శుభ్రప్రస్తర వినిర్మిత సుందరహర్మ్యాభ్యంతర హంసతూలికాతల్పమందుఁ బ్రమోదం బుండఁగోరు, నీవీ దీన శర్ఖానుని సామాన్య కుటీర మలినపర్యంకమున నధిక వేదన ననుభవించుచుంటివి. ఉదయ శైలోత్థిత సహస్రమయూఖ సన్నిభ స్వర్ణరుచుల్లతో భారతవర్షము నుద్భాసిత మొనరింప నెంచిన నీవీ దరిద్ర దేవతాపుత్రుని జీర్ణపంకిల పర్ణశాలయందు నిర్వాణోన్ముఖ ప్రదీపంబువలె నుంటివి! ఆ జహాంగీరెక్కడ?— ఈ శర్ఖానెక్కడ! ఆ సుందర హిరణ్మయ సౌధం బెక్కడ?— ఈ పత్రివినిర్మిత కుటీర మెక్కడ?— ప్రభాతోజ్వల సహస్రమయూఖుఁ డెక్కడ?— నిర్వాణ సంసిద్ధ ప్రదీపం బెక్కడ!—

నూర్జహాన్— నా యుద్దేశ్య మట్టిదని యెన్నఁడైన మీకుఁ దెలిపితినా?

శర్ఖాన్— నీవు తెలుపలేదు— కాని నేనట్లు గ్రహింపఁగలిగితిని! మానవచరిత్ర మెట్టిదో నేను బాగుగ నెఱుంగక పోవచ్చును,— కాని, ప్రణయం బెట్టిదో యెఱుంగుదును— నేను ప్రేమికుండను!— ప్రేమ పిపాసువును!— పానీయము లభింపనపుడు పిపాసువు పిపాస నెఱుంగుటకుఁ బ్రయాస పడనక్కఱలేదు. శుల్కతాలువులతో నేను నిన్నుఁ జేరితిని.— మరల శుల్కతాలువులతోడనే తరలుచుంటిని— కాంతా! విశ్వాససేవలను మాత్రమే ప్రేమ వాంఛింపదు. ప్రేమ తృష్ణ యాంతరతృష్ణయని యెఱుంగుము.

గార్జహాన్—స్వామీ!—నా దైవమా!-మహాత్మా! నన్ను మన్నిం పుఁడు. (ఇట్లని యామె భర్తృచరణములపై బడును.)

ఖ్రాన్—మిహారునిస్సా! నీ యందెట్టి దోషమును లేదు! అపరాధ మంతయు నాయదే! ఏ సుందరిని పరిణయమాఁడ భారత భావి సామ్రాట్టున్మత్తుఁడై యుండెనో, ఆమె నీ దీనదరిద్ర శర్ఖాను వివాహమాడుట యనలశిఖాభ్యంతరమున మిడుత దూకుటవంటిది. యోచించి చూడ దోసమంతయు నాయది యనియే గ్రహింప వలయును.

గార్జహాన్—దోసంబు మీ యదియా?

ఖ్రాన్—అవును నాయదియే. అట్లయ్యు నీవు నన్ను దూషింపకుము. అదెట్టి ప్రలోభమో జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. ఏనాఁ డీవు నా యుద్భ్రాంత దృష్టిపథమం దుదయించితివో,—ఏనాఁడు నాయు న్మఖ వాసనాభ్యంతమునం దుండి నీవు నీ సుందరస్వరూపశకటం బును ద్రోలితివో,—ఏనాఁడు జీవన ధ్యానమంతయు శరీరము దాల్చి, యున్మజ్జాగ్రత్స్వప్నమందు గోచరమయ్యెనో, ఆ నాఁడే నా యాత్మసామ్రాజ్యమును పూర్తిగ కోల్పో తిని. నేను మనుజుండనే!—కాని దుర్బలుఁడను. నెలతా! యెపుడు నభం బతినీలమై గానంబడియెనో,—యెపుడు విశ్వమం డల మతిశ్యామలమై తోఁచెనో,—యెపుడు తారకారాజి కామ స్ఫులింగావళి వలె గన్పట్టెనో,—యెపుడు సుందర సురభిళములగు గులాబి కుసుమంబులు హృద్రక్తబిందువుల చందమునఁ దోఁచెనో యెపుడు కోకిల శకుంతశ్రావ్యగాన మొక స్మృతివలె, దోఁచెనో, యెపుడు మలయసమీరణ మొక స్వప్న మట్లు దోఁచెనో— యెపుడు ప్రాణతుల్యయగు ప్రణయిని దర్శన మున్మన్ను కరణిని కానంబడియెనో,—యెపుడు చుంబనము సజల విద్యుత్తువలె దోఁ

చెనో,—యెపు డాలింగన మాత్ర ప్రలయంబు గతిఁ గాసఁ బడెనో,—యెపుడు, ఆ ప్రథమ యౌవనమందు, నేను నీ సౌం దర్య సుధను గ్రోలితిని.—విషపాన మొనరించుచుంటినని యెఱుం గఁజాలకపోతిని!—మిహిరా! (ఆమె కరములఁ బట్టుకొని) ఇఁక నీవు కవాటమును బంధించుకొనుము!—నేఁ బోవుచుంటిని. (చుం బన మొనరించును) ఇఁక మగుడి రానిచో నిదియే నా కడసారి చూడ్కి యని యెఱుంగుము!—పోవుచుంటిని.

(శీఘ్రముగ నిష్క్రమించును.)

నూర్జహాన్—ఓః!—(క్షణానంతరమున) వల్లభా! ప్రేమశూన్యతను భక్తి, పూర్ణ మొనరింపఁ గలుఁగుచో, భక్తిరసంబుచే మీ చరణ సరోజముల సిక్త మొనరించి వైచెడి దానను!

(నిష్క్రమించును)

నవమ దృశ్యము

వర్ధమానమందలి యొక మార్గము—

ప్రాతఃకాలము, వంగదేశసుబేదారగు కుతబుద్దీను నిజామాత్య సైనిక సహితుండై యందు నిలువంబడి యుండును.

కుతబుద్దీను—(దూరంబునకు దృష్టి సారింపుచు, నిజామాత్యులలో నొకని నుద్దేశించి,) "ఆ వచ్చువాఁడు శేర్ఖాను కాదా?"

అమాత్యుఁడు—అవునతఁడు శేర్ఖానే!

కుతబుద్దీను—(సైనికులనుద్దేశించి) సైనికులారా! మీర లందరు సిద్ధముగ నుంటిరా?

సైనికులు—అవును హుజూర్! (చిత్తము మహాప్రభూ!)

కుతబ్—సఫలప్రయత్నులైన లభింపు పురస్కారమును, విఫలులైన ప్రాపించు దండనము నెఱుంగుదురు కదా!—జాగ్రత్త!

సైనికులు—బాబయ్యా! యెఱుంగుదుము.

కుతబ్—మంచిది. ఇఁకఁ గృతనిశ్చయుఁడై యుండుఁడు. నా యాజ్ఞ కొఱకై మాత్రము ప్రతీక్షించి యుండుఁడు. ఆ వచ్చువాఁడు సామాన్యుఁడు కాడని యెఱుంగుఁడు, (నిమ్న స్వరమున) అదుగో శఖాను సమీపించుచున్నాఁడు.

శఖాను—(ప్రవేశించి అభివాదన మొనరించును.)

కుతబ్—(ప్రత్యభివాదన మొనరించి) రండు! దయచేయుఁడు. మహాశయులు కుశలముగ నున్నారా?

శఖాన్—చిత్తము.

కుతబ్—ఇంట స్వజనులందఱు సుఖులై యున్నారా?

శఖాన్—చిత్తము!

కుతబ్—వర్థమానమం దిప్పుడెట్టి యశాంతియు, ఎట్టి పీడయు లేదు గదా?

శఖాన్—అట్టి వేమియు లేవు.

కుతబ్—ఇచట నీ కెట్టి కష్టము కలుగుచుంట లేదుకదా!

శఖాన్—ఏమియు లేదు.

కుతబ్—నే నింతకుఁ బూర్వ మెన్నఁడు వర్థమానమునకు రాలేదు—ఆహా! ఏమి యీ నగర సౌందర్యము.

శఖాన్—అవును. ఈ నగరము మిగుల చక్కనిదే!

కుతబ్—ఇఁక తాము తమ గుఱ్ఱము నెక్కుఁడు. నేను నా యేనుఁగు నెక్కెదను. పురంబును సమ్యక్సమారోహముగ ప్రవేశింప వలయును!

శఖాన్—చిత్తము.

కుతబ్—ఇఁక బయలు వెడలుఁడు.

కుతబ్ శఖానులు నిష్క్రాంతులగుదురు. వారి ననుగమించి యమాత్యులరుగుదురు. ముప్వురు నాల్గు రమాత్యులు మాత్రము వెనుక

నుందురు. క్షణానంతరము నేపథ్యమున కుతబ్ —"సైనికులారా!"- యని నల్లు వినవచ్చును.

శర్ఖాన్—(నేపథ్యమున) కుతుబూ! ఇట్లని నేను బూర్వమే యెఱుఁగుదును. నేను మరణింపవలయుననియే యరుదెంచితిని. కాని, యొక్కఁడను మరణింపను—కుతుబుద్దీ! మఱిం దీవురమ్ము.

నేపథ్యమున నస్త్రశస్త్రధ్వానములును, ఆర్తనాదములు, మనుష్యుల కోలాహలరవంబును, వినంబడును. రణమాచరించుచు శర్ఖాన్ శత్రుసైనికులఁగూడి మరలఁ బ్రవేశించును. అతనిఁ బోరి యైదారుగురరివీరులు క్షతగాత్రులై నేలఁగూలి జీవముల బాయుదురు.

శర్ఖాన్—(ఉచ్చైఃస్వనమున)—ఇఁక బోరుచాలించెద. ఇదుగో! యస్త్రపరిత్యాగ మాచరించుచుంటిని. నేను మరణింప నంసిద్ధుఁడనై యున్నాఁడను. సైనికులారా! మీరలు ముసల్మానులగుచో, చచ్చుటకుఁ బూర్వ మొకమారు ప్రార్థించుకొన నా కొకించుక సమయము నొసంగుఁడు. ఇపుడు నే వాంఛించున దీశ్వర సంస్మరణమే!

అందరు నిస్తబ్ధులై యుందురు—

శర్ఖాన్—మీ సుబేదారుఁడు నేలఁబడి యుండెను. మీరలు కడు పేదలు. నిర్దయుండనై మిమ్మంకఱ నొక్క వ్రేటునఁ దుత్తునియలు గావింప నాకుఁ జేతులు రావు. ఈ సమయమందొకమారు జహాంగీరు నాకు గాన్పించియుండిన,—పోనిండు! నాయస్త్రములఁ ద్యజించుచుంటిని. (అస్త్రపరిత్యాగ మొనరించును). ఒకించుక తాళుఁడు.

అందరు నిస్తబ్ధులై యుందురు.

శర్ఖాన్—(పశ్చిమాభిముఖుండై మస్తకోపరి భాగమందు ధూళిని జల్లుకొని నిమీలిత నేత్రుండై, (ప్రార్థన మొనరించి)

"ముగిసెను! సైనికులారా! ఇంక రండు! నేఁ బ్రాణముల వీఁడ నువ్విళులూరుచుంటిని! నన్ను వధింపుఁడు!"

నలుకెలంకులనుండి ఫిరంగి గుండు లొక్కమాఱుగ నరుదెంచి, శఖ్రానునకుఁ దగులును. అతఁడు మొదలు నరికిన చెట్టువలెఁ గూలును.

శ్రీ

# షాజహాన్

## ద్వితీయాంకము

### ప్రథమ దృశ్యము

ఆగ్రాయందయాసా గృహము—ప్రాతఃకాలము

చక్రవర్తి సభాసభులును, రహిమాన్ రాజాయు నొకావున కలిసి ప్రసంగించుచుందురు.

వలాహకుఁడు—భర్తను జంపి యొక సతీమణిని బలవంతముగ చెఱసాల యందుంచుటఁ గడు హేయకార్యము. ఇట్టి యవమానము మన యాత్మీయులలో నెవరికి జరిగినను, బిడియంబుచే మనము తల లెత్తనేరకుందుము.

రహిమాన్ రాజా—విధవని రాశ్రయయగుటచే, నెటకేని పోయినచో గష్టముల పాలగునని, కృపాళుఁడై పాదుషా—

సుదంతుఁడు—ఆ కుసుమాంగిని గొనివచ్చి, నిజ నిలయాభ్యంతరమున బంధించివేయుటందే చక్రవర్తి కామెపైఁ గల విశేషానుగ్రహము స్పష్టముగ వ్యక్తమగుచుండెను.

కామపాలుఁడు—ఆ యనుగ్రహ మందొక పాలీరహిమాన్ రాజాపైఁ బడెను. వత్సరము గడవక పూర్వమే మహాశయుఁడు రాజాబహదూరు బిరుదము నందెను.

సుదంతుఁడు—రాజాబహదూర్ బిరుదమననేల? మహారాజా బిరుదముకూడ సిద్ధముగనున్నది. కొంతకాలమున కదికూడవచ్చి యీ

కిష్కింధాపురాగ్ర హారికునిపైఁబడును. క్రమక్రమముగ నీయన తక్కిన మెట్లుకూడ నెక్కఁ గలఁడు. నూతన నిర్మితంబులగు రావుసాహేబు, సతారుసాహేబు, మీరాసాహేబు మెట్లింక నట్లే యున్నవి!

రహిమాన్ రాజా—(నవ్వుచు)—పెద్దలు—మీయనుగ్రహముండవల యును—ఇంతకు మీదయయే నాభాగ్యమునకుఁ గారణంబు!

పుష్పదంతుఁడు—ఏమియీబీభత్సము!—మిత్రులారా! మీరలు (రహిమాన్ రాజాను చూపి) వీని నిచటి కెందులకు రానిచ్చితిరో నే నెఱుంగఁ జాలకుంటిని. వీనిని చూచినపుడెల్ల నాశరీరము జ్వలించి పోవును.

రహిమాన్ రాజా—హిః హిః హిః!

పుష్పదంతుఁడు—ఆహా! ప్లవంగపుంగవా! యేమిరా నీ నవ్వు! అది సరిగ భాండోద్గతస్వరమువలె నున్నది! కాని యింతగా నవ్వఁదగు విషయ మిపుడేమి జరగెను? (రహిమాను నుద్దేశించి) వానర ప్రముఖా! నీ కెంత గతి పట్టినది?

సుదరితుఁడు—ఆ యనాథ యపూర్వసుందరి యని విందును.

వలాహకుఁడు—అవును—కాని, ప్రాసాదములోని కామెను గొని వచ్చి రెండు వత్సరము లైనను, సామ్రాట్టాకమారైన, నామె ముఖమును వీక్షింపలేదఁట! అది కొంచె మాశ్చర్యకరముగఁ గన్పట్టుచుంటలేదా?

రహిమాన్ రాజా—ప్రాణమిత్రుండగు వంగసీమ సుబేదారుఁడు మరణించెనను దుఃఖంబుచేఁ దానా సుందరిముఖమును వీక్షింపనని చక్రవర్తి పలికెను!

కామపాలుఁడు—నిజము నిజము! ఆ మదవతి మగనిని దెగటార్చి బలవంతముగ నామెను గొనివచ్చి ప్రాసాదావరోధమున నుంచు

టామె ముఖదర్శనముఁ గావింపకుండవలెనను నభిప్రాయముచేతనే!
సుదంతుఁడు——సామ్రాట్టామెను చూచుటటుండనిండు. ఆ సుందరి
యే చక్రవర్తి ముఖము వీక్షింప నియ్యకొనుట లేదని నమ్మెదఁడు.
వలాహకుఁడు——నీ వనినది నిక్కవమేయై యుండును! ఏ యొక్క
లీడు తన భర్తను కడుపునఁ బెట్టుకొనెనో, అతనియెడల నామె
యనురాగము సూపఁగలదా?
కామపాలుఁడు——అనురాగము సూపఁజాలదు; కాని రాగముమాత్ర
ము సూపఁగలదు!
వలాహకుఁడు——ఆ 'రాగము'నకు ముందు 'అను' చేర్చుట కెంత
కాలము పట్టును!——రాగానంతరము వచ్చున దనురాగమే కదా!
సుదంతుఁడు——ఆ 'అను' ఖంకను చేరలేదు. ఇట్లని యయూసా
తెలిపెను. అది మిథ్యయై యుండదు.

(వేగంబుగ నసఫ్ ప్రవేశించును)

అసఫ్——విన్నారా?
అందఱు——ఏమి? యేమి?
అసఫ్——ఖుస్రు ఢిల్లీనగరమును ముట్టడించి, శిథిలమత్నుఁడై,లాహోరు
నగరమునకుఁ బలాయన మొనరించెను. సైన్యోపేతుఁడైన ఫరీదుఖా
న్నాతని వెంటఁబడి తటిమితుద కాతని యెట్లో పట్టుకొనెనఁట!
వలాహకుఁడు——ఏమి! యేమి!! ఆలాగా! ఆలాగా!!
సుదంతుఁడు——ఎప్పుడు? యెప్పుడు?
కామపాలుఁడు——ఎక్కడ? యెక్కడ?
పుష్పదంతుఁడు——ఎవరు చెప్పి రెవరు చెప్పిరి?

వారలందఱు లేచి అసపునుచుట్టు ముట్టి నిరంతరప్రశ్న
పరంపరలచే నతని వేధింప దొడంగుదురు-
అయూసా మెల్లగఁ బ్రవేశించును

వలాహకుఁడు—ఓహో! అయూసాగారా! రండు! దయచేయుఁడు!!

సుదంతుఁడు—మహాశయా! ఖుస్రు పట్టువడెనా?

అయూసా—అవును.

కామపాలుఁడు—అట్లైన నీవార్త నిక్కువమే?

అయూసా—నిక్కువమే! పాప మా రాకొమరుని బడుగురు ప్రేరేపించి, తుదకుఁ దప్పుకొని, తమ ప్రాణములమాత్రము దాము కాఁపాడుకొనిరి! ఇపు డతని యసువులు నిలుచునో, నిల్వవో సందేహము!

పుష్పదంతుఁడు—చక్రవర్తి నిజాత్మజుని మన్నింపకపోఁడు.

అయూసా—మన్నించుటంత సులభకార్యము కాదు. నే నతనిని బాగుగ నెఱుంగుదును.

రహిమాన్ రాజా—చక్రవర్తి విచారణ మెప్పుడు—హిహిహి—కచ్చితముగ నుండును. దోషులకు దండనము విధించుటయందును, పూజ్యులకుఁ బురస్కార మొసంగుటలోను పాదుషా—హిహిహి—న్యాయముగ ధర్మరాజే యని చెప్పవచ్చును!

అయూసా—(రహిమానును శుష్కభావమున నుపలక్షించి)—రాజా బహదూర్! వేళమించిపోయినను, మీ రింకను సామ్రాట్టుకడకుఁ బోలే దేల?

రహిమాన్—నేను చక్రవర్తి సందర్శనార్థమై పోవుచుండ మార్గమధ్యమందు వీరలు నన్నాపివైచి, ప్రసంగములోనికి దింపిరి!—హిహీహీ!

అయూసా—వీరలు పరమాహ్లాదభరితమనస్కులై యున్నారు. వీరలఁ గలసి వృథాకాలహరణ మాచరింపక, వేగ మీరు చక్రవర్తికడకుఁ బొండు.

(రహిమాన్ రాజా తలగోకికొనుచు, వ్రేళ్ళతో తలవెంట్రుకల

వడిఁ ద్రిప్పుచు వెడలిపోవును.

పుష్పదంతుఁడు—(మఱొక సభికు నుద్దేశించి) వానిని చూచితివా? కుమ్మరిపుర్వువలె నెట్లు తిరిగి పోవుచున్నాఁడో చూచితివా?

కామపాలుఁడు—చూచితిని. వాఁ డచిరకాలములోనే మహారాజా బహాదూర్ కాఁగలఁడు!

పుష్పదంతుఁడు—ఏల?

వలాహకుఁడు—అట్లు కుమ్మరిపుర్వువలెఁ దిరిగి పోవువాఁ డొక దినమునఁ గాకున్న మఱొక దినమునన్నైన మహారాజా బహాదూరు కావలయును!

[సమ్మతి సూచించుచుఁ గామపాలుఁ డావల నూవును.]

వలాహకుఁడు—అట్లు శాస్త్రమందు లిఖింపఁబడి యున్నదా?

పుష్పదంతుఁడు—ఇఁక నీప్రసంగము కట్టిపెట్టి మన యిండ్లకుఁ బోదము రండు. ఇందే చాలఁ దడవాయెను.

కామపాలుఁడు—నడువుఁడు.

పుష్పదంతుఁడు—మంచిది. పోదము రండు.

అయాసా యసపుత్రక్క దక్షిణవారందఱు వెలుపల కరుగుదురు. సభాసదులు చూపుమేర దాఁటిపోఁగనే, యయాసా—(తనయు నుద్దేశించి మెల్లని స్వరమున)—"ఈతని దుర్నయమును గ్రహింపఁ గలిఁగితివా?"

అసఫ్—జనకా! అదేమో తెలుపుఁడు.

అయాసా—చక్రవర్తి మరల నన్నుఁ బిలిపించి, నా కెంతయో ప్రలోభము సూపి, "నీతనయ నెట్టులైన సమ్మతిపఱుపఁ గలిఁగినచో నీకు మంత్రిత్వపదవిని బ్రసాదించెద" ననెను. నే నెట్టి ప్రత్యుత్తర మొసఁగితినో యెఱుఁగుదువా?

అసఫ్—ఎట్టి యుత్తర మొసఁగితిరి?

అయాసా—“ఓరా రసుమణి నొసఁగుచో, తత్క్షణంబనా కోశాధ్యక్ష పదవిఁ గూడ విడచి వెడలిపోదు” నని యుత్తర మొసఁగితిని.

అసఫ్—అందులకుఁ జక్రవర్తి యేమనెను ?

అయాసా—కడు విరక్తుఁడై, ‘మంచిది వివేచన మొనరింపవచ్చు’ ననెను. తనయా ! నే నీ పదవీపరిత్యాగ మొనరింప సంసిద్ధుఁడనై యున్నాను. నీవు కూడ నాగ్రానగరమున వీడ సంసిద్ధుండవు కమ్మా !

## ద్వితీయదృశ్యము

### చక్రవర్తి దర్బారుమందిరము—ప్రభాతకాలము

నిజకోశాధ్యక్షుఁడైన యయాసాతో జహాంగీరు ప్రసంగించు చుండును. దూరంబున సామ్రాట్టు ద్వితీయపుత్రుండైన పరభేజును, తృతీయనందనుండైన షాజహానును, కనిష్ఠతనూజుండైన శర్యార్‌ను నిలువంబడి యుందురు.

జహాంగీరు—అయసా ! వీరల చరిత్రమును నే నీవఱలో నెఱుఁగక పోలేదు. వీరలందఱు నింటనుండి వెడలఁగొట్టఁబడిన కుక్కలని నమ్ముము ! లంచములఁ గొనుచు, నత్యాచారముల ననదాచరణ ములనుఁ గావించుచుంటంజేసి వీరలఁ దమ సుబాల(జిల్లాల) నుండి వెడలఁగొట్టివైచితిని. ఘనులవలెఁ గన్పట్టు నీ యల్పుల వివేక హీనమగు దురహంకారజ్వాలచే నస్థిరుఁడనై తనయులని దలంపక వీరల దూరముగఁ దఱిమివైచితిని. దానంజేసి యీ మూర్ఖులు విద్రోహాచరణమునకుఁ దలపడిరి. కాని యింతటితో వారిదండనము ముగియలేదు. ఇపుడు నా కీవిప్లవకారుల నామములు కావలయు ను. వీరల శాస్తి యింకను పూర్ణము కాలేదు—అదుగో! ఖుస్రు యిట్లే వచ్చుచున్నాఁడు.

ఖుస్రుకు కైదీరీతిని దోడ్కొని భటులతో గూడ మహాబత్ఖాను ప్రవేశించును. చేతి సంకెళ్ళతో, తలవంచుకొని, ఖుస్రు జహాంగీరు సమ్ముఖమున నిలువంబడును.

చక్రవర్తి—(కొంతసేపు రెప్ప వేయక విలోకించి)—"ఖుస్రూ! నీవొనరించిన తప్పిదమేమో యెఱుంగుదువా?"

ఖుస్రు—(తలవంచి)—ఎఱుంగుదును.

జహాంగీరు—మందగీండా? యిట్టి చెడుకార్య మొనరింపవలదని నిన్నీవఱలో వారించియుండ లేదా?

ఖుస్రు—వారించియుంటిరి.

జహాంగీరు—నీ తప్పు నొప్పికొందువా?

ఖుస్రు—ఒప్పికొందును.

అయాసా—స్వామీ! యీతండు బాలకుండు!—అర్భకుండు! పదుగురు నీచు లీతనిం బ్రేరేపించిరి!

జహాం—ఆపదుగుర నామధేయములు నాకుం గావలయును. ఖుస్రూ! వారలెవరో వేగం దెలుపుము. మాటాడక యున్న వదలువాండనుగాను. ఆకుజనులనందఱ నొక్కమాఱుగ నగ్నికుండంబున విసరివైచెదను,—లేక క్రూరశార్దూలంబులకు వారల నశనంబు గావించెద. తెలుపుము! వారలెవరో తెలుపుము!

ఖుస్రు—నేనట్లు తెలుపంజాలను.

జహాంగీరు—ఏమి! తెలుపంజాలవా! వంశనాశకా! యేమిసీ బింకము! దుర్మతీ! నీ విప్పుడు తెలుపవలెను! లేనిచో దగువిధంబున నీచేం జెప్పించివైచెదను. నిర్దయుండనై, యంత్రణా యంత్రమున నిన్నుం బిప్పిగావించెదను. వేత్రాఘాతపరంపరల చేవీపు బ్రద్దలుగొట్టించెదను. నా పుత్రుండవగుట క్షమింపంబడుదువని తలంచుచుంటివా? అట్లైన నీవింకను నన్ను బాగుగ నెఱుంగవు. ఆదుర్మతుల పేళ్ళం దెలుపుము.

శేకున్న—

ఖుస్రు—మీ చిత్తము వచ్చిన రీతిఁగున నన్ను దండింపవచ్చును! వారల నామములను నా జిహ్వతోను చ్చరింపనేరను. ఏమి కావింపఁ దలఁచితిరో కావింపుఁడు.

జహాంగీరు—మంచి దట్లనే కావింతును! సేవకా! యీ దుడాగుని కారాగారమునకుఁ గొనిపొమ్ము.—అబ్దుల్ వీని కాలు చేతుల నినుపకమ్ములకుఁ గట్టివైచి, దినము తమ్ము నిలువంబడఁజేసి, వీపునఁ గొరడా దెబ్బల గురిపింపుము. వీని సాహస సహనము లెంత వఱకు నిలుచునో చూచెదఁగాక! అబ్దుల్! వీని నీడ్చుకొని పొమ్ము—ఖుస్రూ! యేడ్చుచుంటి వేల? వారల పేర్లఁ జెప్పెదవా?

ఖుస్రు—చెప్పఁజాలను.

జహాంగీరు—ఇఁక వీనిని తీసుకొని పొండు.

మహా—(ప్రతీహారులు ఖుస్రును గొంపోవ నుద్యుక్తులు కాఁగనే, మహాబత్ఖాను ముందుకువచ్చి)—"స్వామీ! నా నివేదన మొకటి కల్లదు," (ప్రతీహారుల నుద్దేశించి) "అరే! నిలువుఁడు.

జహాంగీరు—మహాబత్ఖానూ! నివేదన మేమో తెలుపుము.

మహాబత్—కుమారునిపై నిట్టి కఠినశిక్ష విధింపకుఁడు.

జహాంగీరు—అట్లనుచుంటి వేల?

మహాబత్—దేవరయాజ్ఞ కింతకుఁబూర్వమెన్నఁడు నెదురు చెప్పియుండ లేదు—నేఁడ ట్లొనరింప సాహసించుచున్నందులకు మన్నింపుఁడు. అనుగ్రహపురస్సరముగ నేఁజెప్పు దానినివిని, పిమ్మట మీ కిచ్చవచ్చిన ముదల నొసఁగుఁడు.

జహాంగీరు—(ఒకించుక యోచించి)—మంచిది. తెలుపవలసిన దేమో తెలుపుము. తగురీతి విచారము సలుపక, చక్రవర్తి తనపుత్రుని

శిక్షించెనని ప్రజలు తలంపకుందురుగాక!

మహాబత్—స్వామీ! మీ తనూజుండు ఘోరతరాపరాధమునుగావించుట సత్యమే! అట్లయ్యు నీ మాఱతనిఁ గృపాపూర్వకముగ మన్నింపుఁడు. మన్నింప నిచ్ఛగింపనిచో, సార్వభౌముని తనయునికిఁ దగు దండనమే విధింపుఁడు. సామాన్యాపరాధుల శిక్షించు తెఱంగున నాతనిని దండింపకుఁడు.

జిహాంగీరు—సార్వభౌముని తనయుండని సముచిత దండన మొసఁగరాదా? మహాబత్ఖానా! నేఁ బూర్వ మెన్నఁడైన బక్షపాతవిచారణ సలిపి యుంటినా?

మహాబత్—ఇది పక్షపాతవిచారణ కాదు. పదవీ మర్యాదారక్షణ మొనరింపవలయును. ప్రభూ! పూర్వ మొకపుడు తాము తమ జనకుఁడైన యక్బరు పాదుషావారికి విరుద్ధముగ విద్రోహాచరణము సలిపి నపుడాతఁడు మీపై నిట్టి కఠినశిక్షను విధించియుండెనా?

జిహాంగీరు—నావలె విచారణయుం దతఁడు సమదర్శి కాఁడు.

మహాబత్—ఖోదాబంద్ (ప్రభూ!) తామట్లు తలంపకుఁడు. అక్బరు మహాశయుఁడు పదవీమర్యాదకాక్రాంతములోఁబడియుండెను. నేఁడు మిమ్ము భారతవాసులందఱు తమసామ్రాట్టని భక్తిపురస్సరముగ నభివాదనమొనరించుట కా దీర్ఘదర్శి సువిచారణమే హేతువు! ఆతండిచ్ఛగించిన, మీ దుండగమునకుఁగడుఁగినిసి, సింహాసనము నుండి మిమ్ముఁ దొలఁగించి, యీ ఖుసునే పట్టాభిషిక్తుఁ గావించియుండును! నేఁడు ఖుస్రూనసమక్షమందే తాము తమ యపరాధ విచారణకై, నిలువంబడి యుండెడివారేమో యనికూడ దలంచెద!

జిహాంగీరు—[క్రుద్ధస్వరమున]—మహాబత్! ఏమి నీ నిర్భయత్వము!

అయాసా—స్వామీ! సేనాధిపతియగు మహాబత్ఖాను సమరము నలుపుటం దెంత చతురుఁడో, ప్రసంగించుటం దంత చతురుఁడు కాదు.

కృపాళురై వానిని మన్నింపుఁడు. కాని, అర్భకుఁడైన ఖుస్రుకొ అట్లై నేఁగూడ దేవరకృపాభిక్ష వేఁడుచుంటిని. పదుగురు దుర్మతులు కలసి యీ తని నీ కార్యమునకుఁ బురిఁగొల్పిరి! ఈతని యందు దోషము లేదు. ఈ యువకుఁడు సుశీలుఁడని నమ్ముఁడు.

జహాంగీరు—సుశీలుఁడా!

అయాసా—అవును! వ్యపదేశంబున బ్రదుకఁ దలఁచిన యా దురాత్ములు దేవరను హత్యఁగావింపు మని యాతనిను త్తేజిత మొనరింప, నీత డకూ్కళల దుర్మంత్రణమును వెడచెవిం బెట్టెను! నేఁడతఁ డాభీరుల నామోచ్చారణ మొనరింప నిచ్ఛగింపక శూరునివలె వారల దండనమును దానే యనుభవింపఁ దలంచుచుండెను. ఈ కార్యమాతని మహత్వమును బ్రకాశింపఁజేయుట లేదా?

జహాంగీరు—కాని, ఆ భూతల నామంబులు నే నెఱుంగవలయును.

అయాసా—మంచిది, వారల నామముల నెట్టులైన దమ కెఱింగించు భారమును నాపైఁ బెట్టుఁడు.

జహాంగీరు—మంచిది! సేవకా! కుమారునిఁ గారాగారమునకుఁ గొని పొమ్ము. శిక్ష విషయమై తరువాత యాలోచించెదను.

(ఖుస్రును దోడ్కొని సేవకుఁడు నిష్క్రమించును.)

జహాంగీరు—పరభేజూ! మీ వారు యుద్ధ మందు నీవోడిపోయి వచ్చితివి. నీవిట్టి పనికిమాలిన వాఁడవని నే నెఱుఁగను. మహాబత్తానూ! ఈ మాఱు మీ వారు దేశము మీఁదికి యుద్ధమునకు నీవు వెళ్ళుము. పరభేజూ! నీవు మహాబత్తాను ననుసరించి పొమ్ము. సమరమున నేమో తెలిసికొనుము.

పరభేజు—మంచిది! మీ యాన యెట్లో యట్లాచరించెదను.

జహాంగీరు—ఖురమూ! ఈ పర్యాయము కూడ నీవు దక్షిణాత్యుల పైకి యుద్ధమునకుఁ బోవలయునని యెఱుంగుదువా?

షాజహాను—తండ్రీ! మెఱుంగుదును.

జిహాం—శర్యారూ! నీ విచటికి వ  తివేల? హాకీము వచ్చెనా?

శర్యారు—వచ్చెను.

జిహాం—ఏమనెను?

శర్యారు—శీఘ్రకాలములో స్వస్థుఁడవు కాఁగలవని వచించి, యౌషధ మొసఁగి వెడలిపోయెను.

జిహాం—ఇఁక నీ విందుండక, యంతఃపురంబున కరిగి, వైద్యుఁడిచ్చిన యౌషధమును బుచ్చుకొనుము.

ఇట్లని జిహాంగీరు నిష్క్రమించును. సభాసదులఁగూడి మహబత్ఖాను మఱొక దిక్కుగ నిష్క్రాంతుఁడగు . సభాభ్యంతరమున బరభేజు, షాజహాన, శర్యారులు ముప్వురు మాత్రముందురు

షాజహాను—సోదరా! మీాహారు యుద్ధమందీవు కత్తిని తలక్రిందులు జేసి పోరితివా?

పరభేజు—కత్తినెట్లు చేతఁబట్టవలయునో యట్లే పట్టుకొని యుద్ధము సలిపితిని! కాని ఆసీమ నాకపరిచితమగుట వలనను, సమర సన్నద్ధులము గాకుండనే శాత్రవుల నెదుర్కొన వలసి వచ్చినందువలనను పరాజయము వాటిల్లెను!

షాజహాను—యుద్ధ సమయమున నీవు హుక్కా బీల్చుచుంటివా?

పరభేజు—అవును! హుక్కా బీల్చుచుంటిని! కస్తూరితో గలసిన తాంబాకు నొకపెట్టె డాగ్రానుండి తీసుకొని పోతిని.

షాజహాన—సోదరా! నీవుచాలా బొరపడితివి. తంబాకు, తలగడ, తరుణులనెన్నఁడు యుద్ధభూమికిఁ గొంపోరాదు. తైలంశోయంబుల కరణిఁ బ్రమోద విదారుణంబు లొండొంటితోఁ గలియనేరవు!

శర్యార్—(సోదరుల నుద్దేశించి)—ఆశ్చర్యమాశ్చర్యము! సమరచింత దక్క మీాకు వేరేమియు లేదాయేమి? ఈజగంబొక హాత్యాశాల

యని తలంచు చుంటిరా? కదనమువంటి భీషణదృశ్యములపై దృష్టి నిలుపక ఆనీల నభంబును విలోకింపుఁడు! ఈ స్రవంతీతరంగ గానమును వినుఁడు! ఈ శ్యామల వసుంధరను వీక్షింపుఁడు! ఆ విహంగ కలకల రావముల వినుఁడు! ఈ సమస్త విశ్వమునఁ గన్పట్టు సుందర దృశ్యములఁజూచి పవిత్రానంద మనుభవింపుఁడు!

షాజహాను—శర్యారూ! దర్పణమందు తన ముఖమును జూచుకొనవంతవరకును కురూపి తానెట్లు మిగుల నందకాఁడనని దలంచుకొనునో,—రహస్యముగ నున్నంతవరకుఁగుత్సితుఁడు తానెట్లు గొప్పవాఁడనని, ప్రౌఢుఁడనని భావించుకొనునో యట్లేనీవు మిత్రప్రసంగము నలుపుచు, బయటకు రాక మఱుగుననే సుఖంబుగఁ గాలముఁ బుచ్చుట యుక్తము. ఇఁక నీరవుఁడవై యుండుము.

శర్యారు—ఏమి యీకుత్సితోపమ! మీరలందఱు నుగలసి, యీసుందరజగంబును గుత్సిత మొనరించి వైచితిరి!

[నిష్క్రమించును.]

పరభేజు—మన శర్యారు మహాకవి! రోగశయ్యపై బలరహితుఁడై పడి యున్నను, నతఁడెవ్విధంబున దన దృష్టులను నీలాకాశశ్యామహోర్వీ భాగముల శృంగారదృశ్యములపై బ్రసరింప జేయుచుండును! ప్రకృతి సౌందర్యామృతము నతఁడు నేత్రపర్వముగఁ గ్రోలుతఱి నెవరైన వాని శిరమును ఖండించి వైచినను, నతఁడాఘాతుక కృత్యము నెఱుంగ నేరఁడని తలంచెద!

షాజహాను—జ్ఞానంజేసియే కాఁబోలు ప్లేటో (Plato:-A greek philospoher of very great reputation that flourished about 427—347 B. C) తన కల్పిత రాజ్యంబునుండి కవుల వెడలఁగొట్టి వేసెను.

## తృతీయదృశ్యము

ఆగ్రాప్రాసాదమందు నూర్జహాను సౌధము—అపరాహ్ణకాలము.

(ఏకాకినియై నూర్జహా నేదియో గ్రంథమును జదువుచుండును.)

నూర్జహాను—ఇఁక జదువవలెనని లేదు. (పుస్తకమును మూసివైచి, యద్దమందు తన ముఖమును జూచుకొనుచు శిరోజముల ముడి వైచుకొనుచు)—ఈ రూపమే యింత జేసెనా! హా! హృదయేశ్వరా! ఉదార హృదయా! నీ చావునకుఁ గారణమైన దీ సౌందర్యమా లేక నా కృతఘ్నతాకఠోర హృదయమా! పవిత్రచరితా! నీ కంటెఁ బ్రణయపాత్రుఁ డెవఁడున్నాఁడు? దైవఘటనమును, సింహపరాక్రమును, జనమైత్రీప్రేమంబును, శిశుసారళ్యంబును, నీకన్న నెవ్వరికైనఁ గలవా?—అట్లయ్యు నేను నిన్నుఁ బ్రేమింపఁజాలక పోతిని. అగ్నిసాక్షిగ నిన్నుఁ బరిణయమాడి, నీకు నా యవ్యాజ ప్రణయము నర్పింప నా యంతరంగమున నే నెట్టి యుద్ధము సలిపితినో యీశ్వరుఁ డెఱుఁగును. కాని యా యుద్ధమునందు విజయమందలేకపోతిని! దానంజేసి సంయమివలె నీవు నీ కొరకు మృత్యుదేవి నాహ్వానించితివి. నా ప్రాభవకాంక్షయే మనల నిద్దరను నాశము జేసినది. ఇపుడైన ధైర్యము వీడలేదు. నాలో నేను యుద్ధము సలుపుచునే యుండెదను. నాలోని పిశాచము నణఁగఁ ద్రొక్క శక్తివంచన లేక ప్రయత్నించెదను! ఆ పిశాచమే నిన్నుఁ దెగటార్చి, నన్నీభవనంబున కీడ్చుకొని వచ్చెను! కాని యిచటికిఁ జేరి నాలుఁగు వత్సరములైనను, చక్రవర్తి ముఖమునైనఁ జూడ లేదు; చూడను. ఎవరు గెల్తురో చూచెదఁ గాక!—ప్రియతమా! నా కొఱకై నీవు ప్రాణత్యాగ మొనర్చితివి. నేనుఁ గూడ నీ కొఱ కట్లే చేయుదును! ఒరులతోఁ గదన మొనరించి నీవు మరణించితివి. నాతో నేను యుద్ధ మొనరించి చచ్చిపోయెదను.

ఒక్క ముహూర్తములోనే నీవు నీమేను వీడితివి! కాని మృత్యుముఖ గహ్వరమును నేను మెల్లమెల్లగఁ బ్రవేశించెదను! ప్రాణేశ్వరా! నన్ను వీడిపోవునపుడు, నీవు నా కొఱకై యొక జీవత్సమాధిని నిర్మించి, యరిగితివి!—అదిగో! తండ్రికిఁ బ్రియతమమైన లయిలా యచట నిలువంబడి యున్నది-పిలచెదను—అమ్మా! లయిలా! లయిలా!!—

లయిలా—(ఇంటిలోనుండి ప్రవేశించి) ఏమి తల్లీ!

నూర్జహాను—అమ్మా! నా సర్వస్వమా! రమ్మా! నను గౌగలించుకొనుము.

లయిలా—అమ్మా! అట్లుంటివేమి?

నూర్జహాను—తల్లీ! నీముఖము విషణ్ణమై యున్నది. నీ కన్నులు వాడి వత్తులై యెఱ్ఱ పెక్కియున్నవి. వేషంబతి దీనంబై గన్పట్టుచున్నది. అహోరాత్రములు నీ హృదయమును వేధించుచున్న యీ చింతాకీటక మేది? ఇట్లుండుటకుఁ గారణమేమి?

లయిలా—ఒకించుక యోచించిన నది నీకే తెలియును నీ విచటి కేల వచ్చితివి?

నూర్జహాను—ఇచ్చోటికి నేను రావలెనని రాలేదు.

లయిలా—అయిన నెందుకు వచ్చితివి?

నూర్జహాను—కాక చేయునది మాత్రమేమి?

లయిలా—ఏమి చేయఁగలుగుదువా? విషంబు మ్రింగి మానరక్షణ మాచరించుకొనఁ గలుఁగుదువు! బ్రదుకుపై నింత యాశ యెందులకు? ప్రాణంబుపై నింత మక్కువ యేల? ఏ దురాత్ముఁడు నా జనకుని హత్యఁ గావించెనో, ఆ నీచుఁడా, కాపురుషుఁ, డాయధముఁ డా హంతకుఁడు తన ప్రాసాదమున—

నూర్జహాను—ఊరకుండు మూరకుండుము!

లయలా—ఊరకుండుటేల? నా మనః పర్యంకమం దీ తలంపును దివా రాత్రములు జోకొట్టుచు నీరవనై యుండునా? భారతాధీశ్వరుఁడు హంతకుఁడై రహస్యముగ నా జనకుని జంపెనని నే నన్ని తావు లందును చాటి నా రోదన ధ్వనులతో నీ భారతభూమియందలి గిరిగహ్వరముల గూడ మారుమ్రోగఁ జేసెదను.

నూర్జహాను—ఏమి!

లయలా—ఎంతదనుక నా పెదవులెండిపోకుండునో, ఎంతదనుక నేను వచించు మాటలు గాలిలోఁ గలిసి పోకుండునో, ఎంతదనుక నా కలంక కాలిమంబుచే నాకసమంతయుఁ గృష్ణరాగమునఁ దాల్పఁ జాలకుండునో—ఎంతదనుక లజ్జాభారమున సామ్రాట్టు సింహాసన మకుట సహితముగ గభీరపృథ్వీ గర్భమునఁ గ్రుంకకుండునో, అంత దనుక నే నీఘోరమనుష్యకృత్యమును చక్రవర్తి బహిరంగసభయందు బహిరంగసభ యననేల, సర్వస్థలంబులందును వెల్లడించుదును. మా న్నాటికి వెల్లడించి తీరుదును. అట్లొనరింపఁ దగు తరుణంబు కొఱకై యెదురుచూచుచుంటిని!

నూర్జహాను—బిడ్డా! నీ విట్టి యీ ప్రాసాదాభ్యంతరమునఁ జీత్కార మొనరించుచుంటివేని, భర్తను గోల్పోయిన నేను నిన్నుఁ గూడ గోల్పోవలసివచ్చును.

లయలా—నీ భావము చక్రవర్తి నన్నుఁ గూడ మట్టుపెట్టుననియా? మంచిది! మట్టుఁబెట్టనిమ్ము! నీవలెఁ బ్రాణంబులపై నా కంత మక్కువ లేదు!—ఛీఛీ! ఏమి యీ దుర్దశ!—జననీ! మన మిం దుండి వెడలిపోదము రమ్ము!

నూర్జహాను—పోవుటకు మన కనుమతి లేదు.

లయలా—అనుమతి లేదా! మన మిచటఁ గైదీలమా?

నూర్జహాను—అవును!

లయిలా—ఏ యపరాధమున?

నూర్జహాను—అది నే నెఱుంగను.

లయిలా—(కొంచెము సేపు నిస్తబ్ధయైయుండి, మెల్లగ) "మాతా! నీ విచటి కిచ్ఛాపూర్వకముగ రాలేదని చెప్పుచుంటివి!—కాని నీ వియ్యెడ కరుదెంచినపుడు మారుమాటైనఁ బలుక లేదేల? పెంపుడు లేడివలె మారుమాటాడక నీవీభవనంబునఁ బ్రవేశించితివి! మనమిపుడు ఖైదీల మనుచుంటివి! కాని, యీ కారాగారమునుండి విడుపడ నీ కెట్టి యాతురతను గాని, యత్నమును గాని నెఱపుట లేదు! భిక్షుకురాలి భంగి, నీవిశాలాంతఃపురమందలి పంకిలజఘన్య ఖిల్లమందు మిగుల స్వచ్ఛందముగా గాలము బుచ్చుచుంటివా?— జననీ! నిజంబుగ, నీ విందుండి పో నిచ్ఛగించుచుంటివా?

నూర్జహాను—పో నిచ్ఛగింప కుండుటేల?

లయిలా—అట్లైన సామ్రాజ్ఞిద్వారా సామ్రాట్టు ననుమతిఁ బడయ నేల యత్నింపవు?

నూర్జహాను—యత్నించినను, మన కోరిక యీడేరదు. సార్వభౌముఁ డనుమతి నొసఁగఁడు!

లయిలా—(కాలితో భూమినిఁ దట్టి)—అనుమతి నేల నొసఁగఁడు! నిక్కముగ నొసఁగును! ఎన్నఁడైన నరళభావమున, నాతురమతివై నీ వనుమతి వేఁడితివా? నీకు నిక్కముగ ననుమతి కావలయునా?

నూర్జహాను—కావలయును.

లయిలా—మంచి దనుమతిఁ బడయు భారమును నాపైఁ బెట్టుము. ఎందులకుఁ బడయలేనో జూచెదఁ గాక!

ఇట్లని లయిలా నిష్క్రమించును.

నూర్జహాను—ఆహా! ఎట్టిగతి! ఏమిబ్రదుకు! ఏమిలజ్జ! ఏమిలజ్జ!—ఇఁక నేఁ బలాయన మొనరింపనా!—ఇఁ కేల! నా చిన్నకూతు బెదరింపు

లచే నా హృదయమందలి కుత్సితము నన్ను మిగుల వేధించు చున్నది! అదెట్టి కుత్సితము! ఒక కారణముచేఁ గాకున్నను, లయిలా యాక్రోశసంబుననే నేను బలాయన మొనరింపవల యును! కుమారి కడఁగూడ నే నవిశ్వాసినిని గాఁజాలను! (పిదప నాకస్మికముగ స్వరముఁ దగ్గించి)—లయిలా! అభాగినీ! ఆ దినము గడచిన దాదిగ నీ యాననంబున మందహాసము మరలఁ గన్పట్టుట లేదేల? అవుడవు డొంటరిగఁ గూరుచుండి, యేదియో భావించు కొనుచు దీర్ఘ నిశ్వాసమును విడుచుచుందువుకదా! ఆ నిట్టూర్పు నుండి నీ ప్రాణ మందర్ధభాగము వెల్వడుచుండె నేమో యని నే భయపడుచుందును! నడుమనడుమ నాపై స్థిర దృష్టులఁ బఱపి, యాకస్మికముగ నీ కన్నులు బాష్ప పూరితంబులగుటచేఁ బెడ మొగము బెట్టుకొని, గిఱ్ఱున దిరిగి వెడలిపోవుచుందువు! మరల నవుడవు డస్ఫుటస్వరమున నీలో నీవేమియో గొణుఁగుకొనుచు ఘృణాక్రోధనిరాశలను వ్యక్తీకరించునట్టులాడలు విఱచుకొందువు. అదిగో దూరమునుండి నాగస్వరము వినవచ్చుచున్నది!— ఈ భవన మెంత విశాలముగ నున్నది!—వలదు! ఇఁక నిచట నుండఁ దలదు!— ఇందుండి వెడలిపోవుటే యుక్తము!

(ఖాదిజా ప్రవేశించును).

ఖాదిజా—అత్తా! లయిలా యేది?

నూర్జహాను—ఎఱుఁగను. నీ విచటికి వచ్చి యెంత సేపైనది.

ఖాదిజా—ఇవుడే వచ్చితిని.

నూర్జహాను—ఎవరితో?

ఖాదిజా—జననితో?

నూర్జహాను—ఆమె యేది?

ఖాదిజా—సామ్రాజ్ఞికడ—ఇఁక నేబోయి, లయిలా యెటుబోయెనో

చూచి వచ్చెదను. నీవు కూడ వచ్చెదవా?

నూర్జహాను—రాను.

ఖాదిజా—అట్లైన నేఁబోవుచుంటిని.

[నిష్క్రమించును]

నూర్జహాను—నా మేన కోడలు నిరుపమానసౌందర్యరాశి. దానం జేసి యే యామె జనని యామె ననుదినము వెంటబెట్టుకొని పెండ్లి గాని పడుచువారల గుంపులందుఁ దిరుగుచుండును. నారీజాతీ! నీ వెట్టి యధమదశయందుంటివి! గాలమువలెఁ బురుషులఁ బట్టుకొనుట కా యీశ్వరుఁడు నీకీ సౌందర్యము నొసఁగినది. లావణ్య సౌష్ఠవములు పురుషులను బట్టుకొనుటకై యేర్పడిన యుపాయములా? ఆహా! పురుషజాతీ! నీవు కూడ నెట్టి యధమదశ యందుంటివి! రమణుల జఘన్యసుందరపాద తలమున నవలీలగ,—నవా ధ్యాసంబుగ నీ శౌర్యవివేకబుద్ధు లర్పించుచుంటివేల! (దీర్ఘనిశ్వాసమును విడచి) మనుష్యజాతి యింతటిదేనా!

చ తు ర్థ దృ శ్య ము

ఆగ్రాయందలి యంతఃపురము—సంధ్యాకాలము.

(జహంగీరును, రీవా రాజ్ఞియు నిలువంబడి ప్రసంగించుచుందురు)

జహంగీరు—రాజ్ఞీ! ఇపుడు సర్వము తెలిసినదా!

రీవా—తెలిసినది. హా! ఈశ్వరా! యెఱుంగకున్న నెంత సుఖంబుగ నుండి యుందునో కదా!

జహాం—సతీ! ఉన్మత్తుఁడైన వానిదోషము ననుకంపాపురస్సరముగ విచారింపవలయును. ఉన్మత్తుఁడనై యుంటచే నపుడు నేనట్టి దుష్కృత్యము గావించితిని!

రీవా—మానవుఁడు చేయు దుష్కృత్యముల విచారించుటకు మన

మెవ్వరము? విచారమున లుపుచతఁడు (పైకిఁ జూపుచు) మరొకఁడు. మీ రొనరించిన ఘోరపాపమునకై మిమ్ము గద్దింపనిచ్చంగిపను. వల్లభా! భర్తృహితాభిలాషిణియగు మీ పత్నిమాటలఁ బాటింతురా?

జిహాం——పాటింపఁ బ్రయత్నింతును.

రీవా——శర్ఖానుజాయను కారాగారమునుండి వదలిపెట్టుఁడు.

జిహాం——నే నామెను కారాగారమం దుంచలేదు. ఎప్పటికైనఁదనంత దానే నన్నువలచి, వివాహమ్మాడునను నాసచే నారమణిని భవనాభ్యంతర మందుంచితిని.

రీవా——మిమ్ముఁ బరిణయ మాడవలెనను కోరికను మిహిరునిస్స ప్రకటించి యున్నచో నే నీవఱకే యావివాహమును నెరవేర్పఁ బ్రయత్నించి యుందును. కాని, నాలుఁగేండ్లు గతించినను, ఆకాంత తన పట్టుదల వదలనికతన నీవా నామెను ప్రాసాద మందవరోధించుట ఘోరతర దుర్న్యాయమని తలఁచెద.

జిహాం——ఒకమాటా మె కడకరిగి, సామదానోపాయముల బ్రయత్నించుటుచితము కాదా!

రీవా——ఆ యువతి యిచ్ఛకు విరుద్ధముగ నామెయున్న చోట మీరాగు కాలిడుట మంచికార్యముకాదు.

జిహాం——రాజ్ఞీ! ఆ పూఁబోడి వదనపద్మము నొకమాఱు చూడవలెనను వాంఛచే నేనవు డవుడుత్తి పత్రప్రాయుండ నగుచున్నను—— నీయనురోధంబు వలన నే నామెకడ కరుగుచుంటలేదు.

రీవా——మనుష్యులగువారి కట్టి యిచ్ఛాదమనశక్తి యుండుటావశ్యకము! మనుజుండజస్రము ప్రవృత్తికి లోఁబడినచో వానికిని పశువునకును భేదంబేమియు నుండదు!

జిహాం——మిహిరునిస్స యిపుడు వర్ధమానమునకు మగుడిపోఁ దలఁ

చుచుండెనా?

రీవా—అవును. ఆమె నచ్చోటికిఁ బోనిండని, చేమోడ్చి మిమ్ముఁ బ్రార్థించుచుంటిని.

జిహాం—హృదయేశ్వరీ! నీవు నా హృదయారాటము నెఱుంగఁగలిఁగిన,—

రీవా—ఎఱుంగ లేకేమి! ఎఱుంగుదును, కాని, నాకంఠమునఁ బ్రాణమున్నంత దనుక, మీ ప్రాసాదమున నొక కులాంగన కవమానము కలుఁగుట నేను జూడఁజాలను. ధర్మపత్నినగుటచే, సాధ్యమైనంతవఱకు మీకు రక్షణంబొనఁగఁ బ్రయత్నింతును.

జిహాం—రాజ్ఞీ! దేవిని సేవించురీతిని బత్నివైన, నిన్ను భక్తిపురస్సరముగ నేఁబూజించుచుంటిని. అట్లయ్యు,—

[లయలా ప్రవేశించును]

లయలా—'అట్లయ్యు,'—చక్రవర్తీ? చెప్పివేయుము 'అట్లయ్యు?'

(జిహాంగీరు నిస్తబ్ధుఁడై యుండును)

లయలా—సామ్రాట్! నేను శర్ఖాను కుమారిని. ఏ యపరాధమున నాజనని నామె యిచ్ఛకు విరుద్ధముగఁ దను ప్రాసాదమందు బంధించివైచితిరో,—ఏ సాహసంబున మీరు పరాక్రమోపేతుఁడగు శర్ఖాను నర్థాంగిపై నిత్తెఱంగున నత్యాచారముపై నత్యాచారమును బ్రోగుజేయుచుంటిరో నే నెఱుఁగఁ గోరుచుంటిని—పైన నీశ్వరుఁడు లేఁడా? పృథివినుండి ధర్మము తొలఁగి యుతెలందేని లుప్తమై పోయెనా?

రీవా—ప్రభూ! ఇఁక నారమణికి సెలవొసంగుఁడని మీ మంగళార్థమై నేఁ బ్రార్థించుచున్నాను.

జిహాంగీ—(తనదృక్కులు లయలాపైబఱపి యామెతీక్ష్ణదృష్టులఁ గాంచనేరక యవనత వదనుఁడై)—"మంచి దట్లనే కావించెదను. తన

కుమార్తెయుఁ, దానును, వర్ధమానమునకుఁ బోవచ్చునని నీ
వాకాంత కెఱిఁగింపుము.

లయలా—సామ్రాట్టునకు జయంబగుఁ గాక!

[నిష్క్రమించును.]

రీవా—నాథా! పురుషోచితకార్య మాచరించుచుంటిరి. ఆ మగువపై నెంతో మక్కువ యున్నను, యత్నపూర్వకముగ నామక్కువ నడంచుకొనఁగల మీ మానసిక బలంబును నేను శ్లాఘించుచుందును. వల్లభా! కర్తవ్యనిష్ఠచే నీ నిష్ఫలానురాగమును విస్మృతి గర్భమున ముంచి వేయ యత్నింపుఁడు.

[నిష్క్రమించును]

జిహాం—ఈ సామాన్యవనిత నా ప్రార్థన నాలింపకుండుటకు నే నంత యధముఁడనా? ఆయింతికింత గర్వ మేల? నిక్కువముగ నయ్యేల నాగ నన్నుఁ బ్రేమించిన దనియు, మా యిరువురి సమ్మేళనమునకేక మాత్రాంతరాయము శేర్ఖాననియుఁ దలఁచి యుంటిని! అది యొక భ్రమయేనా?—ఆహా! ఆ మత్తకాశినిదర్శన మొకమాఱు లభించుభాగ్యము నా కెపుడలవడునో కదా! [తలవంచి యాగారమందుఁ బచారు చేయుచు] మంచి దింకొకమాఱు యత్నించి చూచెదను. ఈ మాత్రైన నా వనిత చిత్తము కరగకుండునా!— దౌవారికా! (నేపథ్యమున)—మహాప్రభూ! వచ్చుచుంటిని.

(దౌవారికుఁడు ప్రవేశించును)

జిహాం—అయాసా తనయు నొక్కమాఱు పిలుచుకొని రమ్మా.

దౌవారికుఁడు—చిత్తము మహాప్రభూ!

[దౌవారికుఁడు నిష్క్రమించును]

జిహాం—అసఫ్ ద్వారా యొకమాఱు యత్నించి చూచెదను. ఇట్టి శ్రమ, దీసుకొని, యిట్టికుట్రఁబన్ని, యిట్టి దౌరాత్మ్యమునకుఁ

దలఁపడి యా కాంతను నా చేతికిఁ బట్టుకొని యిప్పు డవలీలఁగ నామెను విడచి పైతునా?—ఎన్నఁటికట్లు విడువను. శక్తివంచనలేక ప్రయత్నించెదను. సాధ్యాతీతమెట్లగునో చూచెద! మహాప్రళయమున లభించిన యారమణి నవాయానముగ నేల వదలి పైతును!

ప ం చ మ దృ శ్య ము.

నూర్జహాను సౌధము రాత్రికాలము.

నూర్జహానేకాకినియై, మేడలోఁ బచారు చేయుచుండును.

నూర్జహాను—నేఁటికి నాప్రార్థన యాలింపఁబడెను. ఇపుడెందు బోదును? జనకుని కడకరుగుదునా, లేక వర్ధమానమునకుఁ బోదునా? వర్ధమానమున కరిగి యెవరికడ విడియుదును? అచట నాకాత్మీయు లెవరున్నారు? లేకుండిననేమి?— నేనచటికే పోయెదను. పూలు కుట్టుపనిని బాగుగ నభ్యసించి యుంటింగాన సామాన్యవ్యయార్థమంధనమార్జించుకొనఁగలను. నేఁబోదును. ఇచటి కెంతదూరముగ నసించిన నంతశ్రేయము తిరుగ, వర్ధమానమున కరిగి నావల్లభుని పుణ్యస్మృతి ధ్యానమున నాపై శాచికప్రవృత్తి నణఁచుకొని ప్రవిమలాత్మనై సుఖంబుగఁ దనువు వీడుదును.

(పరిచారిక ప్రవేశించును.)

పరిచారిక—సామ్రాజ్ఞి వచ్చుచున్నది.

నూర్జహాను—మంచిది రానిమ్ము.

(పరిచారిక నిష్క్రమించును.)

నూర్జహాను—(లేచి సంభ్రమంబున వేషమును సవరించుకొని రీవా ప్రవేశింపగనే యామెకభివాదన మొనరించును.)

రీవా—(ప్రత్యభివాదన మొనరించి) "మిహిరున్నిసా! నీశోకసువార్త

ను దెలుపవచ్చితిని."

నూర్జహాను—నువార్తవింటిని. సార్వభౌముఁడు నాప్రార్థన మంగీకరించెనని యెఱింగితి.

రేవా—రమణీ! రేపటి ప్రత్యూషమందీవు కుమారీ సహితవై నీయిచ్ఛ వచ్చిన తావున కరుగవచ్చును—

నూర్జహాను—మీరు కావించిన మహోపకారమునకు నేనెంత కృతజ్ఞనై యుంటినో తెలుపఁజాలను.

రేవా—కాని, నిన్నొక విషయమడుగఁ దలఁచు చుంటిని—నీవు సామ్రాజ్ఞివి కాఁగోరుచుంటివా?

నూర్జహాను—బేగమ్‌సాహేబ్! మన్నింపుఁడు-నే నేమియుఁగాఁగోరుచుంటలేదు. వర్ధమానమునకు వేగఁబోఁ గోరుచుంటిని.

రేవా—నీకట్టియిచ్ఛయున్నదో లేదోయని మాత్రము ప్రశ్నించితిని—మిహిరునిస్సా! తలఁచిన మాత్రన నీవు భారతాధీశ్వరివి కాఁగలవు. సామాన్యసామ్రాజ్ఞివి కావు. ఇపుడు నేనలంకరించియున్న స్థానమును నీ వేయలంకరించి ప్రధానరాజ్ఞివౌదువు! పదివత్సరములకుఁ బూర్వము సామ్రాట్టు నీకొఱకెట్లు ముగ్ధుఁడై యుండెనో, నేఁడు కూడనట్టులనే, యట్టులనే యననేల,—అంతకంటె నెక్కువగ ముగ్ధుఁడైయున్నాఁడు! నిమిషంబులో సామ్రాజ్య సహితముగ సార్వభౌముఁడు నీగుప్పిటఁబడఁగలడు. ఇచ్ఛయున్న నీవాతనిఁబిడికిటనుంచుకొనఁగలవు. ఇచ్ఛ లేకున్న బాఱవేయుఁగలవు. కాంతా! నీయుద్దేశ్యమేమో తెలుపుము.

నూర్జహాను—సామ్రాజ్ఞీ! నాయుద్దేశ్యము నీవఱలోనే తెల్పితిని. కాని, యగ్నిసాక్షిగ, బెండ్లి జేసుకొనిన పతిని, ఆసేతు హిమాచలపర్యంత మహామహీసామ్రాజ్యమును మీరెట్లు పరులచేతిలోఁబడ వేయుట కేల సమకట్టుచుంటిరో నేగ్రహింపఁ జాలకుంటిని!

నాకిది మిగుల నాశ్చర్యముగఁ గన్పట్టు చున్నది!

రీవా—(మందహాస మొనరించి)—ఆశ్చర్యమేమియు లేదు. నేను హిందూరమణిని. హిందువులు దేనినైనను బరులకు సమర్పించుటలోఁ గడు సమర్థులు! అట్లు సమర్పించుటకే వారలు జన్మించిరి. దానం జేసియే హిందువులు భారతవర్షమును మిూఁ కర్పించిరి. అర్పించుటే వారి కర్తవ్యము. హిందువులు కోరున దైహిక సుఖము కాదు—ఆముష్మిక సౌఖ్యము! వారల యాసలిందు లేవు! వారల యాశ (పైకి జేయెత్తిజూపి) లందుండును!

నూర్జహాను—సామ్రాజ్ఞీ!—నేను సామ్రాజ్ఞిని కాఁగోరను.

రీవా—మంచిది! కాంతా! అట్లు కావలసినదని నిన్ను నేను నిర్బంధించుటలేదు. నీకిష్టంబులేని పదంబునకు నిన్నుఁ దోడ్కొని పోవ నేసాహసింపను. చక్రవర్తి యభీష్టము మాత్రము నీకుఁ దెలిపితిని. ఇఁకనీ యభీష్టానుసారముగ నీవాచరింపవచ్చును! రాత్రిచాలగడచి పోయినది. నేనిఁక బోయెదను.

[సామ్రాజ్ఞి నిష్క్రమించును.]

నూర్జహాను—"భారతాధీశ్వరినగుదునా!" [కొంతసేపటునిటు బచారిఁ గావించి తల పంకించి]—అట్లు తలచుట మహాపాతకము!—కాని,—కాని, నాభవిష్యమందు నిష్ఫలరోదనము తక్క మఱే మియు లేదు!—అట్లైననేమి! ఈవిషయమునుగూర్చి యిఁకఁ జింతింపను—ఆహా! ఏమి యీయుష్ణము! అసహ్యమైయున్నది! [గవాక్షము పొంతకరిగి, దాని ద్వారము తెఱచి, మరలివచ్చి] మానవహృదయమందు రెండాత్మలున్నవా? లేకున్న నశ్రాంతమేల యీద్వంద్వము జరుగును!——యేమి!——యీ యుష్ణము!—నే నట్లైన్నటికిని జేయను!—ఏల!—ఈ మాటు నాహృదయమును రాయిజేసుకొందును. నా యీ స్వంత

ల్పమునుండి యెవ్వరును నన్ను చలింపఁజేయజాలరు! నాకడను,—నా తనయకడను,—నా వల్లభునికడను, ఈ విషయమున, నా సమ్మానబుణ ముండెనని యెఱుఁగకపోలేదు! అట్లెఱిఁగి యట్టి కార్య మెట్లు కావింప సమకట్టితిని!

(ఈ సమయమునఁ బరిచారిక మరలఁ బ్రవేశించును)

పరిచారిక—మీ సోదరుఁడు మీదర్శనార్థమై వేచీయున్నాఁడు.

నూర్జహాను—ఎవరు! అసఫా?

పరిచారిక—అవును.

నూర్జహాను—మంచిది. వాని నిటకుఁ గొనిరమ్ము.

(పరిచారిక నిష్క్రమించును.)

నూర్జహాను—ఈసమయమం దసఫిచటికి వచ్చుటెందులకు?

(అసఫ్ ప్రవేశించును.)

నూర్జహాను—సోదరా! వార్తలేమి?—నీవిపు డిచటి కేలవచ్చితివి?

అసఫ్—సోదరీ! నీకొక శుభవార్తఁ గొనివచ్చితిని. ఇతరవార్తను నే నెన్నఁడును గొనిరానని నీవెఱుంగుదువుకదా!

నూర్జహాను—అశుభవార్త యేమి?

అసఫ్—గబగబ పరుగెత్తి వచ్చితిని—ఒకించుక తాళుము!

నూర్జహాను—(నీరవమైనిజసోదరు నని మేషనయనయై విలోకించుచు) అదేమివార్తయో యిఁకఁ దెలుపుము.

అసఫ్—చక్రవర్తి యొకమాఱు నీదర్శనమునకై యువ్విళు లూరుచున్నాఁడు.

నూర్జహాను—నీవు తెలుపు శుభవార్త యిదేనా!

అసఫ్—చక్రవర్తి దర్శనమే శుభోపేతమైనది.

నూర్జహాను—అతనికి నాదర్శన మెందులకు?

అసఫ్—ఎందులకో నన్నడుగ వలయునా?

నూర్జహాను—గ్రహించితిని! చక్రవర్తి యుద్దేశ మదియైన వేగమ నీవాతని కడకరిగి నానమస్కార సహస్రములు లతని కర్పించి అట్టి దుస్సహసమ్మానమును నే భరింపఁ జాలనని తెలుపుము.

అసఫ్—కాని నీవిందుండి నిష్క్రమింపక పూర్వ మొక మాఱు సార్వభౌమునితోఁ గలసి మాటలాడుట కిష్టపడుదువా?

నూర్జహాను—నేనందుల కిష్టపడను!

అసిఫ్—సోదరీ! నీకింత పట్టుదల యేలనో నే గ్రహింపఁజాలకుంటిని. శేర్ఖాను మరణించి నాలుఁగు వత్సరము లాయెను. విధవా వివాహము ముసల్మానుల యాచారమునకు విరుద్ధముకాదు. తరంగముపైఁ దరంగముబడినట్లు వత్సరముపై వత్సరము విరామము లేకుండ బడిపోవుచున్నది. కాలచక్రము తిరిగిపోవుచున్నది! అట్లయ్యు, నీస్మరణము చక్రవర్తి హృదయమందు శిలా ఖండమువలె దృఢమై, జటిలమై యత్యుజ్జ్వలమై యున్నది! కాని నీవు—

నూర్జహాను—నాస్మృతి చక్రవర్తి హృదయమందెట్లుజ్జ్వలమై యున్నదో, నాప్రియునిస్మృతి నాచిత్తమందట్లే జాజ్వల్యమానమై యున్నది!

అసఫ్—కాని, నీవు నీవల్లభుని మరలఁ బడయఁజాలవు. ఇదెట్టి మూఢతయో నేగ్రహింప నేరకుంటిని.

నూర్జహాను—నీవు గ్రహింపనేరవు. ఈద్వంద్వమును, ఈయనుశోచనమును, ఈ యంతర్దాహమును నీవెట్లు గ్రహింపఁ జాలుదువు!

అసఫ్—సర్వకర్మ పరిత్యాగ మొనరించి, యనుశోచన మొనరించిన, మాత్రాన నీకు జీవన శ్రేయంబలవడునా? ఒక్కమాటలో నొక్క యింగితము మాత్రాన నీవు భారతాధీశ్వరివి కానున్నపుడు—

నూర్జహాను—నేను భారతాధీశ్వరి నగుట కిష్టములేదు. నీయుపదేశము వృథయని యెఱుంగుము. ఎట్టులైన నన్నీవొప్పింపఁజాలవు. నీవిట

నుండి వెడలిపొమ్ము!

అసఫ్—(క్షణకాలము నిరవ్వఁడై యుండి మెల్లగ)—"సోదరీ! నేఁడు నీవెట్టి యుత్కృష్ట సమ్మానమును జేఁజేత విసరివైచుచుంటివో యెఱుంగనేరకుంటివి! కాలము గడచుకొలఁది భయంకర వార్ధక్యము నీయుచ్చలలాటము నాక్రమించినపుడు నీవు నీయౌవనమందెట్టి తరుణమును వృథపుచ్చితివో తెలిసికొని నిష్ఫలానుతాపమొందెదవు. ఏను యోగమునునీవు నేఁడు చేతులారఁ బరిత్యజించుచుంటివో రేపు దానినిఁక నీవేమిచేసియును మరలింపఁ జాలవు.

నూర్జహాను—అందఱు కలసి కుట్రఁబన్నినారు! నన్నుఁ బూర్తిగ నున్మాదినిని గావింపకవీరలువదలునట్లుదోఁచుట లేదు! ఉచ్చైస్స్థానమున నీవిచటి కేలవచ్చితివి?—పొమ్ము! ఇందుండి వెడలిపొమ్ము!

అసఫ్—మంచిదట్లే పోవుదును! కాని కడపట్టిమాఱు చెప్పిపోదును. వినుము. ఎట్టి పదవి నెట్టి మాన్యతన్ను, నీవు నేఁడు చేత బట్టుకొనియు, విడచివైచుచుంటివో, కోరినమాత్రమున నేమి కాఁగలుగుదువో యెంచి చూడుము! వదలివైచిన పాత చెప్పు ముక్కవలె చెత్తలోఁ బడియుండఁ గోరుదువో, లేక సుందర చంద్రశాలాభ్యంతరము నడుమ మహోజ్జ్వల కాంతి పుంజముల వెదజల్లు ప్రదీపమువలె మహోన్నతస్థితియం దుండగోరుదువో, యిపుడే,—యీ ముహూర్తమందే, యీ చోటనే స్థిరమైపోవలయును! భిక్షాటనము—విశాల సామ్రాజ్యాధీశ్వరీ పదవి. ఈ రెంటియందొకదాని నెన్నుకొనుట ప్రయాసమని నేఁ దలఁపను!

నూర్జహాను—ప్రయాస భూయిష్టకార్యము కాకపోవుట నిక్కము. దానంజేసి భిక్షాటన స్థితినే నే నెన్నుకొనుచుంటిని.

అసఫ్—మిహిరా! నీ వొకర్తుకవే భిక్షుకురాలవు! నీ కుటుంబము వార లందఱుకూడ బికారులగుదురు. "నీ తనయుసమ్మతియైనచో

నీకు మంత్రిపదం బొసఁగెద" ననియు, "లేనిచో, నీ కోశాధ్యక్షు పదవికూడ నిలువఁజాల" దనియుఁ జక్రవర్తి మనతండ్రి కెఱిఁగించెను.

నూర్జహాను—(ఒకించుక చింతించి)—అనఫూ! నీవేమి పలుపమనుచుంటివో యెఱుఁగుదువా? నా శరీరంబును—నా యాత్మను—నా మానంబును—నా యాత్మగౌరవంబును నాయుదియని చెప్పుకొనువాని నన్నింటిని సామ్రాజ్యార్థము వీడుమని చెప్పుచుంటివి! ఆహా! యేమి యీ దౌర్భాగ్యము! ఎవ్వాఁడు నా వల్లభునిఁ దన కడుపునఁ బెట్టుకొనెనో,— ఎవ్వానిఁ దుద మ్రుట్టింప, సాన బెట్టిన కత్తివంటి తీవ్రప్రతిహింస నా యంతరంగమందు దీప్తమై యుండవలెనో, వానిని—ఆ ఖలుని నా ప్రేమాలింగనంబులోని కాహ్వానింప సాహసింతునా?

అనఫ్—ప్రతిహింసయే కావింపఁ దలంచుచో, నీ కింతకంటె మంచి తరుణ మెట్లు లభించును? ప్రాసాదము వెలుపల నొక సామాన్య రమణివలె నున్న నీకేమి సాధ్యమగును? కాని, నీవు సామ్రాజ్ఞి వగుచో, నట్టి తరుణంబును నీవు ప్రతిదినము, ప్రతి నిమేషము, ప్రతిముహూర్తము బడయఁగలవు. సోదరీ! వివేచన మొనరింపుము.

నూర్జహాను—ఏమి యీ నియతి! పలుమాఱు నా కది యిట్టులే గన్పట్టుచున్నది! దూరంబునుండి యావర్త మొకటి నన్నీడ్చుచున్నది! లేకున్న నే నాగ్రా యరుదెంచిన దెందులకు? ఆ దినంబున గవాక్ష పథంబున వానిని మరలఁ జూడఁ దటస్థించు టేల? అట్టి పతిని ప్రేమింపకపోతినేల? ఈ ప్రాసాదము ప్రవేశింపక పూర్వము విషమును ద్రావి యేల యంత మొందనైతిని. తండ్రియు సోదరుఁడును వేయేల చక్రవర్తి సంబంధులందఱును నాకు విరోధముగ నిట్టి కుట్రను బన్నుచుండి రేల? ఆహా! ఏమికుట్ర! ఏమి ఘోరము!

నా చిత్తమందున్న పిశాచముయొక్క గీటడంచివైచితిని! కాని యిప్పట్టున పీరలంద రొక్కటై దానికిఁ దోడ్పడుచున్నారు! సోద రా! నే నోడిపోతిని!

అసఫ్—సోదరీ! నీ వేమనుచుంటివో నాకు బోధపడుట లేదు.

నూర్జహాను—బోధపడఁజాలదు!—కాని,!—కాని, మీ యందఱి యభిమతం బిదికాదా? జనకుండును, నీవును, ఎల్లఱును దీనినే వాం ఛించుచుంటిరా?

అసఫ్—ఎట్లు?

నూర్జహాను—నేను సామ్రాజ్ఞిని కావలెనని.

అసఫ్—అవును.

నూర్జహాను—జనకుని యుద్దేశ్యముకూడ నిదియేనా?

అసఫ్—జనకుని యుద్దేశ్యమేమో నే వ్యక్తీకరింపఁజాలను. కాని మే మందఱము నీవు సామ్రాజ్ఞివి గావలయు ననియే యభిలషించు చుంటిమి.

నూర్జహాను—మంచిది! మీ యభీష్టంబును దీర్చెదను! కాని!—జా గ్రత్త! జాగ్రత్త!! పిమ్మట నేమి జరుగునో, దానికై నేను బాధ్యు రాలను గాఁజాలను! బోనులో నున్న యాడుపులిని పురవీథియం దు విడుచుచుంటివని యెఱుంగుము. ఇంతదనుక నేశక్తిచే భీకర మగు తుపాను నాహృదయాభ్యంతరమున నడంచి యుంచితినో, ఆశక్తిని మీరలందఱు నేఁడు సన్నంబొనరించు చున్నారు. నిరం తరాయముగ నివు డీతుపాను మొగల్సామ్రాజ్యముపైఁ బడి భీష ణవిప్లవము నుద్భవింపఁజేయుఁగాక!

అసఫ్—ఏమి కావింపఁ దలఁచుచుంటివి ?

నూర్జహాను—ఏమి కావింతునో యింకను సరిగఁ జెప్పఁజాలను. కాని, యీ పిశాచముయొక్క శక్తిని నే నెఱుంగుదును—ఇఁక నీవు

పోమ్ము! పోయి, నేను దమ్ముఁ బరిణయమూడ సంసిద్ధనై యుంటి నని చక్రవర్తి కెఱింగింపుము.

[అసఫ్ నిష్క్రమించును]

నూర్జహాను—అట్లైన సామ్రాజ్యమీమహాలోక ప్రకాంక్ష భూకంపంబు నఁ గంపించి పోవుగాక!

షష్ట దృశ్యము

I have to put in a word of explanation for suffering this scene to find its place here. The corresponding Bengalee scene— succint though— is comic and colloquial. In the original scene it is depicted that some people of the King's Court speak exultingly of the Royal marriage and indulge in comic delineations of the beauty of the Royal bride. The material of the original scene is requisitioned in this scene. It is not quite unnatural for priests to feel hasty to proceed to a hymenial ceremony and to indulge in a conversation such as this. The reader may take objection that I took too much latitude to drag the parley beyond ordinary limits. These limits notwithstanding, the scene, not to speak of its comic excrescences, is but a partial depiction of the propensities—comic yet true—which hedge round our priest-hood. Deep thought bestowed on these propensities cannot be sansits use to a reformer and hence the occasion for the introduction of the scene.

The actors may or may not use this for their purpose.

ప్రాసాదబహిర్మందిరము—ప్రాతఃకాలము

బ్రాహ్మణులు కొందఱచట గుమిగూడుదురు

కేశవశాస్త్రి—సుబ్బావధానీ! ఏమి రా! మనపుణ్యం! యీవేళ ప్రొద్దున్నే లేచి, నువ్వు యెవరి మొగం చూచావురా!

సుబ్బావధాని—ఒక్క మొగమే యేమిటి? చాలా మొగాలు చూచాను! లేవగానే మొట్ట మొదట నీ ముఖదర్శనమే అయింది! కాలు బద్దలై ప్రత్యక్ష ప్రతిఫలం కనపడింది! పోనీఅని మళ్ళీ పడకేశాను. లేచేటప్పటికి మీాముత్తమతల్లి. అప్పుడే క్షౌరం చేయించుకుని మొదు

రుగుండా తయారైంది! చవటముండా అని మొగం వాచేటట్టు నాలుగుతిట్టి మళ్లీ మంచం మీదపడ్డాను! కళ్ళు మూయ్యడమేకాని నిద్దరపట్టి యేడ్వలేదు. అల్లాగే పడుకుని కేశవనామా లొక్క మాటుచదువుకొని మళ్ళీలేచాను. "మ్యావు,మ్యావు" మంఘామాజ్ఞాల చక్రవర్తిగారు సమీపించారు! కాని కళ్ళుతెలియక, ఆవును చూద్దామని మెల్ల మెల్లగ దొడ్లోకిపోయాను! తఫేలున గేదె గొయ్యిలో పడ్డాను. నా మీద గేదిదూడ, గేదిదూడ మీద నేను పడి చాలసేపు కొట్టుకున్నాము, పాలేరు వాడు వచ్చి లేవదీశాడు. ఆ వేదిరా అంటే, ఆవు బండెల దొడ్డిలో పడిందన్నాడు. తుదకు గేదెకుమూకుని దర్శనం ప్రాప్తించింది! ఇదీ యీవేళ జరిగినపని!

రామసోమయాజులు—అఘోరించావులే! మెప్పుడూ వాకే యేడుప్పు యేడ్చేవు!—యీ వేళైనా సంతోషంగా వుండు! పండగ! చక్రవర్తి వివాహం!

సుబ్బావధాని—అల్లా అయితే మనరొట్టి నేతిలో పడిందన్నమాటే! అయితే, పెళ్ళికూతురు బహుచక్కని పిల్లట! నిజమేనా?

రామసోమయాజులు—ఆ చక్కని పిల్ల పిల్లతల్లే!

వెంకంభొట్లు—ఒరే! సోమయాజీ! ఒక్క చక్రవర్తి పెళ్ళే అంఛావేమిరా? చక్రవర్తి కొడుకైన ఖురముకున్నా, అసవుకూతురుకున్నా వివాహ మవుతుంది! దానిని మాత్రము మఱచిపోవటం యేమిటి?

రామసోమయాజులు—పెళ్ళి పెళ్ళని మురవటమేకాని, మనకీ కార్యాలవల్ల బాగా ముట్టేటట్టు తోచదు!

కేశవశాస్త్రి—ఇదేమిరా! చెవలపెద్దమ్మా! ముందే అపశకునంమాట! చక్రవర్తికే పెళ్ళైతేవుంటే, బాగా ముటకపోవటం యెల్లా తటస్థించుంది?

సుబ్బావధాన్లు—ఆ చెవంకి ముట్టడం యెల్లా ముట్టుకుంది! 'ప్రాచీనావీతి!' చేయించడం తప్ప వాడికి మరేమీ చేతకాదు. బ్రాహ్మణ్యమంతా కలిసి సరశ్యంగోజున ఆశీర్వచన పనసలు చెప్తూవుంటే, వీడు దానిలో "పిండప్రదానం కరిష్యే" యని వాగేవాడు! యిప్పటికి షష్ఠ్యబ్ధ్యాపడికడిచినా, పెండ్లిమంత్రం యేమో ఆబ్దీక మంత్రంయేమో వివక్షత తెలియదు!

రామసోమయాజులు—నీకు మహా తెలిసి యేడిసింది కాంబోలు! చెప్పింది చెప్పక వాగమంటే నీయిష్టంవచ్చినట్లు గార్ధభస్వాముల వారివలె వాగుతావు! దానికి తుదా మొదలూ లేదు!

సుబ్బావధాన్లులు—ఓరి! చవల్లా! వూరుకో! నేను నీకంటె మెఱుగే! అయిదునేర్ల పిండప్రదానం కొట్టమంటే కొట్టగలవు. యిన్నేళ్ళు వచ్చి స్మార్తంయేమీ చెప్పుకోవద్దూ!

రామసోమయాజులు—ఛీఛీ! నోరుముయ్యి! నేను యెనభై పన్నాలూ వాంటికాలిమీద నిలబడి యేకరపెట్టగలను! కావలుస్తేవిను!—"ఓం ఓం! హిరణ్యగర్భా! శుచయఃపావకా! జాతవేదో మనపగామినీం! యాసాగుం వరుణోదేవా! తత్సవితువాః ఆకాశాత్పతితంతోయం! చతుస్సాగరపర్యన్తం తత్ఫలం పురుష ఆప్నోతి, ఓమ్! సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువమ్, పూహేబలైసకర్పూరం, ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయై, యిదం ద్యావాపృథివీ బ్రహ్మయజ్ఞం పితృతర్పణం గురుభ్యోన్నమః యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్ ఆయాతు వరదాదేవీ! మమ! మహేరణాయ చక్షసేహస్తావ వనిజ్య, యస్మిన్ దేవా, ఉపవీతీ! చండో విశ్వామిత్ర ఋషికా దక్షిణహస్తే. పురుషయేవేదగ్ం సర్వం య ద్భూతం యచ్చభవ్యం హ్రాం. హ్రీం. హ్రూం హ్రైం. హ్రౌం ఓం రాం రీం ఢీం!!!

కేశవశాస్త్రి—చాలు చాలు! వూరుకో! నీ కలగాపులగం పనసశా గానేవుంది! యిక వేళ మించ బెట్టరాదు! సంభావన వేళకు చేరుకోవాలి!

రామసోమయాజులు—అవునురా! ముందే వెళ్ళి కూర్చోవాలి! శాస్త్రం, వ్యాకరణం, తర్కం, నమకం, చమకం—అన్నీ, చదివేశామని చెప్పవలెను!—తర్వాత! పప్పుతో పోరాటం! అటుపిమ్మట! ధప్పళం! బూరెలు! పరమాన్నం! లడ్డుండ్ల వర్షం! ఒరే! సుబ్బావధానీ! నువ్వెన్ని బూరెలు తినఁగలవురా?

సుబ్బావధాని—నేనా! బాసిన పట్టువైచుకు కూర్చున్నానంటే, వొడ్డించేవాఁడు మనవాఁడైతే, బూరె వొకట్యంటి కర్ధసేరు నెయ్యివడిందంటే,—వేయి నూటపదహార్లను వేయించుకోకుండా విస్తరిదగ్గిరనుండి లేవను!

కేశవశాస్త్రి—బూరెలకేమిగాని నువ్వెన్ని ఘారీల నెయ్యి త్రాఁగఁగలవు?

సుబ్బావధాని—లెఖ్ఖేమిటి? 'ఘృతం సమర్పయామి' అని ప్రారంభించి, అయిదుసేర్ల నెయ్యిని పప్పులో మిళాయించి, పిసికి పైన రెండు పురుషిళ్ళ ఘృతంచల్లి, నిమిషంలో విస్తరంతా నాకి, రెండోమాటు వడ్డన సమయానికి చెయ్యెపట్టి సిద్ధంగా వుంటాను! భోజనమైన తర్వాత వొకమాటు దొర్లి చలిమంట వేసుకుంటే, కడుపులో నెయ్యంతా కరిగి బూరెలు నాలుఁగు మూలలకు సద్దుకుంటాయి! మొన్న వనసంతర్పణలో యేం చేశామనుకున్నావు?

వెంకంభొట్లు—ఒరే కేశవశాస్త్రీ! అనపుగారి కూతురు కూడ మా అందమైన పిల్లే నేమిటీ?

కేశవశాస్త్రి—అల్లాఁగనే విన్నాను! వింటమే!—చూచాను! అచ్చంగా మతాబాలావుంఛుంది!

సుబ్బావధాని—ఎల్లా ఉంచుం డెల్లా ఉంఛుంది?
రామసోమయాజులు—ఎల్లాగో యెఱుఁగవా? అచ్చంగా దేవతాస్త్రీ వలె ఉంటుంది. దేవతాస్త్రీ యెల్లావుంటుందో యెఱుఁగుదువా?
సుబ్బావధాని—అదే యెఱక్క పోవాలి! పాపం మా పినతండ్రితోడు కోడలు అచ్చంగా అల్లాగే వుండేది!
కేశవశాస్త్రి—మీ పినతండ్రి తోడుకోడలెవ్వరా?
వెంకంభొట్లు—ఎవరో యెఱుఁగవా? మీ బ్రహ్మన్నన్నయ్య భార్య! అంతేకాక మన సోమయాజి గాడి పెద్దిబొట్లు మేనమామ పెనిమిటికి స్వయానా పెత్తల్లి మనుమరాలి తోడుకోడలి భావమరిది అన్నకూతురు సుబ్బమ్మకు వదినగారు!
కేశవశాస్త్రి—ఓర్రి! గాడిదా మా బ్రహ్మన్న భార్య యిపుడు శిరోజములేని వెధవముండ. కాదట్రా?
సుబ్బావధాని—అల్లా అయితే ఆ పిల్ల దేవతాస్త్రీ వలె వుండదనుకుంటాను.
కేశవశాస్త్రి—అవునైతే సోమయాజీ అదెల్లా వుంటుందో నువ్వే చెప్పి వెయ్యి!
రామసోమయాజి—దాని నేత్రములు రెండును పద్మముల వలెను, కర్ణములు శంకములవలెను, నాసిక వంశివలెను, జడ భుజంగము వలెను వుండును! యిపుడెల్లా వుంటుందో గ్రహించితివా?
వెంకంభొట్లు—ఏడిసినట్లే వుంది నీ తలకాయి వర్ణన! శాస్త్రుర్లూ! నే వర్ణించుతాను విను. దాని నయనములు గుడ్లగూబ నేత్రములను మించి వుండును! చెవులో, మన ఝూరీచెంబులను పోలివుంటాయి! ముక్కంటావా, నా పొడుముకాయతో సరిసమంగా వుంటుంది! యిక దాని తలను చూస్తే మా నేతిదాకను చూడక్కర్లేదు! రంగుమాత్రం బాగావుంటుంది!—పురం పెట్టిన మసిబొగ్గురంగు.

అచ్చంగా మేకవర్ణం!

సుబ్బావధాని—ఓరి చెవలమ్మలారా! మీ టీకాటిప్పణాలను కట్టి పెట్టండి! ఆ పిల్ల మీకెవరికిదక్కదు! దానిని వర్ణించుకుమురియుటం యెందుకు? యిక్కడేవేళ మించపెట్టి సంభావన డబ్బులు నాలుగు పోగొట్టుకుని తర్వాత అఘోరిస్తారు! యింక పోదాం రండి (ముందుకు నడువ బోవుదురు).

వెంకంభొట్లు—ఒరే. వుండండ్రా! అదిగో! మేజువాణి చేసేందుకు కాంబోలు బోగం అమ్మాయిలు యిల్లా వస్తూవున్నారు!

వేశ్యలు ప్రవేశించి బాపలకు నమస్కరింతురు.

కేశవశాస్త్రి—సుపుత్రా ప్రాప్తిరస్తు!

రామసోమయాజులు—వివాహసిద్ధిరస్తు!!

వెంకంభొట్లు—గోమాయు ప్రాప్తిరస్తు!

సుబ్బావధాని—గార్ధభస్వరసిద్ధిరస్తు!!

కేశవశాస్త్రి—వారకాంతలారా! మీ కంఠం యెల్లా వుంటుందో వినాలని వుంది. ఒక మాటు పాడండి! పాడినతర్వాత గజ్జకట్టి ఆడండి! ఆడి పాడండి! పాడి ఆడండి! ఆడి పాడండి! పాడి ఆడండి! ఆడి—

వేశ్యలు పాడుదురు.

గీతమాల.

నవ్యరత్నవిభూషితనాతిలీల,
కనకహీరాది సుందర కాంతు లెసఁగ
ప్రకృతి తోఁచుచు నున్నదో పడఁతులార
మధుర సంగీతలహరిని పృధివి మీఁద
వెల్లి విరియఁగఁ జేయుచు, నుల్లములను

రండు ప్రకృతి రమణిని నిండు వేడ్కఁ
గొల్వ, వేళంబ మోదంబు నిల్వ యెదను

## స ప్త మ దృ శ్య ము

చక్రవర్తి యంతఃపురము—సాయంకాలము.

అంతఃపుర పార్శ్వసీమను లయలా, శర్యాయరులు వచారి చేయుచుందురు.

శర్యాయరు—లయలా! నీ ముఖము వెలవెలఁ బోవుచు విషణ్ణమై యున్న దేల? నీ నేత్రములు గుంటలు వడి శుష్కించి యున్న వేల? నీస్వరము భగ్నమై, కంపిత మగుచున్న దేల? నిన్ను వేధించు నాగాట మేమి?

లయలా—నాయీగాట మెఱిఁగి మీ రేమి చేయఁగలరు?

శర్యాయరు—దానిం దీర్పఁ బ్రయత్నించెదము.

లయలా—అట్లు ప్రయత్నించుట మీరా?

శర్యాయరు—నా శక్తి యల్పంబనియు, సామ్రాట్టు నన్నెపుడును లక్ష్యపెట్టఁడనియు, రాజపరివార మెప్పుడు నాకవజ్ఞ సేయుచుండుననియు నెఱుంగుదును. అయినను, నేఁ బ్రేమించుచున్న దేవతనగు నీ విచారమునుఁ దీర్పఁజాలక పోనని తలఁచెద.

లయలా—రాకుమారా! సర్వజనావజ్ఞయే మీ శోక శ్రోత్రవన్నెఁ దెచ్చుచున్నది!

శర్యాయర్—నీ భావమేమో గ్రహింపఁజాలకున్నాను.

లయలా—గ్రహింపఁ జాలరు. గ్రహింప వృథాయత్నముసల్పకుఁడు.

శర్యాయర్—నీవుకూడ నన్నవగించుచుంటివా?

లయలా—లేదులేదు! మీనిస్సహాయావస్థయందును, శారీరక నీరసమందును, మానసిక దౌర్బల్యమునందును, దైన్యస్వభావమునందును, నే నెంతయో సౌందర్యమును విలోకించుచున్నాను.

శర్యార్—నాయందు సౌందర్య మేమియు లేదనియా నీ యభి ప్రాయము?

లయలా—అట్లు తలపకుఁడు. మిమ్ముఁ బొగడినందున నాకెట్టి ప్రయోజనమును లేదు. స్తోత్ర వాక్యము లతిహేయములని నే నెపుడును దలఁచుచుందును. కాని నిజము చెప్పవలయునుగదా! నిక్కువముగ మీ రతిదీనులరు-నాకంటె నెక్కుడు దీనులరు!

శర్యార్—లయలా! నీవు దీనురాలవా? సామ్రాజ్ఞికిఁ బుత్రివై, సామ్రాట్టునకు—

లయలా—రాకుమారా! ఊరకుండుఁడు! సామ్రాట్టు పే రుచ్చరించు నోటితో నా నామము నుచ్చరించి నన్నుఁ గలుషితము కావింపకుఁడు. సామ్రాజ్ఞికిఁ గుమారినని దుఃఖపూర్వకముగ నొప్పుకొనవలయును. నిజము చెప్పకుండుట మంచిది కాదు కదా!

శర్యార్—లయలా! నీ వొక ప్రహేలికవలె గన్పట్టుచున్నావు.

లయలా—రాకుమారా! నా చరిత్రము మీ కింత జటిలమై తోచుచున్నదా!

(పరిచారిక ప్రవేశించును.)

పరిచారిక—(లయలానుద్దేశించి)—మిమ్ము బేగమ్ సాహెబు పిలచుచున్నది.

లయలా—నన్నా?

పరిచారిక—అమ్మా! అవును.

లయలా—బేగమ్‌సాహెబా?

పరిచారిక—అవు నామెయే.

లయలా—ఎందులకు?

పరిచారిక—ఎందులకో నాకుఁ దెలుపలేదు.

లయలా—మంచిది! వచ్చుచుంటినని చెప్పుము. పొమ్ము.

[పరిచారిక నిష్క్రమించును]

లయలా—మీరు నన్నుఁ బ్రేమించుచుంటిరని యెఱుంగుదును, కాని మీ రా ప్రేమ నణఁచివేసుకొనుట యుత్తమము.

శర్యార్—నీవు నన్నుఁ బ్రేమించుటలేదా?

లయలా—ప్రేమింప కేమి? ప్రేమించుచునేయుంటిని. ఎవరినైనఁ బ్రేమించిన, మిమ్మే! కాని మిమ్ముఁ బరిణయ మాడఁజాలను.

శర్యార్—నేఁ గావించిన యపరాధ మేమి!

లయలా—మీరు జహాంగీరు పుత్రులగుటే మీ యపరాధము!

శర్యార్—షాజహానుకూడ జహాంగీరు పుత్రుఁడేకదా?

లయలా—అవును!—అయిన?

శర్యార్—ఆతనిని నీమేనమామ కూతురు ఖాదిజా పరిణయమాడెను కదా?

లయలా—ఖాదిజా అసఫ్ తనయ—శర్ఖాను తనయను కాదు!—నా యార్తియందు—నా హృదయారాటమునందు—నా నిరాశాదూషిత ప్రభంజనమందు బ్రవేశించి మీ రేల కష్టములపాలు కాఁగోరెదరు?

శర్యార్—అట్లగుచో నీవింకొకరిని పరిణయమాడుదువా?

లయలా—ఆడను. ఆవిషయమున మీరు నిశ్చింతతో నుండుఁడు.

శర్యార్—అట్లైన నీవసలే వివాహమాడవా?

లయలా—వివాహమాడను.

శర్యార్—నీవీ విశ్వజగత్తును విలోకింపుము! ఆసువర్ణసంధ్యను వీక్షింపుము! అది నీలాకాశ వక్షోంతరమున నెట్లు సుషుప్తిమగ్నయై యున్నదో తిలకింపుము! చూడు మీ మందపవనము శ్యామలాంగియైన వసుంధరారమణి నెట్లాలింగన మాచరించుకొను

చున్నదో!—మత్తద్విరేఫావళులు లతాసతీ సుందర సుమాన నములఁ జుంబించి మకరందా ధరామృతపానంబొనరించి మైమఱ చి సుఖనిద్రయం దెట్లు తేలియున్నవో విలోకించుచు—ప్రేయసీ! ఇట్టి విశ్వంబున నొంటరిగ నుండ నెవరు సాహసింతురు?

లయిలా—అట్లైన నేనీ విశ్వంబునకు వెలుపలనుండెనని తలంపుఁడు.

నాసూరాటుమ—[ఆకస్మికముగ లయిలా దక్షిణ కరతలముందు వామకరంబిడి దానిని బెనవైచుచు కరుణస్వరమున]—కుమారా! ఇఁక మీరు పొండు. ఈవిషయములన్నియు మీకెఱింగింప నాకు సమయము లేదు—తెలుపఁగల స్థితియందు లేను!

శర్యార్—నీదుఃఖమేమో నాకుఁదెలుపవా?

లయిలా—తెలుపఁజాల. తెలిపినను మీకది బోధపడదు.—మీరిఁకఁ బొండు.

[శర్యార్ నిష్క్రమించును.]

లయిలా—శర్యారూ! నీవు నాశోకంబునెట్లు గ్రహింపఁ గలుగుదువు! నీవు కాదు. పృథివియం దెవరైననుదానిని గ్రహింపఁజాలుదురా! ఏతరుణిని నా జనకుఁడు ప్రేమపురస్సరముగఁ బూజించుచుండెవాఁ డని చెప్పనగునో, ఆమెయే నేఁడొక సామ్రాజ్యార్ధ మొక భూ ఖండంబుకొఱకు, నిజ భర్తను జంపెనని సుంతైన రోషములేక, లజ్జాకరమని తలంపక, యొక దురాత్ముని,—ఒక హంతకుని,— ఒక రాక్షసుని దన పతిగాఁ జేకొనెను! [వచించుచుండ స్వర మాకస్మికముగ రుద్ధమై పోవును. కొంతవడి మాటాడకయుండి, నిట్టూర్పు నిగుడించి] నా జనని నేఁడు నాకుఁ బరాయిదియై పో యినది. నా హృదయ పీఠమునుండి, నా స్వర్ణదేవతా ప్రతిమను దొంగ లూడఁబెఱికికొనిపోయినారు. నాసర్వస్వము హరించినారు. ఇప్పటినుండి నీరవనై, నిస్తబ్ధనై నిట్టూర్పులు నిగుడ్చుచు, నాదుర్ద

శను విలోకించుచుంటిని! కంఠం బడిలేదు. నోట మాటలేదు. స్తంభితనై నిలువం బడిపోతిని!! ఏమియు చేయ నేరనైతిని! మాత నురక్షించుకొనం జాలకపోతిని!! కాచుకొన నేరనైతిని!!!—అయ్యో! కాచుకొనం జాలకపోతిని!! హా! జననీ! జననీ!! తండ్రీ! తండ్రీ!! లయలా! నిర్భాగ్యురాలా! లయలా! లయలా! కర్మము! పాపము!! హా! విధీ! హా! హా!! హా!!! హా!!!!

[చివాలున నేలం గూలును. తెర పడును]

## అష్టమదృశ్యము

నూర్జహాను యలంకృత ప్రాసాదమందిరము—రాత్రికాలము విలువగల యలంకారములం దాల్చి నూర్జహా నామందిర మందేకతంబ పచారి చేయుచుండును.

నూర్జహాను—తుదకు భారతసామ్రాజ్ఞినైతిని! కాని, యీ పదవి నాకు గౌరవదాయకమా లేక లజ్జాకరమా? ఇది జయమా, లేక పరాజయమా? విజయ మెట్లగును!—పరిభవమే! పిశాచముతో నీతదనుకరణము సల్పితిని కాని, పరాజితనైపోతిని!—దానంజేసి నాసర్వస్వముకు గోల్పోతిని! కాని,—వెఱపేల? సామ్రాజ్ఞి నగుటచే సంతరాయములన్నియు నా మార్గమునుండి తొలంగిపోవా! అంతరాత్మ నడంచివైచితిని! వివేకంబును వీడితిని, ఇక ద్వేధానంకోచములెల్ల నా యెడద యందడంగియుండును? రాజ్యమేలుటయే నా కర్తవ్యము! నా పైశాచిక బల మెట్టిదో చూపెదంగాక! (ముందునకు జూచి) సార్వభౌముం డీయెడకే వచ్చుచున్నాడు!

[జహాంగీరు ప్రవేశించును—నూర్జహాను తేనికభివాదనమాచరించును]

జహాంగీరు—సుందరీ! నీవు సామ్రాజ్ఞివౌటకే జన్మించితివి! నీ వభివా

దన మొనరించు తెఱఁగు కూడ సామ్రాజ్ఞికి సరియైనరీతినున్నది.

నూర్జ—సామ్రాజ్ఞినగుటకైపుట్టి సామ్రాజ్ఞినే నైతిని! పృథివియందు గొందఱు ప్రయత్నంబున ఘను లగుదురు. మఱికొంద ఱప్రయత్నంబుగనే మహాపురుషు లగుచురు. [Some are born great; Some are made great;— Shakespear]

జిహాం—నీ వనినది నిక్కువమే. ఎట్టివారిని గొప్పచేయువలెనో. జగం బెఱుఁగక పోలేదు. రత్నంబునే లోకు లన్వేషించికొని తెచ్చి శిరో భూషణముగ నుంచుకొనుటఁ జూచుచుందుముకదా!

నూర—ఏ శిరముపై నా భూషణముండునో, ఆ శిరము దానిక్రింది మూపున కత్యంత భారంబై యుండును!

జిహాం—పూఁబోడీ!—అది జరిగిపోయెను!

నూర్జ—జరిగిపోయెనా?—తీవునది నిక్కమే! నానివంటి సత్యవిషయ మిహలోకమున మఱొక టేమిగలదు! పోనిం డావిషయ మెందుల కు?-ప్రభూ! నేను మి మ్మొక విషయ మడుగవచ్చునా?

జిహాం—తన్వీ! దేనినిగాని నీ హృదయేశ్వరు నడుగుట కింత సంకో చింపవలయునా?

నూర్జ—ఖుస్రును కారాగారమునుండి విడిచిపెట్టితిరా?

జిహాం—ప్రేయసీ! విడిచిపెట్టితిని.

నూర్జ—రీవారాజ్ఞి పాియనః మి మ్మట్లొనరింప విశేషంబుగ నను రోధించెనని తలఁచెదను.

జిహాం—అవును—కాదు—కాని, ఆమెనోరు తెఱచి యేమియుఁ బలుకలేదు. ఆమె చిత్తనిషేధమును బాటింపక, కన్నీరు కాల్వలై నేలఁ బ్రవహించుట జూచితిని! అంతర్నిరుద్ధ బాష్పంబువంటి దీర్ఘ నిశ్వాస మొకటి వెల్వడి ఆకాంతకాయమును, గంపింపజేయుట విలోకించితిని! దైన్యపురస్సరమగు నవ్యక్త ప్రార్థన మొకటి

యామె ముఖమునుండి మానసాతీత భాషామూలమున వ్యక్తమై నట్లు తోఁచెను. దానం జేసి నాకఠినచిత్తము కరగిపోయినది— సుందరీ! అతఁడు నా నందనుఁడు కాఁడా?

సూర్జ—నిక్కువమే. కాని (మందహాస మొనరించి) దేవరమూసె పుల్లాకుఁ బ్రాణదండనము విధించినపుడు న్యాయ విచారణము నోకించుక యధికముగఁ గావించితి రేల?

జిహాం—అతఁడు నీ సోదరీ పుత్రుఁడు. నీ పుత్రుఁడు కాఁడు.

సూర్జ—అయిన నతఁడు నాపోష్యపుత్రుఁడు కాఁడా?

జిహాం—పెంపుడు కొడుకునకును, గడుపునఁ గన్న కొడుకునకును భేదంబు లేదా? ప్రియసీ! పుత్రుఁడన నెట్టివాఁడో నీ వెఱుంగవని తలఁచెద.

సూర్జ—ఎఱుఁగను. అట్లెఱుఁగుటకు నాకెట్టి తరుణమును చిక్క లేదు.

జిహా—ఖుస్రు నానందనుఁడు.

సూర్జ—అంతియగాక యతఁడు రీవారొక్క గారాబుకొడుకు!

జిహాం—రీవా యెడల నీకెంతయో యీసు గలదని తలఁచెద.

సూర్జ—అట్లుండుట సహజము కాదు.

జిహాం—అట్లని నేభావింపలేదు.

సూర్జ—ఏల?

జిహాం—దగ్గరనుండువారు మాత్ర మీసుచే బీడితులగుచుండు టెఱుంగుదును. కాని దూరమందుండు వారలుకూడ నీర్ష్యచే భాధితుల గుదురని యెఱుంగను. రీవాయు నీవును వేరు వేరు చోట్ల వసించు చుంటిరి. రీవామూర్ధ్వస్థిత నక్షత్రమువలెభాసురంబైస్థిరంబై నిష్క లంకంబై యున్నది. నీవామెకుఁ గ్రిందుగా బూర్ణసుధాంశుని వలె సమీప మందుండుటచే మిగుల సుందరంబుగఁ గన్పట్టుచున్నావు.

పరిచారిక '(ప్రవేశించి)—"ప్రభూ ! సామ్రాజ్ఞి మీదర్శనము కొఱకై వేచి యున్నది.

జిహాం—ఆమెపూజ ముగిసెనా?

పరిచారిక—ముగిసెను మహాప్రభూ!

జిహాం—మంచిది నీవరుగుము. నేనిపుడే వచ్చెదను.

[పరిచారిక నిష్క్రమించును.

జిహాం—కాంతా! నేనిప్పుడే వచ్చెదను.

[జిహాంగీరు నిష్క్రమించును.]

నూర్జ—రీఘానక్షత్రమైయుండ నేఁబూర్ణచంద్రబింబమునా? ఇంతభేదమని యెఱుఁగవు! సరే! ఈచంద్రతేజమున ఆనక్షత్రకాంతి తెల్లనైపోవునో లేదో చూచెదఁగాక! నూర్జహాను దేవికాదు. రాజ్యమేల దొరకొనినపుడామె రాజ్యమునే యేలును! ఆమె యొరుల ప్రతిద్వంద్వతను సహింపఁజాలదు.

లయలా—(మెల్లగ ప్రవేశించి) నీవు నన్నుఁ బిలచితివా?

నూర్జ—అవును పిలచితిని.

లయలా—ఎందులకు!

నూర్జ—అవసరమున్నది. బిడ్డా! అవసరము లేనిదే నీవు నాకడకు రాకూడదా?

లయలా—రాఁకూడదనియే నాతలంపు.

నూర్జ—(కాతర భావమునఁ దనయను పిలోకించి)—బిడ్డా! అట్లనెదవేల?

లయలా—(స్థిరశుష్కస్వరమున)—నీకును నాకు నిఁక నెట్టి సంబంధమున్నది?

నూర్జహాను—నేను నీమాతను కానా?

లయలా—మాతవా! అట్లని యొరులు సెప్పుచుండ వింటిని.

నూర్జ—లయిలా! అంతదూరము పోతివా?

లయిలా—అవును. కాని నేనేమియు బాగుగ గ్రహింపఁజాలకుంటిని. ఒక్క భూఖండంబు కొరకై నా జనని తన్నుఁదానయ్యె కొనసాహ సించునని విశ్వసింపను. నా మాత మహోక రక్తక యనియు, ఆమె మరణించిన క్షణ నా జనకుఁడు నన్నుఁ బరిణయమాడెననియు, సవతితల్లివగు నిన్ను 'జననీ!' యనిపిల్వ నాకు నీవే నేర్పితివనియు, నేనిపుడు తలఁచు చుంటిని.

నూర్జ—లయిలా! నిర్భాగ్యురాలగు నీతరుణియే నిక్కముగ నీ జనని.

లయిలా—నిర్భాగ్యురాలవా? మానసధనము నొరునకు ధారవోసిన మదవతి నిర్భాగ్యురా లెట్లగును!—నీవు సౌభాగ్యము నభిలషించి సౌభాగ్యవతి వైతివి! కాని యిట్టిసౌభాగ్యవతి తనయనని యని పించుకొనుట నాదౌర్భాగ్యము! ఈ దౌర్భాగ్యము నన్నామర ణము దుఃఖింపఁజేయును! ఆహా! యేమి యీహృత్తాపము!— నూర్జహానూ! పసిపాపనై యున్నతఱి, యపవిత్రను నాగొంతుకం బడవైచి నన్నేలఁ జంపివైచితివికావు? అట్లగుచో నాకు నీయప వాద మును విననలసిన గతిబట్టకుండును గదా! ఇపుడైన బుణ్యా త్ము లెవరైన నాచరణంబులఁ బట్టి శతధావయ్యలగు నంతదనుక శిలాఖండముపై నన్ను నలగఁ గొట్టివైచిన మిగుల భాగ్యవతి ననితలంచెద!—ఆహాహా! ఏమి యవమానము! ఏమి జీవనము! ఛీఛీ! యెందులకీ బ్రదుకు! కాంతా! యిది నాకసహ్యమై యున్నది. ఇఁక నే బ్రదుకఁజాలను! ఆత్మహత్యఁ గావించు కొందును!—

నూర్జ—(విరక్తస్వరమున)—నీ కసహ్యమై యున్నదేమి?

లయిలా—నాకు జన్మం బొసఁగిన యువతి సామ్రాజ్యలోభమున స్వ భర్తృహంతకునే పరిణయమాడెనను చింతయే నా కసహ్యమైయు న్నది! ఈ బీభత్సవ్యభిచారమును నేను విలోకింపఁజాలను! ఈభీష

ణదృశ్యమును వీక్షింపనేరను! ఆహాంతకుఁ డున్మత్తునికరణి నీ వెను వెంటఁ దిరుగుచు, మోహాంధుఁడై నీ కోమలకరమును ముద్దిడి, నీచుబుకంబును స్పృశించి, 'ప్రేయసీ' యని నిన్నుఁ బిలచునపుడు, నా సర్వాంగకము లందును వేయి తేళ్ళుకుట్టినట్లు మహాజ్వాలయొ కటి మండిపోవును.—ఆహా! యేమిజ్వాల! యేమివేదన!—అదొక నాటిదికాదు! ఒక్క నెలదికాదు!—నిత్యము నిలచునది! నిత్యనూ తనావిచారమును, ఘోరతరాత్యాచారమును, భయానకవ్యభిచార మును,—నిరంతర మొక ఘోరపిశాచి కిల్బిషకర్మశాలయందు సిద్ధ ముచేయుఁ చుండుటఁ గాంచుచుంటిని! ఆహా! ఘోరము! ఘోరము!

నూర్జ—లయిలా! ఇట్లు నిత్యము నేను నీ గద్దింపు మాటల విని సహిం పఁజాలను. నీ రక్తవర్ణ నేత్రములు నా కెంతయో మనస్సంకటముఁ గలుగఁజేయుచున్నవి!

లయిలా—అట్లైన నేమిసేతువు! నన్ను హత్యఁగావించి వైతువా? అందాశ్చర్య మేమున్నది? పతిహంతకుఁ బరిణయమాడఁగలయా డుది తన కూతును జంపివేయఁజాలదా.! (సానుకంపస్వరమున) హా హతభాగినీ! నీపైఁ గోపపడను! అపుడపుడు నీ కొఱకై నే నెం తయో యంగలార్చు చుందును! ఎవ్వని యర్ధాంగివై యుండి, యిప్పు డెవ్వని జాయవైతివి? ఆశ్ఘానెక్కడ! ఈ జిహాంగీ రెక్కడ! అనంతగంభీర నీలాంబుధి యెచట? దుర్గంధమయక్షుద్ర పంకిలజలా శయ మెచట! హార్యక్షు మెచట!—అడవి నక్క యెచట! ఆ దేవతా సింహాసనమున స్వతంత్రించి కాముకు నొకని నాసీనుఁ గావించుట కీవు లజ్జనొందలేదా?—ఒకించుకైనఁ జింతింపలేదా?—ఆసరళో దారపూజ్య పవిత్రోజ్జ్వల మహిమామయ చరిత్రమును మఱచి, నేఁడొక నీచ, హేయ, కలుష, పంకిల పాపోపాసన మొనరించు చుంటివేల? రమణుల కత్యంతావశ్యకంబులై, వారల నెప్పుడునుబవి

త్రవతులఁ గావించు ప్రణయము కరుణకృతజ్ఞతాపుణ్యంబులనన్నిఁటిని విసర్జించి వైచి, పిశాచపాశబద్ధవై, నన్ను నీవు విక్రయము మొనరించు కొంటి వేల?

నూర్జ — బాలికా! యింక నీవూరకుండుము.

లయలా — ఊరకుండ నేం? నేటికి నీవు భారతసామ్రాజ్ఞివైతివని నీ భ్రుకుటివిలోకన మాత్రాన భయపడి యెల్లరు గంపించి పోవలెనని తలఁచుచుంటివి కాఁబోలు! — అట్లని స్వప్నమందైనఁ దలంపకుము! నీవు జహాంగీరుపత్నివ యగుదువో, లయలా శత్రానువృత్తి, యని తెలిసికొనుము! —

నూర్జ — (ఉచ్చైస్స్వరమున) — లయలా! —

లయలా — (అట్లే యుచ్చైస్స్వరమున) — నూర్జహాను! — (కోపించిన యాముపులులవలె, సిరుపు రొకరికొక రెదురుగా నిలువఁబడి జ్వాలామయదృష్టులఁ బఱపుకొనుచుండ జహాంగీ రా మందిరమునఁ బ్రవేశించును.

జహాం — ఇదేమి! — లయలా! ఇట్లు నిలువంబడితి వేమి — ప్రేయసీ! యేమి ట్లుంటివి?

[ఇరువురు — నిస్తబ్ధులై యుందురు. నూరహాను వెక్కి వెక్కి యేడ్వ దొడంగును]

లయలా — ఏడ్వుము; చిరంజీవివై యేడ్చుచుండుము. అవిల్లాపంబువలన నైన నీ కలంక మొకించుక కడుగఁబడునేమో చూచెద. నీవు తక్కువదానవు కావని యెఱుంగుదును! చిత్రాంగివాటం జేసియే యీతఁ డిట్లున్మత్తుఁడగు చుండెను. నిన్నీకలుషపథంబున కెవ రీడ్చివైచిరో నే నెఱుంగఁజాల కుంటిని! నీ స్వర్ణరాజ్యమునుండి నిన్నీడ్చి [జహాంగీరునుచూపి] యీ యస్థికుండమున నెవరు పడ వైచిరో గ్రహింపనేరకుంటిని!

జిహాం — లయిలా! నీవు నూర్జహాను పుత్రివైనను, నీయౌద్ధత్యమునకుఁ దగుదండనమునుఁ బడయుదువని యెఱుంగుము!

లయిలా — అటులనా! — జిహాంగీరూ! నీవు నూర్జహానకుఁ బతివైనను నీయౌద్ధత్యమునకుఁదగు దండనమును బడయుదువని తెలిసికొనుము!!

జిహాం — నీకు పొగ రెక్కుడై ట్లగపడుచున్నది! ఈ మాటీవు శిక్షింపఁబడుట నిక్కము.

లయిలా — నరాధమా! శర్ఖాను కుమారిని దండింపఁగల దండిమగం డెవండును బుట్టియుండలేదు. ఇఁకఁ బుట్టఁబోడు! కండకావరము చేఁ గొట్టుకొను త్రాగుబోతు లయిలా నేమిచేయఁగలఁడు?

జిహాం — నా ప్రేయసి ముఖముజూచి, నేను సహింప వలసివచ్చు చున్నది! ఇఁకఁనా సహనము నిలువఁజాలదు. ఈ ముహూర్తమందే నీ కావరమంతయు నణఁచఁగలనని తెలిసికొనుము.

లయిలా — అరే! జిహాంగీరూ! నిర్విక్రమ పరాక్రముఁడగు శర్ఖాను దుహిత నీబెడిదంపు పలుకులకు జడియునది కాదు — స్వేచ్ఛాచారీ! దొంగా! ఇట్టి నీతితోడనే నీ వాక సామ్రాజ్యమును బాలింపదార కొంటివా? జిహాంగీరూ! ఇపుడు నీవు భయసంహితుఁడవై శర్ఖాను కూతుని సమ్ముఖమున నెట్లు నిలువఁబడ గలిగితివో యని తలంచి మిగుల నచ్చెరువొందుచుంటిని! — కాని, — హంతకా! ఇపుడైన భయపడకుండ నా ముఖము చూడుము! — నీ సాహసమెట్టిదో చూచెదను! — చూడుము! — శర్ఖాను పుత్రినను విషయమును మఱువకయేదీ! చూడుము! చూడుము! నీ సాహసమెంతయో, నీ స్పర్థ యెంతో నేఁజూడఁ జూచెదను!

జిహాం — నూర్జహానూ! ఈ వ్యాఘ్రిని నీవుజయింపఁ జాలకున్న, శపథ పూర్వకముగ నల్లానామమున నేనే —

లయిలా — నీ చేననుఁ బొలియింతువా? జహాంగీరూ! అట్లనేకానిమ్ము!

నీపాదంబులఁ బట్టుకొనియెదను! నన్ను హత్యగావింపుము—నా కన్నతండ్రినెట్లు నీ కడుపునఁ బెట్టుకొంటివో నన్నుఁగూడ నట్లే నీపొట్టం బెట్టుకొనుము. దయాపురస్సరముగ నీవట్లొనరించిన శేష నిశ్వాసంబుతో నీపైనభిశాపంబును విడచి మరణింపఁ గలనను సాంత్వనము నాకు సేకూరును!

జిహాం—మంచిది! నీవిఁక సిద్ధముగ నుండుము. సేవకా!

నూర్జ—ప్రభూ! యీమా జీబాలికను మన్నింపుఁడు. ఈ దోష మంతయు నాయదియే! నేనే యీమెను ప్రథమమున నుత్తేజిత నొనరించితిని.

జిహాం—నూర్జహానూ! ఇఁక నేసహింపఁజాలను. మనుష్య సహనము నకు హద్దుగలదు. ఈ బాలిక నిపుడే తుదముట్టించెదను—దౌవారికా!

నూర్జ—మోకరించి—ప్రభూ! నా పుత్రుని (her adopted son Sephulla) యంత మొనరించితిరి! నాయధా సర్వస్వంబగు నీ బాలికనుకూడ నంత మొనరింపకుఁడు. ఈపర్యాయ మీమెను క్షమింపుఁడు.

జిహాం—(ఒకించుక చింతించి)—మంచిది! ఈ మాఱు నీతనయను మన్నించితిని. కాని కాంతా! యిదే కడపటి పర్యాయముసుమా! (లయలాపైఁ దీక్ష్ణదృక్కులఁ బఱపి) ఇదే తుదిమాఱుసుమీ! తెలిసినదా? ఇంతటినుండియైన నీవు భయభక్తులతో మెలఁగుము.

ఇట్లని అతఁడు నిష్క్రమించును

లయలా—(దైన్యముతోఁ జక్రవర్తిని విలోకించుచు నిలువంబడి అతఁడు వెడలిపోగనే నూరజహాను వైపునకు దిరిగి)—"తల్లీ!

నూర్జ—ఏమిబాలికా?

లయలా—ఒకకార్య మొనరించెదవా?

నూర్జ—ఏమి కార్యము?

లయిలా—పరుషభాషణముల నేనెట్లు వర్షింపఁ జేసినను నీవు కావించిన ఘోరాఘము పుణ్యము కాఁజాలదు—ఒకించుక ప్రాయశ్చిత్తముఁ గావింపుము.

నూర్జ—ఏమి ప్రాయశ్చిత్తము?

లయిలా—నీవే గ్రహింపఁగలవు! స్వర్గరాజ్యమునుండి పతితవై నీవిపుడు నరకకూపమందుఁ బొరలాడుచుంటివి! నీ కృత్రిమకుత్సితములు నీ చిత్తమును వేధించుచునే యున్నవి! అంతరాత్మనడంచివైచుట నీ తరము కాదు!

A few passages from English literature, may be quoted with advantage:—

Milton makes Satan say. "Which way I move is hell, myself am hell."

St. Paul says, the Gentiles have the law of God "written in their hearts; their conscience also bearing witness, and their thoughts the mean while accusing or else excusing one another."—Rom. ii. 15.

He that hides a dark soul and foul thoughts Benighted walks under the mid-day sun; Himself is his own dungeon.—

Milton. (Comus..

Better be with the dead.
Than in the torture of the mind to lie.
In restless ecstasy.
Oh, full of scorpions is my mind, dear wife!

Shakaspear (Macbeth))

He started like a guilty thing.—

Shakespear (Hamlet).

The thief doth fear each bush an officer.
A guilty conscience who can bear.

Shakespere.

O coward conscience, how dost thow afflict me!
Cold fearful drops stand on my trembling flesh.
What do I fear?—myself ?— Shaks. (Rich. III.

Oh it is monstrous! monstrous!!
Methouht the billows spoke and told me of it;
The winds did sing it to me; and the thunder,
That deep and dreadful organ—pipe, pronounced.
The name of Prosper.— Shakespeare. (Tempest.)

The following quotations from classical authors convey similar ideas:—

Nihil tam miseros facit, quam impietas et scelus.— Cicero.

Maxima peccantium paena est, peccavisse.— Seneca.

Nil conscire sibi, nulla pallescere culpa.— Horace.

In some of these quotations I, took the help of Brewer,

కాని. నీ వింకను,—పూర్తిగఁ బిశాచివై రాజపరివారము నొక్కమాఱుగ నరకకూపమునందుఁ, బడఁద్రోయుము! భుజంగినివలె సామ్రాట్ పరివారమును చుట్టివైచి, నీ విషంబుచే దానిని శిథిలమొనరించి, ధ్వంసంబు గావింపుము. బాధ్యతలేని పుత్రినయ్యు, ఈ విషయమున నీకు నేను బాధ్యనౌదును!—నీవేమి వచించిన, నది గావించెదను!

సూర్జహాను—(ముఖ ముజ్జ్వలమై పోవుచుండ తనయ కరంబుఁబట్టుకొని)—"కుమారీ! నేఁ జెప్పు నట్లాచరింతువా?

లయిలా—ఆచరింతును. మాతా! నేను బుద్ధిహీనను! నీవు నీ పైశాచికబుద్ధిలోఁ గొంత నా కొసంగుము. నేనునాయావచ్ఛక్తిని నీకు ధారవోసెదను. ఇద్దరము కలసి, యొక భీషణఝంఝానిల ముద్భవింపఁజేయుదము! నీవును నేనును నేఁడు మాతాపుత్రికలము గాము! తోడఁబుట్టి, యొకేవిధమున లక్ష్యముంచి, యొకే గతిని, నడచి, యొకే పరిణామమును వాంఛించి, కృతనిశ్చయులమైన యిరువురు ఢాకినులము!

శ్రీ

# నూర్జహాన్

## తృతీయాంకము

### ప్రథమదృశ్యము

అంతఃపురమందలి యుద్యానవనము—వెన్నెలరాత్రి

(ఆ ప్రమోదోద్యానమున విహరించుచును, ఖాదిజా పాడుచుండును:-)

గీతమాల

అంబుజారిని బోలు ముఖంబుతోడ
చంద్రికను బోలు మందహాసంబుతోడ
రమ్య కలకంఠకంఠ స్వరమ్ముతోడ
కలువలను బోలు నిడువాలు కనులతోడ
మెఱుపుఁదీవను బోలు నెమ్మేనితోడ
నా మదికి హాయి గొల్పు నందాల తునుక
నా విభుని, నాదు జీవితానందమూర్తి
నా మనోనాథు, నా మధుప్రేమ నిధిని
నా హృదయపీఠమున మహోత్సాహ మొప్ప
నిలిపికొని సర్వమర్పించి కొలుతు నెపుడు
హృదయ నాథుని సేవయే ముదితకెపుడు
జీవిత ఫలంబు స్వర్గసౌఖ్యావహంబు.

[ఖాదిజా పాడుచుండగా షాజహాను ప్రవేశించును. ఆతని నామె చూడక తన్మయతలో గాన మొనరించుచుండును. షాజహాను నిలుచు మైమఱచియుండును. ఖాదిజా కొంతసేపటికి వెనుదిరిగి చూచి షాజహానును గౌఁగలించుకొనును.]

ప్రాణేశ్వరా?"

షాజహాను—ప్రాణేశ్వరుఁడనో కానో యెఱుఁగను; కాని, నిక్కువముగ షాజహాను నని యెఱుఁగుదును.

ఖాదిజా—నే నింతవఱకు మీ కొఱకై ప్రతీక్షించి యుంటిని.

షాజహాను—అది నా పరమసౌభాగ్యము—కాని, నిన్నొక ప్రశ్న వేయ దలఁచుచుంటిని. మోహనాంగీ! నీ విపుడు పాడిన గాథ నెవరిని గూర్చి పాడితివి?

ఖాదిజా—ప్రియతమా! అదే యెఱుంగరా? [ఇట్లని యామె షాజహాను కరములఁ బట్టుకొనును]

షాజహాను—చెప్పక నీ వెప్పు డిట్లే నన్ను బాధించుచుందువు.

ఖాదిజా—హృదయేశ్వరా! ఆ గానమును మిమ్ము నుద్దేశించియే పాడుచుంటిని.

షాజహాను—అట్లైన, నిది భావింపవలసిన విషయమే!

ఖాదిజా—ఏల?

షాజహాను—నా ముఖము నెన్నియో మాఱు లద్దమునఁ జూచుకొంటిని. కాని, యదెన్నఁడుంబుజారి వలె నాకుఁ జూపట్టలేదు. నీ యుపమ సరియైనది కాదు!

ఖాదిజా—వల్లభా! మీ ముఖమండలమునఁ గానఁబడు సౌందర్యము నీరేజమందుఁ గాని, నీరేజారియందుఁగాని కానరాదు! ఏలనన, మీ యాననంబున నొక మహిమమయాంతర్జగతిని నేను జూచుచుంటిని. ప్రతిభా భూతదయలు, మీ నయనాలోకమం దాలో

కించుచున్నాను. సాహసాత్మ మర్యాదలు మీ విశాల ఫాలతలమున విరాజిల్లుచున్నవి. ప్రణయ యశస్సులు మీ పెదవులందు వికసించుచున్నవి. మీ హృదయమంతయు మీ యాననమునఁ బ్రతిబింబిత మాయెను.

He that hath light within his own clear breast enjoys bright day ; Milton.

ప్రాణేశ్వరా! భక్తుఁడగు హిందువుఁడు ప్రతిమాభ్యంతరమునఁ దన వేలుపును బొందునట్లు మీ యభ్యంతరమున నేను మిమ్మ్మ పొందఁగలిగితిని! This idea savours of Panentheism. Rabindra nath sings "తోమార్ మాఝె అసీమ్‌తుమీ; బజావ్ అపణ్; అమార్ మాఝె తుమార్ ప్రకాశ్ తాయి తోతో మధుర్" The unlimited Being is realised by the devotee, the limited being in whom in fact He resides and sheds the flood of His divine music!]

జహాను—అట్లైన నీ యుద్ధారము నిశ్చితము!—జలద వేణీ! నీ జనకుఁడైన యనపును, నూతనముగ సామ్రాజ్ఞియైన నూర్జహానును తోడఁబుట్టిన వారలే కదా?

ఖాదిజా—నాథా! అవును.

జహా—అట్టి యనపు నూర్జహానులకు నీవును లయలాయును గూరిమి తనయలు గారా!

ఖాదిజా—అవును.

జహా—ఇది యోచింపవలసిన విషయమే!

ఖాదిజా—ఇందు యోచించుట కేమున్నది?

జహా—ప్రేయసీ! యిట్లున్నఁడైన జరుగునా?

ఖాదిజా—ఎట్లు?

జహా—తోడఁబుట్టినవారి తనయలయ్యు, మీ యిరువురకింత వ్యత్యాసముండనేల? నీవభాగినివై యుండ, నూర్జహాను కూతురు రెండవ

సికిందర్ షా నై యున్నది. కాని జాణయైన లయలా, యర్భకుం డైన శర్యారు నేల పరిణయ మాడెనో తోచకున్నది!

ఖాదిజా—అతఁ డామెను ప్రేమించెను కదా!

షాజ—అది నిక్కవమే. ఆమె యా ప్రేమకుఁ బాత్రురాలు కాదని తలచెద—కాని, యర్భకుఁడైన శర్యారామెతో నెట్లు వేగఁ గలఁడో యెఱుంగను.

ఖాదిజా—ఏల?

షాజ—వారి కుభయుల కీడు తగదు లయలాకును, నాకును, శర్యారుకును, నీకును పాణిగ్రహణమైనఁ గడు యోగ్యముగ నుండెడిది!

ఖాదిజా—ఏ మేమి?

షాజ—లయలా నా యర్థాంగియైన నేనుమిగుల నానందించెడివాడను. నీ వా యర్భకునకు భార్యవైన మీదాంపత్యము కడు యుక్తముగ నుండెడిది! కాని మన మనుకొనునట్లు లేమియు జరుగ నేరదు—తా నొకటి తలఁచిన దైవంబు మఱొండు తలఁచును. మన కార్యంబు లన్నియు దైవాధీనములు! [Man proposes, God disposes] అడుగో అగ్రజుఁడైన ఖుస్రు వచ్చుచున్నాఁడు. నీ విఁక లోని కరుగుము.

[ఖాదిజా నిష్క్రమింపగనే ఖుస్రు ప్రవేశించును.]

షాజ—అన్నా! రమ్ము.

ఖుస్రు—తమ్ముఁడా! ఒక వార్త యున్నది!

షాజ—ఏమివార్త?

ఖుస్రు—చెప్పెదను. కాని, జనకుఁడు నిన్ను బిలుచుచున్నాఁడు.

షాజ—ఎందులకు?—ఆకస్మికముగ నన్నిపుడతఁడేల పిలువవలయును?

ఖుస్రు—దక్షిణ దేశమందలి యేలికలు విద్రోహ మొనరించిరఁట. వారల నణఁగఁద్రొక్కుటకు నీవు మరల నాసీమకరుగవలయునఁట!

షాజ—మరలఁ బోవలయునా! కొంతకాలము క్రితమే కదా వారల వశపఱచుకొని వచ్చితిని!

ఖుస్రు—వారలు మరల విద్రోహము సలుపసాహసించిరి!

షాజ—ఆశ్చర్య మాశ్చర్యము! నాజీవనమంతయు యుద్ధము సలుపుట యందే గడచి పోవునట్లున్నది. ఒకించుకైన విశ్రాంతిలేదు! దక్షిణ దేశమందు విజయధ్వజమెత్తి, పిదప—మీవారుసు జయించివచ్చితిని! మరలఁ బ్రభాతముకాకమున్నే యుద్ధమునకు డీకొనవలసి వచ్చుచున్నది.

ఖుస్రు—సోదరా! నీధైర్య శౌర్యములను నేను మిగుల—నక్కజపడుచుంటిని! ఎనిమిదివందల వత్సరములనుండి మొగలాయి బలంబును తుచ్ఛమొనరించి, తన పర్వతదుర్గప్రాకారమున రక్తధ్వజం బెత్తి ప్రతిభాసమన్వితమై వెలుఁగొందిన మీవారును, నీ వవలీలగ నేఁటికి జయించితివి!

షాజహాను—[నవ్వి]—నేను మీవారును జయింపలేదు.

ఖుస్రు—జయింప లేదా?—అట్లనుచుంటి వేల?

షాజ—సేనాధిపతియైన మహాబత్ఖాను మీవారును సంపూర్ణముగ స్వాధీనము గావించుకొన్న పిదప రసపుత్రులతో స్నేహము సలుపుటకై జనకుఁడు నన్నా దేశమునకంపెను! పితాజ్ఞ ననుసరించి, నేను రసపుత్రులతో—సంధిఁగావించితిని! పదపడి నేనే మీవారును జయించితినని లోకులు చెప్పుకొనసాగిరి!

ఖుస్రు—ప్రజ లట్లు చెప్పుకొనుచుండ మహాబత్ఖానేల యూరకున్నాఁడు?

షాజ—అట్లూరకుండుటకు వాని యుదారతయే హేతుకము! ఆవీరుఁడు విక్రమసన్మానమును వాంఛింపలేదు! ఏకారణముననో మీవారు విజయమును గూర్చిన సత్యము నతఁడు రహస్యముగ

దాచఁదలంచుచున్నాఁడు.

ఖుస్రు—అటులనా?—అట్లని నే నెఱుంగను. విజయు లెవరైననేమి? సోదరా! మీవారు రాణాతో నీవొనరించిన సంధియం దెంతయో యౌదార్యమును జూపితివి. ఓడిపోయిన వారితో నింతవరకింత సమ్మానపురస్సరముగ నెవ్వరును సంధి జేసికొనియుండలేదని తలఁచెద.

షాజహాను—అన్నా! దేశకాలపాత్రముల నెఱిఁగి పౌరుష వ్యాపారముల నొనర్పవలయును. మీవారు రాణా లోక మహాపావనమైన యతిపురాతన రాజవంశమం దుద్భవించిరి.—ఏవంశమందు బప్పారావు, చంద్రావత్, రాణి, సమరసింహప్రతాపసింహులు జన్మించిరో,—ఆ రాజవంశము నేఁడు పడిపోయినది. అన్నా! మీవారు దేశమాత కష్టములెట్టివో మనము గ్రహింపఁజాలము! కాని సాధ్యమైనంతవఱకు కామె దుఃఖభారమును తగ్గించి వైచితిని!

ఖుస్రు—అనుజా! నీయౌదార్యమే నిన్నంతప్రీతిభాజనుఁ గావించినది. నీవును, జనకుండును సమ్మతించిన, నేఁగూడ దక్షిణదేశమున కరుదెంచెదను—నేను రణవిద్య నభ్యసించెదను.

షాజ—ముందుగ మనము జనకుని కడకరుగుదము రమ్ము.

ఖుస్రు—మంచిది. నడువుము.

షాజహాను—అన్నా! నీవు పోవుచుండుము- నే నిప్పుడవచ్చెదను.

[ఖుస్రు నిష్క్రమించును.]

షాజ—ఏమి యీరాఠేలికల దౌష్ట్యము! ఆనాఁడు మొగలు చక్రవర్తికి లోఁబడి యుందుమని శపథ మొనరించి, యిపుడు దుర్మార్గులై నిద్రోహము సలుప సాహసించిరిగా! మంచి దీ మాఱు వారల బంధించి రాజధాని కీడ్చుకొని వచ్చెదను.—ప్రేయసీ! ప్రేయసీ!!

(ఖాదిజా ప్రవేశించును.)

షాజ—సతీ! దక్షిణసీమకువచ్చుటకై ప్రయాణసన్నాహ మొనరింపుము.

ఖాదిజా (అబ్బురమున)—నాథా! ఇపు డచటి కరుగుటెందులకు?

షాజ—అచటి ఏలికలు విద్రోహము సలుపుచుండిరి. ఇపుడు నేఁ బోయి వారలఁ దగురీతి శిక్షింపవలయును.

ఖాదిజా—అట్లు మీరొనర్తురా?

షాజ—నేఁ గాకున్న నీవొనర్తువా! అకస్మికముగ రుస్తము మహావీరుండవై నీవు వారల యుక్కడంపఁజనుదువా! లయిలాయైన, యట్లొనర్పఁ గలుఁగుదువేమో!—ప్రేయసీ! నే నచటికిఁ దప్పక పోవలయును! ఆయాజ్ఞ నాకెఱింగింప జనకుఁడు నన్నుఁ దన కడకు రమ్మని నాకిపుడు కబురంపెను. ఇపుడు నే నచటికిఁ బోవుచుంటిని.

ఖాదిజా—"నాథా!"—ప్రియుని కరద్వయమును ప్రీతిపురస్సరముగఁ బట్టుకొనును.

షాజ—ఇఁక నీవరుగుము. ప్రేయసీ! సరసారుణాధరపల్లవమును ముద్దుబెట్టుకొనుచు భార్యాప్రేమ కటాక్షవీక్షణములకు బద్ధుఁడనై ప్రమోదపర్యంకమునఁ గాలము పుచ్చుట కిది తరుణము కాదు—కఠోరకర్తవ్య మెదుట నిలచియున్నది.

[నిష్క్రమించును.]

ఖాదిజా—(నిమీలితనేత్రయై)—అవును. తప్పు నాయదియే! పురుషుల కనేక కార్యములుండును. వారలు సర్వజ్ఞులు—అభాగినులమగు రమణులము మేమేమియు నెఱుఁగము. అశిక్షితులమై, మాఢ్యపంకమం దజస్రము పొరలాడుచుందుము. భర్తృపరిచర్యామాత్రము నేర్చితిమి. దాంపత్య ప్రణయము తక్క నన్యమేమియు మే మెఱుఁగము!

[నిష్క్రమించును.]

## ద్వితీయదృశ్యము.

లాహోరునందలి యంతఃపురము — రాత్రికాలము.

విలువగల నగలనలంకరించుకొని చిత్రవిచిత్రములగు బొమ్మలు గల సౌధమందు నొంటరిగ నూర్జహాను విహరించుచుండును.

నూర్జహాను — శక్తిసురనాప్యాయనంబుగఁ గ్రోలితిని. ప్రతిరక్తనాడి యందు దానియుష్ణోత్తేజన ముదయించుచున్నది. — కాని, జీవనమన్న నింతియేనా? — ఆత్మరక్షణ జన్మదాన తంత్రములు మాత్రమే సృష్టిమహాచక్రమును ద్రిప్పుచుంటలేదు! వాని యభ్యంతరమునఁ నొక ప్రమోదానుభవమున్నది. లేకున్నఁ బక్షులత్యావేగమున గానమ్ము సలుపు టెందులకు? వనస్పతులు వివిధ పత్రపుష్పములలోఁ బ్రకాశించుటేల? శైవలినీ వక్షముచ్ఛలి పేనిలత రంగములతో విరాజిల్లు టెందులకు? నీలాకాశమున సుధాకరుఁడు ముఖము కలకలలాడ నవ్వుటెందులకు? ఆకలి దప్పులఁ దీర్చుకొనుటయే జీవనమునకుఁ దుదిలీలయైన ఖాద్యమంత సరసమేల కావలెను? ప్రసూనసౌరభమింత మధుర మగుటకుఁ గారణమేమి? సంగీత మింత ప్రీతిపాత్రమై యుండుటేల? సత్యరాజ్యమును మాత్రమే యావిర్భవింపఁజేసి యూరకుండక ప్రతిభకల్పనాస్వర్ణరాజ్యంబును కూడసృష్టించనేల? — ఇదే ప్రకృత జీవనము! నేఁడునేను జీవనధారణము మాత్రము సలుపుచుంట లేదు. ప్రతి రక్తనాళమునందు జీవనానుభవ మొందుచున్నాను!

The beautiful universe, in which we breathe, move and live, is rippling with life, albeit the manifestation thereof differs in different things in different degrees — life which offers the flowers of wisdom to the beatitude of the Soul! The golden sheaf, the feathered mistrel, the rosy dawn, the crimson sunset, the resplendent moon, the greenfield, the gurgling stream, the glassy lake, the happy valley and the wooded hill

clothed in vernal gowns of beauty reveal the eternal glory of God; *make our lives delicious and blissful*—engender bright and robust optimism in our hearts; and inspire us to strive with ardour and alacrity for the realisation of the ideals of truth, beauty and goodness (सत्यं, सुन्दरं शिवं)

But Nurjahan doesn't gauge the philosophy in nature. She opines that universe is but a round of enjoyment.

(పరిచారిక ప్రవేశించును.)

నూర్జ—పరిచారికా! యేలవచ్చితివి?

పరిచారిక—బేగమ్‌సాహేబు సోదరుఁడు దర్శనార్థమై వేచియున్నాఁడు.

నూర్జ—ఎవరు? అసఫా!

పరిచారిక—అవును.

నూర్జ—ఇపుడు వీలులేదని చెప్పుము—మంచిది! లోనికిఁ దీసికొని రమ్ము.

(పరిచారిక నిష్క్రమించును)

నూర్జ—పితృమరణానంతర మొక ముహూర్తములో ననవునకు మంత్రి పదవి యొసఁగితిని. శక్తియొక్క కృపాదృష్టికొరకై మనుజు లెదురు చూచుట జూడ దానిమాధుర్యము బాగుగ విదిత మగుచున్నది! శక్తి తన కడకాలని సరివైచు ననుగ్రహమును వ్యగ్రహస్తమై యశక్తి మెలకువతో గైకొన నువ్విళులూరును! శక్తికి నిక్కువముగఁ బ్రభావమున్నది!

(అసఫ్ ప్రవేశించును)

నూర్జ—సోదరా! వార్తయేమి?

అసఫ్—ఆంగ్లేయ రాజదూతయైన రోదొర (Sir Thomas Roe who came to India in 1615 with a view to seek permission from the Great Moghul for estabilshing Commercial connetions between England and India) మరలఁ దనవిన్నపమును నీకెఱింగింప వేడుచున్నాఁడు.

నూర్జ—సూరతునొద్ద కొంత (Foctory) నిర్మించు కొనుటకా యనుమతి?

అసఫ్—అవును.

నూర్జ—ఆవిషయమును నిన్నమఱచితిని. నేను చక్రవర్తితోఁ బ్రసంగించి శీఘ్రముగ ననుమతి నొసంగుదుమనియు దానికొరకై చింతింప వలసినపని లేదనియు వానికెఱింగింపుము.

(అసఫ్ నిష్క్రమించును)

నూర్జహాను—(మరల నాయాగార్రమందుఁ బచారు గావించుచు) నేనింకను యథోచితముగ నాశక్తినియుపయోగించుటలేదు. ప్రతిహింసా కృత్యంబు నిఁక ప్రారంభింప వలయును. ఏకార్యార్థము నర్వహారణముఁ గావించుకొంటినో, యాకార్యమునిఁక నారంభింప కుండుటేల?

షాజహాను—(ప్రవేశించి) "సామ్రాజ్ఞీ! తండ్రిగారిచటికి వచ్చియుండ లేదా?"

నూర్జ—ఈ సమయమునఁ జక్రవర్తితో నీకేమి పని?

షాజ—అతఁడు నన్ను దక్షిణసీమకుఁబొమ్మని యాదేశ మొసఁగెను! ఆ విషయమున నేనాతనితోఁ గొంత ప్రసంగింపవలయును.

నూర్జ—అతఁ డిచటికివచ్చి యిపుడే యెచటికో వెడలిపోయెను.

షాజ—అటులనా?-మంచి దతఁ డెచటికేగెనో వెదకి చూచెదను.

నిష్క్రమింపఁబోవును.

నూర్జ—(ఆకస్మికముగ)—షాజహాన్.

షాజ—(వెనుదిరిగి)—ఎందులకు?

నూర్జ—చక్రవర్తి కిపుడు ప్రేమపాత్రుండైన కుమారుఁడు ఖుస్రు కాని నీవు కావు!

షాజ—తన కుమారులలో నొకనికంటె మఱొకనిపై జనకుని కెక్కువ

ప్రేమ యుండుట సాధారణమే.

నూర్జ—నీవు సామ్రాట్టు సైన్యాధ్యక్షుండవు. నీకార్యమం దీవుమిగుల దక్షుండవు. నీవు చక్రవర్తికిఁ గుడిభుజంబవు. దక్షిణసీమయందు నీ విక్రమ పరాక్రమమును జూపి మహాయోధుఁడ వనిపించు కొంటివి కాని—కాని భారత-భవిష్యచ్చక్రవర్తి రీవానందనుఁడగు ఖుస్రు.

షాజ—బేగమ్‌సాహెబా! దీని రహస్యార్థమేమో తెలియుట లేదు.

నూర్జ—తెలిసికొనలేకుండుట కీవిషయమంత కఠినముగఁ గన్పట్టుచున్నదా!—నీవు దక్షిణదేశమున కరుగుచుంటివి! ఆ సీమనంతయు స్వాధీనముఁ గావించుకొనుటకు నీ వచట దాదాపుగాఁ బది వత్సరము లుండవలెను. ఇఁక నిచట సామ్రాట్టుకడ సుఖజీవియు, నేత్రరంజకుఁడు, హృదయరంజకుఁడు నైన ఖుస్రు యుండును. ఖుస్రు నాకేమియుఁ గాఁడు! నీవు నా సోదరుఁడైన యసఫునకు జామాతవు. దానంజేసి యీ విషయమును నీ కెఱుంగఁజేసితిని!

షాజ—మీ యుపదేశ మేమి!

నూర్జ—అది నీవే గ్రహింపుము. నేను విశేషముగ నేమియుఁ దెలుపనక్కఱలేదు. ఎట్లయిన నీవు నీ యగ్రజుఁడైన ఖుస్రును జక్రవర్తికి దూరంబుగ నుంచుము. ఆ వెనుక మీ యిరువురిలో నొకరు భారతభావి సామ్రాట్టుగునను విషయము మీమీ శక్తిపై నాధారపడియుండును! ఇందు దుర్నయ మేమియు లేదు.

షాజ—ఖుస్రు తనంత దానే నన్ననుగమింపఁ గోరుచున్నాఁడు.

నూర్జ—మంచిది! వానిని నీవెంటఁ గొనిపొమ్ము.

షాజ—కాని సార్వభౌముఁ డందుల కియ్యకొనఁడు!

నూర్జ—అతఁ డిష్టపడునట్లు నేఁ జేసెదను!

షాజ—మంచి దట్లయిననాకిఁక సెలవొసంగుఁడు. [సలాము నరించును]

నూర్జ—నేఁ జెప్పినది జ్ఞాపకముండునా?

పాజ—ఉండును.

[నిష్క్రమించును]

నూర్జ—మణిమాలా!

(పరిచారిక ప్రవేశించును)

నూర్జ—అనఫు నొకమారు బిల్వుము.

[పరిచారిక నిష్క్రమించును]

నూర్జ—ఖురమన్న నా కెంతయో యనిష్టము! వానిం దలచిన నాకు నెఱపుకూడఁ గలుగుచుండును. అతఁడు మితప్రసంగి. తలప్రక్కకు నైనఁ ద్రిప్పఁడు. మిగుల గర్వ్యిష్టి. అతఁడు నన్నెంతయో యేవగించుచుండును. క్రమంబుగ వానింగూడ నేఁ దప్పించివైచెదను. రాజ పరివారమును నిశ్శేషముగ నస్థికుండమునఁ బడవైతును.

(అనఫు ఖురలఁ బ్రవేశించును)

నూర్జ—సోదరా! నీతో నొక విషయము జెప్ప మఱచితిని. రేపు పగలు రెండుజాములవేళ రహిమాను నొకమాఱు నాకడకంపుము.

అనఫ్—నీ భర్తను జంపిన యా హంతకునితో నీ కేమిపని?

నూర్జ—(పెద్ద నవ్వునవ్వి)—ఆతని యనుగ్రహంబుననే నేఁడు నే నీ సమ్మానము నొందితిని!

అనఫ్—కాని,—

నూర్జ—ఏమియుఁ బ్రశ్నింపకుము. ప్రత్యుత్తరము రాదు. చెప్పినట్లాచరించుచుండుము. నారీచరిత్రము నెఱుఁగఁ బ్రయత్నింపకుము. అది నిష్ఫలము. ఇఁకఁ బొమ్ము.

[అనఫ్ నిష్క్రమించును]

నూర్జ—ఏ శక్తిచే గ్రహోపగ్రహములు తమతమ నియమిత స్థానములందుఁ దిరుగునో,—యా శక్తిచే మహాశూన్యమును భేదించి

ధూమకేతువు మహావేగమున ముందునకుఁ బర్విడును! ఏ శక్తిచే మేఘములు వారిధారల వర్షించునో,—ఆశక్తిచేతనే యాకసమున భీషణ హాహాకారము సలిపి, త్రీవనిర్ఘాత పరంపరలు వసుమతీ వక్షమునఁ బడి, యామెను వేధించును. ఏ శక్తిచే మంచు కరిగి నదీనదరూపమున వెల్లువలై యుర్విని సస్యాఢ్య నొనరించునో,— యాశక్తి వలననే భీషణజలప్రపాత మహాఘాతము ధారుణీ హృదయమును బ్రద్దలు చేయును.

(నిష్క్రమించును.)

[This passage is somewhat philosophical. Without venturing to drag the reader's mind into the perplexing labyrinth of metaphysics, laconically I may observe that Nurjahan harps now upon the fact that construction and destruction emanate from the same force. I may significantly observe that the evolution of the universe is based on this law.]

## తృతీయదృశ్యము

దక్షిణదేశమందలి రావణీదుర్గము—రాత్రికాలము.
షాజహాను రహిమానులు ఖుస్రు శయ్యామందిరమునఁ
గూర్చుండి ప్రసంగించుచుందురు.

షాజ—రహిమాన్ రాజా! మీరు వచ్చుట మేలే యైనది. ఈ ముహూర్తమందే యుద్ధమునకుఁ బోవలయును. అన్నగారి కడ నెవరిని గాపుంచవలెనా యని యోచించుచుంటిని. వానిని మీ రక్షణ మందుంచి పోఁగలనను తలంపిపుడు నా మదికిఁ దట్టెను.

రహిమాన్—రాజపుత్రా! నిస్సందేహముగ మీ సోదరుని నా కడ నుంచి తాము యుద్ధమునకుఁ బోవచ్చును. ఆతని కేమియు భయము లేదు. నా ప్రాణముల నతని ప్రాణముల కడ్డువైచెదను.

షాజ—నిన్నటి రాత్రి యతఁడున్మత్తుని వలెఁ బరాకుగ మాటలాడ సాగెను! ఆతఁ డొకపుడు రోదన మొనరించుచు, మఱొకపుడు సామాన్రిట్టును, నన్ను నా సతిని దీనముగ నఱచుచు, నింకొకపు డదృష్టము నుద్దేశించి వ్యంగ్య ప్రసంగము సలుపుచు, రేయెల్ల గడపివైచెను!

రహిమాన్—అతఁ డట్లైనఁ బూర్తిగ నున్మత్తుఁడై పోయెనా?

షాజ—ఉన్మత్తుఁడని చెప్పుటకు వీలులేదు. అతఁడప్పుడప్పుడిట్లుండును. ఇచటికి రాకపూర్వముకూడ నిట్టులే యుండువాఁడు. ఇట్టి చిత్తసంక్షోభమున నతఁడు సామాన్య కల్పితకారణమువలనఁ గూడ విశేషంబుగ నులికిపడుచుండును; ఒక్కొక ముహూర్తమందతఁ డాడుదానివలె నేడ్చును. ప్రస్తుత మాతనిని మీ కాపుదల యందుంచి పోవుచుంటిని. జాగ్రత్తగ వాని సౌకర్యంబునకు వలయు యత్నము సలుపుచుండుఁడు.

రహిమాన్—రాకుమారా! మీ రతని కొఱకై రవంతైన విచారపడకుఁడు. నేను మీ పురాతన భృత్యుండ ననియు, నంతతము మీ యాజ్ఞానుసారము వర్తించుచు, నీడవలె మీ వెంట నంటి యుండుననియు మీ రెఱుంగుదురు. ఇపు డీక సందియ మంద నేల?

షాజ—మీ యందలి నమ్మకము వలననే సోదరుని మీ కడ విడుచుచుంటిని.

రహిమాన్—మీ రేమియుఁ జింతింపకుఁడు. యుద్ధము నుండి తిరిగి వచ్చిన పిదప మీ భయము నిర్హేతుకమే యని మీరే తెలిసికొనఁగలరు.

షాజ—మంచి దటులైన నేనిఁకఁ బోయెదను.

(నిష్క్రమించును.)

రహిమాన్—(సేవకునిఁ బిలచి)—"బడేసాహేబూ! దుర్గద్వారమున బంధించి వేయుము. నాభృత్యుండైన కెరామతు నిచటికంపుము.

(స్వగతమున)

ఈ మాత్రపు బుద్ధి నాకు లేకపోలేదు. ఒక్క ౘ్రేటుతో నిటు షాజహానును, అటు నూర్జహానును సంతోషపఱచెదను. నూర్జహాను నోరు తెఱచి చెప్పివైచెను! కాని, ఖుస్రు నిజసోదరుఁ డగుటచే షాజహానట్లు దెలుపక కల్లప్రేమను జూపుచుండెను! కాని వాని గూఢోద్దేశము నీ రహిమాను గ్రహింపఁజాలకపోవునా!—జిహాంగీరంతటి వాని భావమునే గ్రహింపఁజాలిన నేనే యీ కుఱ్ఱవాని భావము గ్రహింపలేక పోవుటయా!—శర్ఖానును జంపి రాజా బిరుదమునందితిని;—ఈ నూఱు ఖుస్రును బరిమార్చి, యొక్క యుదుటన మహారాజానగుదును!—ఊః!—ఎంతవేగముగ లేచుచుంటిని! ఒక్కొక హత్య!—ఒక్కొక మెట్టు! వహావ్వా!! ఇక నామజా చూపింపవలయును వహావ్వా!! అదిగో! చచ్చుటకే వచ్చుట! రానిమ్ము! వహావ్వా!!

(ఖుస్రు ప్రవేశించును)

ఖుస్రు—నీ వెవండవు?

రహి—నేను రహిమాన్ రాజాగారను!

ఖుస్రు—ఇచట నీ కేమి పని?

రహి—షాజహాను మిమ్ము నా రక్షణమం దుంచి, వెడలిపోయెను.

ఖుస్రు—వెడలిపోవు టెచటికి?

రహి—యుద్ధంబునకు!

ఖుస్రు—అటులనా?

రహి—అవును!

ఖుస్రు—నన్నునారక్షక భృత్యునిఁగా నియమించి యతఁడు వెడలి పోయెను కాఁబోలు!

రహి—అవును.

ఖుస్రు—దుర్గద్వారమును బంధించి వైచితివేమి?

రహి—అట్లొనర్పుటకు యువరాజ షాజహాను నాజ్ఞ! మీరీదుర్గమును దాఁటి వెలుపలికి బోరాదు.

ఖుస్రు—ఏమేమి! అట్లైన నేను ఖురమ్ యొక్క ఖైదీనా?

రహి—కారు.

ఖుస్రు—కాకపోవుటేమి?—దుర్గమును వీడి వెలుపలికి ఁ కరుగుటకు నాకు సెలవు లేనపుడు నే నేమను కొనవలయును? ఖైదీనగుట కింక నేమి కావలయును?

రహి—ఏమి కావలయునో నే నెఱుఁగను! కాని,—

ఖుస్రు—నేనిఁక నేమియు వినను. ఖురమునొకనూ ఆజ్ఞ్యోడకంపుము—వలదు! ఆతడు వెడలిపోయి యుండును—రహీమూన్ రాజా! ద్వారమును దెఱువవా?

రహి—కవాటమునా?—ఏమో!

ఖుస్రు—"ఏమో!" యేమి? కవాటముఁ దెఱువవా?

రహి—నా ప్రభువు నాజ్ఞ లేనిదే—

ఖుస్రు—నీ ప్రభువెవరు?

రహి—ఖురమ్!

ఖుస్రు—ఓహో అటులనా!—మంచిది! నీ విఁక వెడలిపొమ్ము!

రహి—చిత్తము. వెలుపల నిలువంబడి నేను మీకుఁ గావలి యుండెదను. తాము నిదురింపుడు—

ఖుస్రు—ఛీ! యూరకుండుము! నాకుఁ గావలియుండుటకు నేఁబిచ్చివాఁడనని గాని, వెర్రికుక్కనని గాని తలఁచితివా?

రహి.—రాకుమారా! ఒక మనవి.

ఖుస్రు—పోపొమ్ము. నా యెదుట నొక శునకము తోఁక నాడించుట చూడఁజాలను. ఛీఛీ!! పొమ్ము! దూరంబుగఁ బొమ్ము!

[రహిమాన్ కోఁపచూడ్కుల నిగుడించుచు నిష్క్రమించును]

ఖుస్రు—ఇట్టి దుర్దశ ప్రాప్తించునని స్వప్నమందైన భావించి యుండలేదు. నాసోదరుని చేతులలోఁ గైదీనైతినా? ఎవ్వనిఁ బ్రాణతుల్యునిగఁ బ్రేమించితినో, యాతఁడేయిట్టి యన్యాయమున కొడిగట్టెనా? ఇంతకంటె చావే మేలు! ఈ విషయమును జనకుని కెఱింగించుట కేమైన సుపాయమున్నదా?—అసంభవము!—వెలుపలనేమి జరుగుచున్నదో! [కవాటమును సమీపించి, దానిని తోసి] ఇదేమి! గదితలుపుకూడ బయట గొళ్లెము వేయఁబడియున్నది. సేవకా! సేవకా! వలదు! ఎందులకు?—ఇఁక వానిని బిలుచు టెందులకు?—నిక్కముగ రహిమాను మా తమ్ముని యాజ్ఞ లేనిదే ద్వారమును బంధించి యుండఁడు!—ఓః!—యేమి దుర్దశ!-యేమి దుర్దశ!! ఓ! హాహాహా హా! [తన చేతులలో తల నుంచుకొని క్రిందఁ గూలఁబడిపోవును.]—రాత్రి గభీరమై యున్నది. ఇఁక నిద్రించెదను. (శయనించును.)—అయ్యో! నిదుర పట్టుటలేదు!—ఖురమూ! నీవెంత క్రూరుఁడవైతివి!-నా సోదరుఁ డట్టి క్రూరుఁడు కాఁగలఁడా?-ఇంత క్రౌర్యమా! నా యెడలనా! తనంత దానే తనవెంట వచ్చినవానిని, ప్రాణంబుకంటె తమ్ముని నధికంబుగఁ బ్రేమించినవానిని, తమ్మునికొఱకై యగ్నికుండమున దుముకుటకైన వెనుదీయనివానిని-అయ్యో! ఆహా! యిట్లు-యిట్లుబంధించుటా! హో! హాఁ! హాఁ!! హాఁ!!!—ఏమిక్రూరము! ఏమి ఘోరము! ఏమి దుర్న్యాయము!! ఏమి దౌష్ట్యము!!! ఏమి

దౌరాత్మ్యము!!!!—హాహో హాహో హాహో!—అరచేతులతో నేత్రము
ల మూసుకొని రోదన మొనరించును.

వెనుకనుండి యిరువురు ఘాతకులతో రహిమానుఖాన్ ప్రవేశించి
యా ఘాతకులకు సన్నజేయువారు ఖుస్రూను వెనుకకుఁ బడవైచి
ఖడ్గాఘాతము నైతురు! ఖుస్రు యాకస్మికముగఁ వెనుకకు బడిపో
వును. కత్తితో రొమ్మునఁ బొడుతురు.

ఖుస్రు—(నెత్తురు వరదలై ప్రవహించుచుండ నేలపైఁబడి కనులు
మూసికొని) తమ్ముఁడా? ఇందులకా నన్ను బంధించినది? ఇపుడు
గ్రహించితిని! గ్రహించితిని!—హో॥!

రహి—(ఘాతకుల నుద్దేశించి)!—పని ముగిసెను!! మీరు పొండు!!!

[ఘాతకులు నిష్క్రమింతురు.]

ఖుస్రు—(రహిమాను నుద్దేశించి) నీ పనికూడ ముగిసెను!—నీవు
కూడబొమ్ము!!

[రహిమాను నిష్క్రమించును.]

ఖుస్రు—సోదరా! ఖురమ్! నీవు సార్వభౌముఁడవు కాఁగోరితివా?
నన్ను చంపించితివా? నేను బ్రతికియున్నను నీ పని కడ్డు రానని
యోచించ నైతివి గదా! తమ్ముఁడా! తమ్ముఁడా!! నీ క్రూర
కార్యము నా హృదయమును బాధించునట్లు నా యీ గాయము
గూడ నన్నంతగా బాధించుట లేదు. మృత్యువేదన కంటె సోద
రుని నిర్మమత నన్నధికముగ దుఃఖపెట్టుచున్నది. కత్తివ్రేటున నేను
జచ్చిపోవుట లేదు!—సోదరుని దౌరాత్మ్యపు దెబ్బచేఁ జచ్చి
పోవుచున్నాను!—తమ్ముఁడా! తమ్ముడా!! హోహోహాహోహాహోహాహో!
తండ్రీ తండ్రీ! తల్లీ! తల్లీ!—

[ప్రాణముల విడచును.]

## చతుర్థదృశ్యము

నూర్జహాను, అసఫులు నిలిచి మాట్లాడుచుందురు.

కనులెఱ్ఱజేసి జిహాంగీరు చూచుచుండును.

అసఫ్—ప్రభూ! షాజహానిట్టి ఘోరకృత్య మొనర్చించి యుండడు. నేనతనిని బాగుగ నెఱుంగుదును. అతఁడు భ్రాతృహత్య గావింపఁ జాలఁడు—అసంభవము!

జిహాం—ఈ హత్య షాజహానే గావించెననుట కేమియు సందియము లేదు. అతఁడు సమ్మతింపకున్న రహిమాను నా పుత్రునిఁ దెగ టార్పఁగలఁడా?

అసఫ్—స్వామీ! దక్షిణసీమకు రమ్మని షాజహాను రహిమాను నాహ్వానించి యుండలేదు.

నూర్జ—అసఫూ! నీ యల్లుని నీవు రక్షించుకొన యత్నించుట వింత కాదు. షాజహాను నీ జామాత— చక్రవర్తి పుత్రుఁడు!—కాని రాజధర్మము ముందు. జ్ఞాతిత్వబాంధవ్యములు తల యెత్తఁజాలవు.

జిహాం—నిక్కము నిక్కము! నే నెన్నఁడు న్యాయమును విచారించె దను.

అసఫ్—ప్రభూ—

జిహాం—ఇఁక నే నేమియు వినను. నేనీ ముహూర్తమందే షాజహాను నకు వ్రాయుచుంటిని. అతఁ డేమి చెప్పునో చూచెదను. అంతు కనుగొని గాని విడిచిపెట్టను. తనయుఁడైనను దగినశిక్ష ననుభవించి తీరును. తనయా! ఖుస్రూ! నీ వెట్టి యభాగ్యుండవు!— అసఫూ! ఐదువందల మంది గుఱ్ఱపు రౌతుల నీ రాత్రియే బంపుము! నేనీ ముహూర్తమందే కమ్మ వ్రాయుచుంటివి.

అసఫ్—మిహిరా! ఇదంతయు నీ యుపదేశమే యై యుండును.

నూర్జ—అసఫూ! నీవు నా సోదరుండవయ్యు, రాజ్యతంత్రాలోచన యందు నేను సామ్రాజ్ఞి ననియు, నీవు మంత్రివనియు జ్ఞప్తియం దుంచుకొనుము. జనకుని మరణానంతరమున నేనే నీకు మంత్రి పదవి నొసంగితిని.

అసఫ్—మంత్రి పదవియా! అది నీ స్వేచ్ఛాచారము యొక్క యావరణము మాత్రమే! దుర్ముహూర్తమున సామ్రాజ్ఞివి కమ్మని నిన్ను వేఁడితిని.

నూర్జ—ఎందులకు వేఁడితివి? "జాగ్రత్త" యని యానాఁడు నేను నీకుఁ జెప్పి యుండలేదా? నీ వెందులకు వింటివి కావు? ప్రతిరోధక మేల తొలంగించితివి? లోలోన నణఁచి యుండిన యీ జలప్రవాహమును నీకు సాధ్యమైనచో నడఁచి వేయుము! అట్లొనర్చుట నాకు సాధ్యము కాదు—పొమ్ము!

[అసఫ్ నిష్క్రమించును.]

నూర్జ—అగ్ని రగుల్కొలిపితిని! అది యింక బ్రజ్వలించును. ఇప్పటికి ఖుస్రు యొక్కఁ డంత మొందెను. రెండవవాఁడు, షాజహానందులకు సిద్ధముగ నున్నాఁడు! మూఁడవవాఁడు పరభేజ్—వాని వినాశమింకను ప్రారంభము కాలేదు!—తదుపరి—సామ్రాజ్యము! నూర్జహాను!! లయిలా!!!—నాశ మెంతలో?—రీవా! నీవు తారవే కావచ్చును!—కాని చంద్రికాంతి ముందు నీవు వెల్లనైపోకుందువా!, నన్ను నేను విక్రయించుకొనినపుడు తగిన వెలను రాఁబట్టు కొనకుండ విడచి పెట్టుదునా? ఇందులకై నేను సర్వశూన్యనైతిని.—ఇందులకై నేను పుణ్యోజ్జ్వలమైన ధర్మరాజ్యము నుండి దిగిపోయితిని. ఇఁక నెట్టి ప్రతిఘటనమును లక్ష్యపెట్టను! ఎట్టి ప్రతిబంధకమును పాటింపను!

(రీవా ప్రవేశించును)

రీవా—సామ్రాజ్ఞీ!

నూర్జ—ఎవరు!—వాహో! రేవా రాణిగారా! (సభయముగ)—యిదేమి!—యిట్లుంటిరేల!

రేవా—నూర్జహానూ! నీవు నా పుత్రుని హత్యఁ గావించితివా?

నూర్జ—నేనా?

రేవా—నూర్జహానూ! నీతో నేను వివాద మొనరింపరాలేదు. నీకడ మొఱపెట్టుకొనుటకై నవచ్చి యుండలేదు. అట్లొనరించినను, లాభము లేదు.—నాపుత్రుఁడు నాకు మరల లభింపఁడు. ఊరక ప్రశ్నించుటకు మాత్ర మరుదెంచితిని. నాయనుంగు పుత్రుని నీవు నీపొట్టంబెట్టుకొంటివా లేదా!

నూర్జ—నే నట్లొనరించితినని మీతో నెవరు చెప్పినారు?

రేవా—నాయంతరాత్మ!—కాని నే నిఁక నిశ్చింతనైయుండెదను. నీకు సామ్రాట్టువలని భయమేమియు లేదు. ఈవిషయమం దొక మాటనైన రాజు కడఁబలుకనని ప్రతిజ్ఞజేసి చెప్పుచున్నాను. నాతనూభవుని నీవు బరిమార్చితివా లేదా?

నూర్జ—పరిమార్చియే యున్న—

రేవా—(నూర్జహానుపై స్థిర దృక్కులఁబఱపి),— "నూర్జహానూ! మహాపాతకము సలిపితివి! అదెట్టి ఘోరపాపమొ నీవెఱుంగవు. సామ్రాజ్ఞీ! పుత్రుఁడన నెట్టివాఁడో నీవెఱుంగవు!—(కంపితస్వరమున) ఇఁకఁ బుత్రుని గోల్పోయిన యభాగ్యురాలి హృదయతాపము నీవెట్లెఱుంగఁగలవు?

నూర్జ—బేగమ్ సాహెబగారైన,—

రేవా—ఇఁక నీవేమియుఁ దెలుప నక్కఱలేదు! వాదమువలన ప్రయోజనము లేదు! మారు మాటాడవలదు. పశ్చాత్తాపమునొందుము!—నేను నాప్రియుని, నాసామ్రాజ్యమును, నాసర్వస్వమును నీకు ధారవోసితిని; పుత్రు నొకని మాత్రముంచుకొంటిని!

వానిని గూడ నీవుఁడఁబెఱకుకొంటివి! ఇపుడు నాకిఁక నెవరును లేరు!—యెవరును లేరు!! హాః! [పైటతో ముఖమును గప్పుకొనును]

[లయులా వేగముగఁ బ్రవేశించును]

లయులా—జననీ!

నూర్జ—ఏమి?

లయులా—నిక్కువమేనా?

నూర్జ—ఏమి?

లయులా—నీ వీయము యనుంగు బుత్రునిజంపించిన మాట.

నూర్జ—అవునది నిక్కువమే!

లయులా—(కన్నులు పెద్దవిజేసి)—నూర్జహానూ! ఇట్టి ఘోరకృత్యము సల్పుటకు నీకెట్లు బుద్ధి పుట్టినది? రీవాసామ్రాజ్ఞి యేకాత్మజుని నీవు రక్కసివలె నీపొట్టనఁబెట్టుకొంటివి! భిక్షుకునకు బిచ్చమిచ్చినట్లు ఆసేతుహిమాచల పర్యంత మహీ రాజ్యమునంతయు, నేసాధ్వీమణి నీకు దానమొసఁగివైచెనో, యామె యేకమాత్ర పుత్రుని—ఆహాహా! జననీ! నీవేమి జేసితివి?—ఏమిచేసితివి!!—

నూర్జ—ఏమి చేసితినా?—ప్రతిహింసఁ గావించితిని!

లయులా—ప్రతిహింసయా?—ఇది ప్రతిహింసయా! ఈయభాగ్యురాలి యేకపుత్రుని హత్యఁ గావించుట ప్రతిహింసయా!—ఈమె నొకమాఱు చూడుము!—గతదివస మందెట్లుండెనో యిపుడెట్లుండెనో తిలకింపుము? సుందరీతిలకమైన యీకాంతామణి నేఁడెట్లుశల్యావశిష్టయై పోయెనో చూడుము! నెరసిపోయిన యీయామె కేశములను విలోకింపుము! ఫాలభాగమందలి గంభీరరేఖను గాంచుము! కనుదోయిక్రిందఁ గానఁబడు గాఢకాలిమంబును తిలకింపుము! జననీ!—పిశాచీ! ఏమికావించితి వేమికావించితివి!

[లయులాస్వరము కంపించిపోవును]

నూర్జ—లయిలా! నీవేకదా నన్ను బిశాచివి కమ్మని చెప్పితివి.

లయిలా—అవునట్లంటిని! కాని, అవుడునేను క్రోధఘూర్ణమాన మానసనై యాత్మసామ్రాజ్యమును గోల్పోయి యుంటిని! ఆదుర్బల దశయందు నీవునన్ను శర్యారునకుఁ గట్టఁబెట్టితివి! కానితుదకు యెందులకు! నేనట్లు భావింపనైనభావింపకు! (రీవా నుద్దేశించి)—మాతా! అభాగినీ! ఇదినాకార్యముకాదు! నేనిట్టిపనినిదలంపనైనఁ దలంపలేనని యీశ్వరుఁ డెఱుఁగును! (నూర్జహాను నుద్దేశించి)—జననీ! ఎట్లుండి యెట్లైతివి?

నూర్జ—లయిలా!

లయిలా—జననీ! ఇఁకేమియుఁ జెప్పకుము. నీతో సంధి జేసికొంటిరని. గాని యిప్పుడింక నీతోడిపొత్తును విచ్ఛిన్నమొనర్పక యుండఁజాలను. నేఁడాదిగ మనము వేరు బడిపోవుదము!—నీ వాక్కుతవే యెల్లరను వినాశమొందింపఁ గలవు. ఇరువురము కలసినచో నికఁ బ్రళయము సంభవించుట తథ్యము!

-నిష్క్రమించును-

నూర్జ—"సామ్రాజ్ఞీ"—(ఇట్లనియామె యాకస్మికముగ నాదలవంచుకొనును)

రీవా—నూర్జహానూ! గ్రహించితిని! అనుతాప మారంభమైనది. ఇపుడు పశ్చాత్తాప మొందుచుంటివి—సామ్రాజ్ఞీ! సర్వేశ్వరుఁడు నిన్ను మన్నించుగాక! నీరక్షణార్థమై నేనెవుడునుభగవానుని బ్రార్థించుచుందును.—నీకది తెలియకపోవచ్చును. పోనిమ్ము!- తెలియకున్ననేమి? ఇఁకనామాటయేమి? —ఓః!—నా హృదయము బ్రద్దలై పోవుచున్నది! దారుణము! దారుణము!! ఇఁక సహింపఁజాలను! ఆయ్యో! నాతల తిరిగిపోవుచున్నది! అయ్యో! దిగ్భ్రాంతిలోఁ బడిపోవుచున్నాను! ఓ యీశ్వరా! నన్నిట్లు జేసితివేమి

తల్లివలె సుఖపడువారీ జగతినెవ్వరును లేరనితలఁచుకొనుదానను. వారి ఇప్పుడు తల్లికిగల్గు దుఃఖమువంటి దుఃఖ మీజగతిని లేదని తెలిపితిని.—దుఃఖిణీ!—అయ్యో! ఏమి యీరాజ్యాల!—ఏమి యీ యార్తి!—ఈదుఃఖమున కంతము లేదా?—జగదీశా! ఈ దుఃఖ మునకుఁ జివర నీవే యుంటివి.

ఇట్లని యామెనిష్క్రమించును.

నూర్జహాను—(కొంచెమూరకుండి మెల్లగ)—"నూర్జహానూ! ఈ హిందూరమణి యెదుట మోము వంచుకొని యుంటివేల?—శైల శిఖరమునుండి యొకేదుముకున వసుంధరపైఁ గూలిపోతివేమి? నీర వమైనని స్తబ్ధవై, తలవంచుకొని చేయిజాపి తుమాభిక్ష నడుగు కొంటివేల? నూర్జహానూ! నీవెనుకటి దర్పమంతయు నేమైపోయి నది! యుద్ధయాత్రయందురణవాద్యమునననుసరించితక్షు చుదాటుచు ముందునడచు నీవాకస్మికముగ స్తంభితవైనిలువంబడి పోతివేల? నీకేమిచేటు వాటిల్లెను?—ఇవుడేమి సేతువు? ఇంకను ముందునకు సాగిపోదువా! లేక యింతటితో నిఁక వెనుకకు మరలుదువా?— యోచింపుము!

పంచమదృశ్యము.

దక్షిణదేశమున జయంతీ దుర్గము—ప్రభాతకాలము

సేనానాయకుఁడైన యమీరాలితో షాజహాను నిలువఁబడి మాట్లాడుచుండును.

షాజ—అమీరాలీ! రహీమానురాజా లాహోరుపోయెనా?

అమీర్—చిత్తము జనాబ్.

షాజ—ఈహత్య నిక్కువముగ నూర్జహాను సామ్రాజ్ఞి యాజ్ఞవలన జరిగెనుసుమీ!

అమీర్—ఏమి! ఆమెయాజ్ఞవలన నందురా?

షాజ—అవును! ఇపుడు సర్వము తెలిసినది! ఆమె మమ్ముందఱ నొక్కొక్కరినిగా మ్రింగివేయఁజూచుచున్నది. దౌర్భాగ్యుఁడైన ఖుస్రు యామెకుఁ బ్రథమ కబళమైనాఁడు—ద్వితీయ కబళమును నేనగుదును.

అమీర్—ఏమి! మీరు కూడ?

షాజహాన్—నిశ్చయముగను! లేకున్న ఖుస్రుహత్యాపరాధమునాపైఁ ద్రోసి యందులకేమి సమాధానము చెప్పెదవని యామె నాకు లేఖవ్రాయునా?

అమీర్—వ్రాసినది జహాంగీరు ప్రభువు కాడా?

షాజ—జహాంగీరు ప్రభు వనుట నిక్కము కాదు! ప్రస్తుతము ఢిల్లీ సామ్రాట్టు నూర్జహాను కాని జహాంగీరు కాడు! పేరికి మాత్రమే యతఁడు సార్వభౌముఁడు. రాజును వట్టి పనికి మాలినవానిని గావించిన యామె యానతి నేను పాలింపను. ఎన్ని జాబులను వ్రాసినను, ఈషాజహా నామెకు సమాధానమియ్యఁడు.

అమీర్—కాని—

షాజ—ఇఁక "కాని" యెందులకు? ఆమె యత్యాచారమువలన విద్రోహము సలుపవలసివచ్చినను సలిపెదను!

అమీర్—షాహజాదా! (ప్రభూ!)—అనుమతి యొసఁగిన యొక మనవి యున్నది.

షాజ—మనవి చేయనక్కరలేదు. అమీరాలీ! నేనామె ప్రభుత్వమును స్వీకరింపను. ఎట్టి సమాధానము నొసఁగను. సామ్రాజ్యమును జనకుఁ డొక యాఁడుదాని చేతులలో విడిచి పెట్టినపుడు భారతసామ్రాట్టు షాజహానే కాని, ఆయాఁడుది కాదు! నన్ను సమాధాన మడుగుట కాకాంతయెవతె? అమీరాలీ! నేనిపుడే

పత్రమును వ్రాసియిచ్చుచుంటిని. నీ వాకమ్మను జక్రవర్తి కడకుం గొంపోవుటకు సిద్ధముగ నుండుము. నీవు పోయి ప్రయాణ సన్నాహ మొనర్చుకొనుము.

(అమీరాలీ నిష్క్రమించును.)

షాజహాను—తాను హత్యఁగావించి, భ్రాతృహత్యా మహాపాతకమును నాతలపైన మోపవలెనని యాకల్లలాడి క్రౌర్యమెట్టిది! నిముసములో నీయపనిందను నాపైఁ బడవైచి యామె నన్నుఁ గూడ హత మొనర్ప దలఁచుచున్నది! ఏమి యామె సాహసము! ఆహా! జనకుఁ డాదురాత్మురాలివలలోఁ బడిపోయెను? అతని కిఁక రక్షణమేమి?—(క్షణమూరకుండి దలపంకించి)—మంచిది! నేనే నాతండ్రి నారక్కసివాఁతనుండి తప్పించెదను!

(ఖాదిజా ప్రవేశించును.)

షాజ—సతీ! నేను విద్రోహము సలుపుచుంటిని!—ఇపుడు భారతాధీశ్వరుఁడు షాజహాను సుమీ!

ఖాదిజా—నాథా! ఏమనుచుంటిరి?—విద్రోహము—సలుపుదు ననుచుంటిరా!

షాజ—అవును! ఈమాఱు నేను సామ్రాట్టుతో—యుద్ధము సల్పెదను!

ఖాదిజా—సామ్రాజ్యార్థమై జనకునితో రణమొనర్చు టుచితమా?

షాజ—రణమొనర్చుట జనకునితో కాదు—నూర్జహానుతో! కొంచెము సేపిచట నుండుము! పత్రము లిఖించి వచ్చెదను—నూర్జహానూ! ఏమి నీ స్పర్ధ! ఏమి నీ సాహసము!! ఏమి నీ క్రౌర్యము!!!

(నిష్క్రమించును.)

ఖాదిజా—సామ్రాజ్యమా! దానికొఱకై యింతవ్యామోహమా! ప్రత్యేకముగ మానవునియంతరమున నొక యతులనంపత్తి నిరాదరభావ

మునఁబడిపోయియుండ బాహ్యసంపత్తికొఱకై మానవుఁడింత పేరాస వహించుచున్నాఁడేల? అంతరమందొక సుఖసముద్రము పొంగిపోవుచుండ బాహ్య సుఖార్థమై నరుఁ డింత యత్నము సలుపుచున్నాడు టెందులకు?—ప్రేమవలన సౌఖ్యము గలుగుచున్నపుడు ఆనందలతా ప్రసూనమగు సౌఖ్యము సులభముగఁ జేతి కందుచున్నపుడు మానవుఁ డెయ్యెడనో సౌఖ్యధామమును గనఁగొందునను నాశతో విశేషాన్వేషణము సలుపుచుండు నేల!— [నిష్క్రమించును]

## షష్ఠదృశ్యము

ప్రాసాదాంతఃపురము—సంధ్యాకాలము.

లయలా పాడుచుండును

గీతమాల

ఓమ్మనందును నాటగ నమ్మరొకటి,
అంధకారము కప్పగనయ్యొ! యెదను,
గరళస్రోతము నిండగఁ గాయమంత,
నెగులు కతనఁగరంబు నే బొగులుచుండి,
కిరణమయమైన సుందర ధరణియందు,
ఛాయచాడ్పునఁ గ్రుమ్మఱు చాననగుచు,
ఆర్తివారాశి వీచికలందు నాదు,
ప్రాణితరణిని నడపుచు బ్రదికియుంటి.

శర్యార్—(ప్రవేశించి)—లయలా! యుద్ధవార్త వింటివా?

లయలా—(నిశ్చలభావమున)—ఏ యుద్ధవార్త?

శర్యార్—షాజహాను విద్రోహ విషయమే యెఱుంగవా?

లయలా—ఎఱుంగను.

శర్యార్—షాజహాను ఢిల్లీపురమును ముట్టడించి, సేనాధిపతియగు

మహాబత్ఖానుచేఁ బరాజితుఁడై దక్షిణసీమకుఁ బారిపోయినాఁడు.

లయలా—(నిట్టూర్పు నిగుడించి)—షాజహానూ! నిర్భాగ్యుఁడా! నీవుకూడ నీ నుడిలోపలఁ బడిపోయితివా! నీ యగ్రజునివలె నీవు కూడ నా రక్కసి కెరయైతివా? నీ యనంతరము పరభేజుశర్వ్యా రుల మాంస మ్మా పిశాచి కాహారమగునా!

శర్వ్యార్—నీ మాటలు నా కర్థమగుట లేదు.

లయలా—కాదు! వారలు నా ప్రియుని జంపరు. అతఁ డర్భకుఁడు! వానిని దెగటార్చినవారల కేమి లాభము? వారు దమూల్యమే వారలకు వాని వెలకంటె నెక్కుడై యుండును!

శర్వ్యార్—నన్నెవరైనఁ జంపివైతురా యేమి?—అట్టి యుద్దేశ్య మెవరి కున్నది?

లయలా—ఎవరికైనఁ గలుగునేమో యని భయపడితిని.

శర్వ్యార్—ఎవరికిఁ గలుగును? కలుగదు! నాకు చావనిన నిష్టము లేదు. నేనీ పృథివి నెక్కుడుగఁ బ్రేమింతును. ఇట్టి యాకాశము, ఇట్టి వాయువు, ఇట్టిసూర్యకాంతి, ఇట్టిచంద్రకాంతి, ఇట్టిపుష్పసౌర భము, ఇట్టి విహంగ సంగీతము, ఇట్టి శైవలినీ కలరవము, ఇట్టి పర్వతరాగౌన్నత్యము విడచిపోవుట నేనొప్పను. అసంభవమసంభ వము! ఒరుల కేమియు ననిష్ట మొనరింపక, ప్రకృతి దృశ్యముల విలోకించుచు సుఖపడుచున్న నన్ను వార లెందులకు, మృత్యువు పాలొనరింతురు?

లయలా—(గభీరానుకంపాపురస్సరముగ) అభాగ్యవల్లభా! భయపడ కుఁడు. వారు మిమ్ముఁ దెగటార్పఁ దలంపరు. మిమ్ముఁ జంపిన వారలకేమియు మేలొదవఁ జాలదు.

శర్వ్యార్—ఒక వేళ వారు నన్నుఁ బరిమార్పఁగడంగిన, నీవు నన్ను రక్షించెదవా?

లయులా—నా ప్రాణములను మీ ప్రాణంబుల కడ్డు వైచెదను! మీ రేమియు భయపడకుండు.

(పరిచారిక ప్రవేశించును)

లయులా—మధురికా! ఏల వచ్చితివి?

మధురిక—సామ్రాట్టెక్కడ?

లయులా—ఎందులకు?

మధురిక—సామ్రాజ్ఞి మృతిఁజెందినది. ఆ వార్త ప్రభువున కెఱింగింప వలయును.

లయులా—ఏమా సామ్రాజ్ఞి మృతిఁజెందెనా?

మధురిక—అమ్మా! అవును.

లయులా—కొడుకుచావు విని దురంతదుఃఖ మనుభవించుచున్న యా సతీమణి కెట్టి యకాలమరణము సంభవించునని నేను భయపడు చునే యుంటిని. పతివ్రతా! పరలోకంబున కరిగివా!—మధురికా! చక్రవర్తి యిచటికి రాలేదు.

[అతి త్వరితముగఁ బరిచారిక నిష్క్రమించును]

లయులా—ఆహా! పృథివినుండి యొక మహిమ వెడలిపోయినది!— ఒక తేజస్సు నాశమందినది! ఒక సంగీతము ముగిసిపోయినది! ఒక ప్రార్థనము తుదముట్టినది.

[లయులా మెల్లగ వెలుపలకు నిష్క్రమించును.]

శర్యార్—వారలునన్నుఁ బరిమార్పరు—నన్నుఁ బరిమార్చుటెందు లకు?

(పరభేజు ప్రవేశించును)

పరభేజు—సోదరా!

శర్యార్—అన్నా! రమ్ము. యుద్ధమునుండి యెపుడు వచ్చితివి?

పరభేజు—నేఁడే!

శర్యార్—యుద్ధవార్తలేమి? షాజహానెచట?

పరభేజ—బహారంపూరు యుద్ధమందతఁడు పరాజితుఁడై మీవారు పోయినాఁడు.

శర్యార్—మీవారు పోవు టెందులకు?

పరభేజ—మీవారు రాణాను వేఁడి యాశ్రయము బడయుటకై యని నాతలంపు. అతఁడు జనకుని కఠోరవిచారణ నెఱుఁగును. అంతియే కాక, భ్రాతృహత్యాపరాధ మతనిపై మోపఁబడినది. అందుచేఁ దండ్రికడ నిఁక నుండుట కంటె, రాణా నాశ్రయించి యుండుటయే శ్రేయమని యతఁ డూహించికొన్నాఁడు.

శర్యార్—సోదరా! భ్రాతృహత్యాదోషము నిష్కారణముగ నతనిపై మోపఁబడినది. మన షాజహాను నిర్దోషి—అతఁడు వట్టి యపనిందపాలై పోయినాఁడు.

పరభేజ—అట్లయిన మన యగ్రజుని జంపినవారెవరు?

శర్యార్—నలుకెలంకులఁజూచి, నిమ్నస్వరమున చంపినవాఁడు రహీమాను. చంపించినది నూర్జహాను!

పరభేజ—ఏమేమి! అది నీ కిట్లు తెలిసినది?

శర్యార్—ఒకనాఁడు నా పత్ని భయము గొలుపు కనులతో వెఱ్ఱిదానివలె వాయువేగమున నా కడ కురుదెంచి "ఎపుడును జక్రవర్తిత్వముఁ గోరనని వచింపు" డని గంభీరస్వరమునఁ బలికెను. అపుడు నేను జబ్బుగా నుంటచేఁ బరికెపై నూరక పడియుంటిని. నా భార్య నా చేతులను గట్టిగాఁ బట్టుకొని "శపథ మొనరింపుఁడు! శపథ మొనరింపుఁడు! శపథ మొనరింపుఁ" డని యఱచెను. ఆమె స్వరము క్రమక్రమముగ హెచ్చి కడకొక హాహాకారమువలె నాకు వినవచ్చెను! గడగడ వడకుచున్న నా భార్య శరీరమును జూచి నేను మిగుల వెఱగంది "ఎన్నఁడును సార్వభౌమపదవిని గోరను"

అని ప్రతిజ్ఞ యొనరించితిని. అనంతర మామె నా యొమ్మునవ్రాలి వెక్కి వెక్కి యేడ్వఁ గొడఁగెను. కొంత సేపైనపిదప కొంచె మూఅట గల్గి యామె యీ హాత్యాచరితంబంతయు సాంతముగ నాకుఁ దెలిపెను!

పరభేజు—అది యామె కెట్లు తెలిసినది?

శర్యార్—ఆమె తల్లియే జెప్పెనఁట!

పరభేజు—ఎవరికి?

శర్యార్—మొదట రీవాసామ్రాజ్ఞికిని, పిదప నా భార్యకును!

పరభేజు—ఇట్టి దౌరాత్మ్యమా?

శర్యార్—తమ్ముఁడా! సామ్రాజ్ఞి నన్నుఁ గూడఁ దనభీషణ ప్రళయములోని కీడ్చి వైచునేమో యని వెఱగొందుచుంటిని.

పరభేజ్—ఆమె యట్లొనర్చుట కీవేమి యపరాధ మొనరించితివి?— నీవేమియు భయపడకుము. ఇఁక పోయి శయనింపుము. మేల్కాంచి యుండిన మరల జబ్బు చేయును.

[నిష్క్రమించును]

శర్యార్—అయ్యో! నాతల తిరిగి పోవుచున్నది!—

[నిష్క్రమించును]

## సప్తమదృశ్యము

### ఉదయపురము—ప్రభాతకాలము

సామంతరాజులతో కర్ణసింహుఁడు నిలువఁబడి యుండును— ఆతని యెదుట షాజహాను నిలిచి యుండును.

షాజహాన్—రాణా! దక్షిణసీమనుండి మగుడి యరుదెంచి ఢిల్లీ పట్టణమును ముట్టడించితిని. కాని వీరాగ్రేసరుఁడగు మహాబత్ఖానుచేఁ బరాజితుఁడనై మరల దక్షిణదేశమునకుఁ బారిపోయితిని. అచట

నర్మదాకదనమందు మరల మహాబత్ఖానుచే నోటువడి, వంగ భూమికి పారిపోయి యాదేశమును స్వాధీనముఁ గావించుకొంటిని.

కర్ణ—పారిపోవుచు వంగదేశము లోఁబఱచుకొంటిరా?

షాజ—అవును! వంగభూమి నుండి దురదృష్టవశమునఁ వెడల గొట్టఁబడి మాణిక్పూరుపోతిని. అచటఁ గూడ నాకు పరాజయము తటస్థించుటచే మరల దక్షిణదేశమున కరిగితిని. మహాబత్ఖాను మరల నన్నాసీమనుండి తఱిమివైచెను. దానంజేసి నేను మరల వంగదేశమునకుఁ బోయి, రోటస్దుర్గములో నాభార్యను దిగవిడిచి సైన్యముతో బహారంపూరును ముట్టడించితిని. అచటఁ గూడ మహాబత్ఖానుచేఁ బరాజితుఁడనైతిని.

కర్ణ—షాహజాదా! (ప్రభూ!) మీశక్తి యత్యంతాశ్చర్యకరమైనది!

షాజ—అట్లనుటకు మాఱు 'మహాబత్ఖాను యుద్ధకౌశల మత్యంతాశ్చర్యకరమైన' దనుఁడు.

కర్ణ—అట్టి మహాబత్ఖానుతోఁ దామింతకాలము సంగరము సలుపుటే యాశ్చర్యకరము!

షాజ—అంతకాలము సమరము సలుపుటకుఁ గారణము సమ్ముఖరణమున నాకు శక్తి లేక పోవుటయే! నర్మదా యుద్ధమందోడిపోయిన పిదప నేను చాటు మాటుగ నుండి రణమొనర్ప నారంభించితిని. అందుఁ గూడ బరాజితుఁడనై మరల నెదుటఁబడి యుద్ధమొనర్ప దొరఁకొంటిని! కాని తుదిమాఱు నాసైనికు లందఱు మరణించుటచే నిస్సహాయుఁడనై యిపుడు మీవారు రాణా కడ నాశ్రయ భిక్షుకుడుగు కొనవచ్చితిని.

కర్ణ—ఉదారచరితులగు షాజహాను ప్రభువులకు మీవారు దేశము తన శేషరక్తబిందువును కూడ నోడ్చి, రక్షణమొసఁగును— సామంతులారా! మీయభిప్రాయమేమి?

సామంతులు—రాణా యభిప్రాయమే మాయభిప్రాయము.

కర్ణ—దేశార్థము ప్రాణముల నర్పించుట మహాత్కార్యమే; కాని ధర్మార్థమనువుల వీడుట కంటె మహత్తరమైన కార్య మింకొక్క టేమియు లేదు—ఆశ్రితుల రక్షించుటకుఁ దన ప్రాణములనైన విడువ సిద్ధముగా నుండుటయే క్షత్రధర్మము!—సామంతులారా! యేమందురు?

సామంతులు—అవశ్య మవశ్యము!

కర్ణ—షాజహాను ప్రభూ! తాము నిర్విచారముగ నుండుఁడు. తన సర్వస్వమును గోల్పోయినదైన మీవారు మీకు రక్షణ మొసఁగ గలదు. మీవారు నేఁడు పూర్వపు మీవారు కాదు!—నేఁడామె సర్వశూన్యయై హతవీర్యయై యున్నది! కాలము మారి నేఁడు మా దేశమాత దుర్భరదుఃఖముతోఁ గృశించియున్నది! కాని, దుర్దినములందుఁ గూడ మీవారు మీవారే! మీవారు నందొక్క రజపూతకీటకమైన లేకుండఁబోవునంత దనుక తాము నిరాపదులై యుందురని విశ్వసింపుఁడు.

షాజ—సామ్రాజ్ఞి సైన్యము మీవారు నాక్రమించిన నేమి సేయుదురు?

కర్ణ—ప్రభూ! శరణాగతరక్షణ దక్షులైన రజపుత్రులు మిమ్ముఁ గాఁపాడఁ దమ రక్తమును ధారపోయుదురు. ఆర్తజనరక్షణపరాయణుండై, క్షత్రధర్మైకసారముగ గయునిఁ గావ కృష్ణభగవానునితోఁ భీమసంగ్రామంబు సలిపిన యర్జునుఁడు మావాఁడే. సామ్రాజ్ఞి సైన్యములు దమ్ముఁ బ్రతిఘటించు ననుభయమున క్షత్రియులాశ్రితునిఁ బరిత్యజింతురా? సామ్రాజ్ఞి సైన్యమువచ్చినను, సామ్రాట్టు సైన్యము వచ్చినను రాజస్థానవాసులు వెఱపొందువారు కారు! మిమ్ముఁ గావ మీవారు వాసులు తమ ప్రాణములఁ

గోల్పోవవలసివచ్చినను, వెనుదీయరు. దానంజేసి తాము నిశ్చల చిత్తులై యుందురు—భీమసింహా! షాజహాను ప్రభు రక్షణార్థమై సామ్రాట్టు సైన్యముల నెదుర్కొననే సమరసన్నద్ధులు కండని మీవారు యోధుల కానతి నొసంగుము. అప్రమత్తుండవై రణార్థము సైన్యవ్యూహముల నాయిత మొనరింపుము!

## అష్టమ దృశ్యము

నూర్జహాను—దర్బారు మందిరము—ప్రభాతకాలము

నూర్జ—ఏమి! విశ్వాసఘాతుకత! యుద్ధమునఁ బరాజితుఁడై మొగలులకుఁ గప్పముఁ గట్టుచున్న కర్ణసింహుఁడు విద్రోహియైన షాజహాను పక్షము నవలంబించి మాతో నిపుడు సమరము సలుప సాహసించెనా! పాపమతిఁడు మీవారు పతనము పూర్తికాలేదని తలఁచుచున్నాఁడు కాఁబోలు!

మహబత్ఖాను—ఆశ్రితునిఁ బరిత్యజించుట క్షత్రియ ధర్మముకాదని యతఁడు వాక్రుచ్చెను.

జహాంగీరు—మహబత్ఖానూ! నీశౌర్యసాహసములు శ్లాఘాపాత్రములు. కాళీకదనమందు రాణాసైనికులతోఁ బోరి, షాజహానును బరాజితుఁగావించి, విజయుండవై మొగలు సింహాసనమును గాఁపాడితివి! అంతియ కాక నాపుత్రుని మరల నాకొసఁగితివి!

మహబత్ఖాను—శిరంబొకించుకవంచి వినయమును జూపును.

నూర్జహాను—సేనాధిపతీ! వీర్యవంతుఁడవగు నీకు మేము ధన్యవాదము చేయుచుంటిమి.

మహబత్ఖాను—(మరల తలవంచి ధన్యవాదమునందుకొనును.)

జహాం—మహబత్ఖానూ! నీవుపోయి, సమ్మానపూర్వకముగ షాజహాను నిటకుఁ గొనిరమ్ము. మంత్రి, యుమ్రావు, సైన్యాధ్యక్ష

సామంతుల యెదుట మేమువాని కభ్యర్థన మొనఁగ దలఁచు చున్నాము.

మహబత్—మంచిదట్లే తీసుకొనివచ్చెదను.

[సలా మొనరించి నిష్క్రమించును.]

నూర్జ—సార్వభౌమా! షాజహానును సాదరముగ నభ్యర్థించు టుచితమే! కాని యొకమాత్రమైన విచారణ సలుపక వానినివిడచివేయుట యుక్తముకాదు. కుమారుఁడైనను, అతఁడు విద్రోహియను విషయమును మఱువకుఁడు.

జిహాం—తన యపరాధమును మన్నించి వైచితినని, షాజహానున కెఱింగించితిని. ఇపుడు విచారణ సలుపుట యుక్తముకాదు! న్యాయ విచారణ మొనరించుతఱి మొగలు ప్రభువు పుత్రపుత్రికా విచక్షణతఁ బూనఁడనియు,వాని న్యాయవిచారణవిధాతృవిధానమువలె వాడియై—తీవ్రమై, పక్షపాత రహితమై—నిర్మలంబై సరళమై యుండుననియు భారత వర్షమండలిఁ బ్రజలెల్లఁ జెప్పుకొనుట మీ రెఱుంగుదురు కదా!

జిహాం—న్యాయవిచారణ మా! సామ్రాజ్ఞీ! ఆదినములు గతించిపోయినవి. నేనిపుడుచక్రవర్తిని కాను. నాయందుండినరవంతచక్రవర్తిత్వము గూడ నొక మహా ప్రవాహమందుఁ గొట్టుకొని పోయినది! నాయందిపుడు శేషించినది—పితృప్రేమయే! నూర్జహానూ! న్యాయ విచారణ సలుపవలసినయెడల నీవును నేనును కూడ నేఁడు శిక్షార్హుల మగుదుము.

నూర్జ—అయినను, తాము సార్వభౌమపదవి నలంకరించు నంతదనుక న్యాయవిచారణాభినయ మొకించుకఁ జూపు టవసరము కాదా! విచారణమను లటన మొకించుక వెల్లడించి తదనంతరము షాజహానును విడిచిపెట్టఁ గోరుదు రేని విడచివేయుఁడు. సార్వభౌముని

న్యాయవిచారణపైఁ బ్రజలకుఁగల గాఢవిశ్వాసము నిట్టితరుణమున బలవంతముగఁ జలింపఁ జేయుట యుచితముకాదు! బహిరంగ విచారణ యొకింత యనావశ్యకము! పిమ్మటఁ దనూభవునకు విడుదల నొసఁగినను బాధలేదు.

జిహాం—అట్లేకానిమ్ము. నాయభ్యంతర మేమియులేదు. నీయిష్ట మెట్టులో యట్లేకానిమ్ము.

నూర్జ—నామానరక్షణార్థము మాత్ర మా విచారణ నన్నే సేయనిండు. నాయెడ నిర్లక్ష్యము వహించి నాపై ఘోరాపనింద మోపి షాజహాన్ను మీపైఁ బత్రములిఖించెను. నాయభిమానమును గాఁపాడుకొన మీకుమారుని విడుదలఁ జేయు సమ్మానమును నాకే యొసఁగుఁడు.

జిహాం—మంచిదట్లే యొసఁగెదను. కాని విచారణసమయమందు నేను నీ యెదుట నుండవలయును?

నూర్జ—(మందహాస మొనరించి)—సహధర్మచారిణిపై దేవరకు సంపూర్ణవిశ్వాసము లేనట్లు తోఁచుచున్నది—ప్రభూ! మీ యభీష్టానుసారముగనే యాచరింపుఁడు.

జిహాం—అదుగో! షాజహాను వచ్చుచున్నాఁడు.

(మంత్రి యుగ్రఖాను సైన్యాధ్యక్షుమహబత్ఖానులతో షాజహాను దర్బారు మందిరము బ్రవేశించి, జనకున కభివాదన మొసఁగును. సామ్రాట్ సింహాసనమునుండి లేచును; కాని, తనపై నూర్జహాను కఠోర దృష్టులఁ బఱపుటచే నతఁడు మరల నిజపీఠమం దాసీనుఁడగును!)

జిహాం—షాజహానూ! నీ కీ రాజధానియందు గౌరవపూర్వకముగ స్వాగత మొసఁగుచున్నాము.

షాజహాను—(చక్రవర్తిని విలోకించి) అది దేవర యనుగ్రహము!

నూర్జ—కాని; షాజహానూ! నీ వపరాధివి! దానం జేసి ముందుగ

నిన్ను విచారింపవలయును.

షాజ—విచారణయా!

నూర్జ—అవును విచారణయే! షాజహానూ! నీపై మోపఁబడిన దోష మేమో నీ వెఱుంగుదువు.

షాజహాను—(విస్మయముంబున జహాంగీరునకు విలోకించుచు నిలువంబడి, నూర్జహానుతో) ఎఱుఁగను.

నూర్జ—అట్లైన నేనే యెఱింగించెద. నీ ప్రథమ దోష మేమనఁ రాజ్యకాంక్షచేసీవు రహీమానురాజు ద్వారా నీ సోదరుఁ డగు ఖుస్రును హత్యఁ గావించితివి. అట్లొనరించితివని నాతప్పొప్పుకొనని యెడల సాక్ష్య మొసఁగుటకై రహీమానును నిచటకు రప్పించెదను. నీ ద్వితీయాపరాధము! నీవు నీ జనకునకు విరుద్ధముగ, విద్రోహము సలిపితివి! దీని నొప్పుకొనక తప్పదు. తృతీయాభియోగము. కొంత సైన్యముతో భారతవర్షమందు భీషణసంక్షోభము నుద్భవింపఁ జేసితివి! ఈ నేరములన్నిఁటి కిపుడు నీవు సమాధానము చెప్పుకొనవలయును.

షాజ—సార్వభౌమా! వీనికిఁ బ్రత్యుత్తరము నా జాబునందే వ్రాసుకొనియున్నాను. ఇపుడు మరల దాని వెల్లడింప వలసినపని లేదని నా తలంపు.

నూర్జ—పని లేకేమి?

షాజ—సార్వభౌమా?

జహాం—షాజహానూ! ఈ నేరముల నీవు పత్రమందేమి యుత్తర మొసఁగితివో, దానినే నేఁడీ బహిరంగసభయందు గూడ వ్యక్తీకరించుట మంచిది!

షాజహాను—(క్షణ కాల మూరకుండి చక్రవర్తిపై స్థిరదృక్కులఁ బఱపును)

చక్రవర్తి—(తలవంచుకొని కూరుచుండును)

షాజహాను—(మెల్లగ) నా "నేరముల" కు త్తర మెవరి కొనఁగవల యునో తెలియకున్నది. ప్రస్తుతభారత శాసనకర్త అక్బరు సార్వ భౌముని తనయుండగు జహాంగీరో, లేక శక్షాను యొక్క విధవ యైన నూర్జహానో నాకు బోధపడుట లేదు!

నూర్జ—షాజహానూ! నీ వపరాధివి! చేతుల జోడించుకొని నిలువఁ బడుట నీకుఁ దగును కాని పరిహాసములోనికి దిగుట తగదు.

షాజహా—(జనకును ద్దేశించి) నే నీమెతో వాగ్వాద మొనర్చుటకు రాలేదు. తాము నిక్కముగ నాపై మోపఁబడిన యుపనిందలకు సమాధానము బడయఁ గోరుచుంటిరా?

జహాం—షాజహానూ! అవును.

షాజ—క్షణకాలము నీరవుఁడై యుండి—అట్లైన, నా యపరాధ మును మన్నించి, తాము నన్నిచటికి రప్పించుట నన్ను బాధించు టకై పన్నిన మాయోపాయమా?

నూర్జ—షాజహానూ! నీ విపు డెవరితోఁ బ్రసంగించుచుంటివో యెఱుంగుదువా?

షాజ—నూర్జహానూ! ఎఱుంగుదును. ఎఱుంగక పోలేదు! నేఁ బ్రసం గించుచున్నది నా జనకునితో!—జనకా! మీ పక్షమున నేను విద్రోహము సలుపుట నిక్కమే! కాని ఎదుటఁబడి యుద్ధమొన ర్చితిని గాని మిమ్ము మోసగింప లేదు! ఓడిపోయితిని. అది దైవయోగము. ఈ మహాబత్ఖానే నన్నుఁ బ్రతిఘటించి నిలువ కున్నచో నే నీమెను, తలఁబట్టుకొని యీ సింహాసనమునుండి యీడ్చివైచి యస్థికుండమున దొరలించి యుందును. మీరపు డాదృశ్యమును, చెంత నిలచియుండి మహదానందముతోఁ జూచెడి వారని యీ బహిరంగసభయందు చెప్పుచుంటిని!

జహాం—(క్రుద్ధుండై)—షాజహాను! నోరు సంబాళించుకొనుము!

షాజ—మీ యాజ్ఞ శిరసావహించుచున్నాను.

నూర్జ—షాజహాను! నన్నిట్లు నిందుకొలుపునం దిరస్కరించుట మహాప్రమాదమని యిప్పుడే నీకు బోధ జేసెదను. నీ గర్వభంగ మొనర్చు టెట్లో నే నెఱుంగక పోలేదు! నీ వొనరించిన యపరాధములకై నీ కొక వత్సరము కఠిన శిక్షను విధించితిని! మహబత్ఖాను నుద్దేశించి—సేనాధిపతీ! కండకావరమున నొడలెఱుంగని యీ మూర్ఖుని పెడ రెక్కలు విఱిచికట్టి, కారాగారమునకుం గొనిపొమ్ము! షాజహాను! సిద్ధముగ నుండుము!

మహాబత్—సామ్రాజ్ఞీ! మన్నింపుండు. కల్లయభయ మొసంగి మోసమున నితని నిచటకు రావించి చేం జిక్కించుకొని, యిపుడు బంధింపం దలంచుచున్న మీ ఘోరదుర్న్యాయప్రపంచమున నీ మహబత్ఖాను కాలిడండు!

నూర్జ—మహాబత్! నీవు భృత్యుండవు! నీ కార్యము మా యాజ్ఞల నెరవేర్చుటయే గాని, న్యాయాన్యాయ విచారణ సలుపుట కాదు!

మహాబత్— అట్టి యన్యాయపు శాసనములం దలంజొల్చుట కిష్ట పడండు.

నూర్జ—ఏమీ! ఇష్టపడండా! అట్లైన నీవు కూడ విద్రోహివే!—సైనికులారా! ముష్కరుండైన యీ మహాబత్ఖానును బంధించుండు!

మహాబత్—బంధింపుండు!—బంధించుట కెవరికి సాహసముండునో వారు వచ్చి బంధింపుండు. సైనికులారా! ఈమాటలాడుచున్నది మహాబత్ఖాను. తెలిసినదా! మహాబత్ఖా నిరువది వత్సరముల నుండి మీకు సేనాధిపతియై యున్నాడు. ఈయిరువది వత్సరముల నుండి మహాబత్ఖాను మిమ్ము జాలసారు లుత్సాహముతో

యుద్ధభూములందు నడిపియున్నాఁడు. అనేక యుద్ధములందు మీతోఁ గూడి విజయము లంది ప్రజాసమ్మానములఁబడసి సర్వజన ప్రేమపాత్రుండైనాఁడు! ఎవరికి సాహసముగలదో వారలట్టి మహాబత్ఖానును బంధించి యీసామ్రాజ్ఞి యాజ్ఞ నెరవేర్పుఁడు.

(అందఱు నిస్తబ్ధులైయుందురు)

నూర్జ——ఏమి! ఈకార్య మొనర్ప మీలో నెవరికిని సాధ్యము కాదా! సైనికులారా! మీయం దొకండైన మగవాఁడు లేడా?

మహాబత్ఖాను——(జిహాంగీరు నుద్దేశించి)సార్వభౌమా! నన్ను బంధించి వేయుఁడు! మీరట్లొనరించిన నే నేమియుఁ బలుకను! చేతులఁజాపును.

జిహాం——పరాక్రమధుర్యా! నిన్ను బంధింపఁగలుగు శృంఖలము లింకను తయారు కాలేదు! నిన్ను నేను క్షమించితిని! ఇఁకబొమ్ము!

నూర్జహాను——(చివాలున లేచి నిలువంబడి భీషణస్వరమున) అట్లు విడచుట యసంభవము! నూర్జహాను సామ్రాజ్ఞి యీగభీరపారావారమందు మునిఁగిపోవనైన మునిఁగిపోవును. లేక దాని వక్షమ్మును తనకడ కాలితోఁ దన్నివైచి యతివేగముగ ముందుకుఁ బోవనైన నుపోవును. కాని యీసముద్రతరంగములందిటునటుచుయ్యాల లూగుచుండుట కిష్టపడదు! మహాబత్ఖానును బంధించుట కెవరికి సాధ్యము కానిచో, నేనే స్వయముగ వానిని బంధించెదను! భారత సామ్రాజ్ఞియైన నూర్జహాను నడ్డుకొను టెవరికి సాధ్యమో చూచెద గాక!——ఇట్లని సింహాసనమునుంచి చివాలున లంఘించి వేగముగ ముందునకుఁ బోవును

లయలా——(తక్షణమే నేపథ్యమునుండి దర్బారుమందిరములోనికి దుమికి గంభీరభాషణంబుల)——"నూర్జహానూ! ఎవరికి సాధ్యమో చూచెదవా! చూడుము యిదిగో లయిలాకు సాధ్యము!"

సభికులు—[స్తంభితులై పోదురు]

లయలా—సామ్రాట్! మొగము వాల్చి సింహాసనముందుఁ గుంటివానివలెఁ గూరుచుండి, యీగయ్యాళి స్వేచ్ఛాచారము నూర్ధక విలోకించుచుంటివా! నీపౌరుషమంతయు నేమైపోయినది? పురుషులింతయధోగతిపాలైపోయిరా? ఛీఛీ! సిగ్గు సిగ్గు!! [షాజహాను నుద్దేశించి]—రాజకుమారా! స్వయముగ సార్వభౌముఁడే నిన్ను క్షమించివైచెను! నీవు విడుదల నొందితివి.—మహాబత్ఖాన్నూ! నిక్కముగ నీవు మహాబత్ఖానువలెనే యాచరించితివి! ఇఁదుండి నీ వరుగవచ్చును! నీవు విడిచిపెట్టబడితివి. చక్రవర్తి యాజ్ఞ ననుసరించి నీకిచ్చ వచ్చిన చోటికరుగుము!—రాక్షసీ!—నూర్జహాన్! సామ్రాజ్ఞీ స్థానము నలంకరించితినను గర్వంబున మిట్టిపడుచుంటివా? నీగర్వము శీఘ్రకాలముననే యణఁగిపోవును. యువరాజగు ఖుస్రు హత్యాపరాధము నీతలపైఁబడి యున్నదని నే నీ బహిరంగసభయందు స్పష్టముగఁ బలుకుచుంటిని! సాధ్యమగుచో నీ నిర్దోషత్వమును ఋజువుపఱచుకొనుము.

(తల్లియు గూతురును పులులవలె నాకొలువు కూటమున నిలచి యుండి యొండొరులఁ దీవ్రదృష్టులతోఁ జూచు కొనుచుందురు)

తెరపడును.

శ్రీ

# నూర్జహాన్

## చతుర్థాంకము

### ప్రథమదృశ్యము

అసఫ్‌యొక్క యింటి వెలుపల—ప్రభాతకాలము

రాజమందిరమందలి కొందరు ఉద్యోగస్థులు కూరుచుండి ప్రసంగించుచుందురు.

లంబకేశుఁడు—అయిందా లేదా?

దీర్ఘకర్ణుఁడు—ఏమి? ఏమి?

ఉన్నతోదరుఁడు—ఏమో చెప్పూ చెప్పూ! దబ్బున!

లంబకేశుఁడు—నేను చెప్పిన ట్లయిందా లేదా?

దీర్ఘకర్ణుఁడు—ఏమిటీ?

లంబకేశుఁడు—సామ్రాజ్ఞాని కిప్పుడు సామ్రాట్టు ప్రక్క చూపుతూ వున్నా శీఘ్రముగా బృహత్తుమును చూపుతాడని చెప్పలేదా?

కృష్ణవర్ణుఁడు—అవునవును. నీ వామాట చెప్పడము నిజమే! నిజమేనోయి!! నిజమే!!!

ఉన్నతోదరుఁడు—మేము దేశములో సూర్యుఁ డొక మాట స్తమించి మళ్ళా ఆఱుమాసములవఱ కుదయింప డని విన్నాను! మన రాజు కొంతకాలమువఱకు మనకు గనపడడని తోస్తున్నది.

లంబకేశుఁడు—అవు నివును రాజ్యం చేసేది జహాంగీరు కాదు—

నూర్జహాను అమ్మవారు !

కృష్ణవర్ణుఁడు—మీ రేమన్న సరే, ఆయమ్మవారి ప్రభుత్వములో మనము సుఖంగానే యున్నామని చెప్పవలెను !

లంబకేశుఁడు—నీవు పొందేసుఖ మేమిటి ?

దీర్ఘకర్ణుఁడు—ఏమి సుఖమా! దేశమం దంతటా దివారాత్రములూ నృత్యగీతసురాప్రవాహాలు ప్రవహించిపోవడము లేదా ? వానిసుఖ మెంతో వేఱే చెప్పవలెనా?

ఉన్నతోదరుఁడు—ఆప్రవాహాలపైన, అపుడపుడు తరంగాలు లేవక పోతే వాటివలన విశేషానిష్టము కలుగుతుంది.

దీర్ఘకర్ణుఁడు—అదేమిటి ?

ఉన్నతోదరుఁడు—నీకు తెలియదా! సామ్రాట్టు అనుమతి లేనిదే, యే యుద్యోగికూడా సారా త్రాగగూడదనిన్నీ, అతడు తిరిగి ఆజ్ఞయిచ్చినపుడంబడూ సారా తప్పక త్రాగవలెననిన్నీ, ఒక హుకుము జారీయైనట్లు నీకు దెలియదా ?

కృష్ణవర్ణుఁడు—ఒరే ! మూర్ఖా ! కొంపతీసి వేశావురా!—అడిగో కిష్కింధాపురాగ్రహారీకుడు వచ్చి పడ్డాడు!

దీర్ఘకర్ణుఁడు—మన యువరాజును కటారితో బొడిచి చంపివేసిన వాడు వాడే కాదు ?

లంబకేశుఁడు—అవు నా పామండుడే !

ఉన్నతోదరుఁడు—ఛీఛీ! ఈ పాడుముండాకొడుకొచ్చి, మనరంగ మంతా చెడిపేసేట ట్లున్నాఁడు !—ఆహా! ఏమిరా ! నీనడక ! అచ్చంగా గజ్జిలగాడి పెద్దన్నగారిలా వున్నావు !

దీర్ఘకర్ణుఁడు—చక్రవర్తి కొడుకును చంపివేసి కూడా యీగాడిదింకా బ్రతికి వుండటం నాకు చాలా ఆశ్చర్యంగా వున్నది !

ఉన్నతోదరుఁడు—ఊరికే బ్రతికి వున్నాఁడా?—బాగా పెఱుగు

చున్నాఁడు ! వాడిబొజ్జ కనపడటంలేదా ? మా పెద్దగంగాళంలా వున్నది !

కృష్ణవర్ణుఁడు—ఈగాడిక 'రాజా' మెట్టమీదనుంచీ 'మహారాజా' మెట్టుమీద కిట్టే యెక్కిపోయాడు !

ఉన్నతోదరుఁడు—ఎక్కిపోడా ? వా డిప్పుడు శివుని విడిచిపెట్టి దుర్గాధ్యానము చేస్తున్నాడు. వాడిపై సామ్రాజ్ఞి కృపాదృష్టిపడింది!! పడిందిరా!! పడింది!!!

దీర్ఘకర్ణుఁడు—సరే కాని, కొడుకును చంపివేసిన, ఆ పోతరాజు నేమీ చేయక చక్రవర్తి యూరకున్నాడేమి ?

ఉన్నతోదరుఁడు—ఒరే దీర్ఘకర్ణా ! నీ కాళ్టే—అబ్బే!—నీకు నిజంగా రాజనీతి యేమీ తెలియనట్లు కనుపించుతోంది !

కృష్ణవర్ణుఁడు—ఒరే! వున్నతోదరా ? నీవు క్రియావిశేషణాలన్నింటినీ వొకే నిశ్వాసములో విడిచిపెట్టేశావు !

[రహిమాను ప్రవేశించును.]

కృష్ణవర్ణుఁడు—ఓహోహో ! మహారాజ్జీ ! మహారాజ్జీ ! వచ్చావురా చవటా!!

లంబకేశుఁడు—జయ్ మహారాజుగాడికి—జయ్ ! జయ్ మహారాజుగాడికి జయ్!!

రహిమాన్—హిహిహి! (నవ్వు) ఇదంతా మహాశయుల అనుగ్రహం! మహాశయుల అనుగ్రహం!!

కృష్ణవర్ణుఁడు—మహాశయా ! యువరాజు నొక్కదెబ్బలో మట్టుపెట్టివేసి, వొక్కదాటులో మహారాజ్ బిరుదము పొందినావు ! మీ ఘనకార్యాన్ని మీ అవలీలలంఘనాన్ని మే మెన్నడు మఱచిపోలేము ! అవునా కాదా? ఏమంటావురా మహారాజ్జీ !

ఉన్నతోదరుఁడు—'రాజా' మెట్టులోనుండి 'మహారాజా' మెట్టులోకి

వొక్క ఛే దాటు!—ఏమిదా ఓమి దాటు! —కిష్కింధాపురవాసి ననిపించుకున్నాడు [మఱొకండు యుద్యోగి నుద్దేశించి] దీర్ఘకర్ణా! వీడు త్వరలో మహారాజపుత్రాడని చెప్పలేదా?

రహిమాన్—హిహిహిహి!—

లంబకేశుఁడు—చూడు చూడు వాడెల్లా తిరిగి పోతున్నాడో! చూడు! గుండ్రంగా తిరిగి పోతున్నాడురా! ఫూః! ఏమిరా నీ రూపు! నీ అందంమండా!!

దీర్ఘకర్ణుఁడు—సరిగ్గా కుమ్మరిపురుగులాగ తిరిగి పోతున్నాడురా!

ఉన్నతోదరుఁడు—దీర్ఘకర్ణా! మామంచిపోలిక కనిపెట్టేవురా!—

కృష్ణవర్ణుఁడు—ఒరే! మహారాజ్జీ! ఖుస్రును చంపివేసి మీరు చేసిన మహోపకారమును, వొక తల్లికడుపున పుట్టిన తమ్ముఁడుకూడా చెయ్యలేడని షాజహాను చెప్పాడురా!

రహి—హీహీహీహీహీహీ—అవును! అవును!! అల్లాగల్లాగా!! సామాన్యకర్తవ్యం మాత్రం! సామాన్యకర్తవ్యం మాత్రం!!

లంబకేశుఁడు—ఇది కర్తవ్యమా! పాడుముండాకొడుకా! ఇది కర్తవ్యమా! సరే నా కర్తవ్యం కూడా చూపిస్తాను నిలబడు! [ఇట్లని లంబకేశుఁడు రహిమానును నొక్కతన్ను తన్న, మఱందుకు బర్వెడ, నతఁడు చివాలున లంఘించి, పలాయన మొనరించును.]

కృష్ణవర్ణుఁడు—మా మంచిదుముకు దుమికేడ్రా!—కిష్కింధావాసి దగ్గిరా నీ చలాకి!

దీర్ఘకర్ణుఁడు [లంబకేశునుద్దేశించి]—ఇపుడు నీతల కాచుకో. వీడు సామ్రాజ్ఞి ప్రాణముని మెఱుగవు కాబోలు!

లంబకేశుఁడు—ఈ కటికివాణ్ణి కాటికంపినతర్వాత నాతల నీయవలసి వచ్చినా, యిచ్చివేస్తాను!—సామంపుడు! అడవినక్క!! పీనుగ రాయుడు!!!

ఉన్నతోదరుఁడు—ఒరే వీడు అడవినక్క కాడు! వీడికీ నక్కకూ చాలభేదమున్నది!—వీడు సరిగా కుమ్మరిపురుగే! దీర్ఘకర్ణా! మా మంచి పోలిక కనిపెట్టేవురా! వీడికి దానికీ సరిగ్గానరిపోయింది!

దీర్ఘకర్ణుఁడు—అదిగో! మంత్రిమహాశయు డిక్కే వస్తున్నాడు.

(అసఫు ప్రవేశించును.)

ఉన్నతోదరుఁడు—మంత్రిమహాశయా! పాదుషానేఁడేమైన క్రొత్త హుకుమును జారీచేసెనా?

అసఫ్—అవును. క్రొత్తహుకు మొక్కటి బయల్పడెను. నేఁటిరాత్రి మీరందఱు సారాత్రాగి మీ చిత్తమువచ్చిన ట్లుల్లాస క్రీడలఁ దేలవలయునని చక్రవర్తి యాజ్ఞయొసఁగెను!

ఉన్నతోదరుఁడు—శోభనాల్లా! (వహవ్వా!) ఏమిరా మనఅదృష్టం! ఈ హుకుమున కేదో అర్థంవుండకపోదు. అది తెలియుడము కష్టముకాదు!

అసఫ్—కాని,—

ఉన్నతోదరుఁడు—ఇందులో 'కాని' దూర్చినయెడల నేను పెడ బొబ్బలు పెడతాను తెలిసిందా!

అసఫ్—'కాని' వుండుట దీనిలోకాదు, వెలపల!

దీర్ఘకర్ణుఁడు—ఆ 'కాని' యేమి!

అసఫ్—ఆ 'కాని' యందు మీ కెవరికీ యిష్టములేనట్లు తోస్తున్నది. కాని, అది చాలామంచి 'కాని'!

కృష్ణవర్ణుఁడు—ఎల్లా!

ఉన్నతోదరుఁడు—కాని,—కాదు!—మరీ—

అసఫ్—'కాని'!

ఉన్నతోదరుఁడు—'ఆకాని' యేదో చెప్పివేయి. తర్వాత మే మెందు కైనా సిద్ధపడతాము.

అసఫ్—అట్లైతే వినండి. చక్రవర్తి తనచెవులు కుట్టించుకొని, కుండ నాలు పెట్టుకోని, తన యధీనమందుండే వుద్యోగస్తు లందరినీకూడ తనలాగా వుండమని యాజ్ఞయిచ్చాడు! కాబట్టి మీరందరూ శీఘ్రంగా స్వామివారి సెలవుప్రకారంనడవాలి. లేకుంటే మీమీ నౌకరీలు దక్కవు!

దీర్ఘకర్ణుడు—ఏమి?

అసఫ్—ఇంకా యేమేమేమి?

కృష్ణవర్ణుడు—మెమ్మెమ్మా, తెత్తెమ్మా!

అసఫ్—అదేమి?

కృష్ణవర్ణుడు—అదొక తమాషామ్మాత్రమే! రాజాగారిపుడు తమాషాలలోకి దిగాడు!

అసఫ్—అట్లైతే ఆజ్ఞాపత్రం చూడండి?

-ఆజ్ఞాపత్రమును చూపును.-

లంబకేశుడు—ఇట్టిదేదో జరుగకమానదని నేనీవఋలోనే చెప్పివున్నాను! చక్రవర్తి యింత పనికిమాలినవాడు కాకుంటే, రహిమానుపాషండుడు రాజావైు, పిదప మహారాజవుతాడా!

దీర్ఘకర్ణుడు—నిజంచెప్పేవో పొడుగుజుట్టు పెదబాబూ!

ఉన్నతోదరుడు—అవునోయి చెవలపోతుబావా!

కృష్ణవర్ణుడు—బొజ్జకనకయ్యా గొప్ప రసికుడే!

ఉన్నతోదరుడు—నువ్వా చెప్పాలీఅంట్ల తప్పేలావలె రంగూనువ్వా! ఇత్తడిసుబ్బిలా మొగమునువ్వా! పొడుంకాయవలె ముక్కునువ్వా! ఎలకపిల్లవలె పిలకానువ్వా!—

దీర్ఘకర్ణుడు—ఓరుండవోయ్! నీకు సలాము! ఇప్పుడు కొండవిరిగి మీఁద పడింది.

ఉన్నతోదరుఁడు—అవునవును. గొప్పచిక్కొచ్చింది! మనమే యిక తమ్మిట్లు, దుద్దులు, నాగరము, రాగిడీ, దాయిగళ్ళు, నానూ, పట్టెడా, కాసులపేరూ, అడ్డబాసా, పుస్తెల్లోనానూ, సత్తు, ముక్కుపుడక, మురిడీగొలుసులు, పోచీలు, మిరియాలపేరులు వంకీలూ ధరించటం మొదలుపెట్టితే, యిక యింట్లోవుండే మన యిల్లాండ్రేమిచేస్తారు?

దీర్ఘకర్ణుఁడు—చెవిలో కలంపెట్టుకొని దస్తావేజులు వ్రాయటం మొదలుపెడతారు!

లంబకేశుఁడు—ఆహుకుముకూడ యెప్పుడో వొకప్పుడు, బయల్పడుతుంది. చూస్తోవుండండి!

దీర్ఘకర్ణుఁడు—అతని యిష్టప్రకారంగా జరిగిపోవాలి కాబోలు! ఏమి హుకుం యేమిహుకుం! ఇదంతా అయమ్మవారి మాహాత్మ్యము!

కృష్ణవర్ణుఁడు—అవునల్లాగే కనుపించుతోవుంది! రాజే యిటువంటి వేషాలకి దిగుతోవుంటే, ప్రజలము మనమేమి చెయ్యగలము? మనముకూడ వాడిలాగానే యేడవాలి! ఇక సందేహ మెందుకు? కమ్మపాల మల్లయ్యను పట్టుకుందాం రండి!

ఉన్నతోదరుఁడు—'యథా రాజా తథా ప్రజా! యత్కించమరికొమ్మ యీ!' వలెనున్నది! 'ఓం ఓం!' అంటో పదండి!

లంబకేశుఁడు—ఛీ ఛీ! ఆడాళ్ళలాగు మాట్లాడుతో వున్నారేమిరా! చెవులు కుట్టించుకోడానికి మనము మగవాళ్ళము కాని, ఆడవాళ్ళం కాము! అలాచేయమని బలవంత పెడితే, తిరగబడదాము! బానిస వాళ్ళలకు పట్టేగతి మన కెందులకు?

ఉన్నతోదరుఁడు—మీరందరూ యేమి చేస్తారో, నేనూ అదే చేస్తాను!

దీర్ఘకర్ణుఁడు—అవునవును! నేనూ మా బొజ్జయ్యమామ చేసినట్లే

చేస్తాను! ఎల్లాగైనా అది పెద్దతలకాయి!

కృష్ణవర్ణుఁడు—మా చెవులపోతు స్వాములవారెప్పుడూ యిల్లా సెల విస్తూ వుంటాడు!

అసఫ్—తుదకేమి నిశ్చయము చేశారు? —చెవులు కుట్టించుకోవడమా లేక విద్రోహం సలపడమా?

లంబకేశుఁడు—మీరు పరిహాసం చేస్తున్నారు! చక్రవర్తికి మంత్రిగా ఉండిన్నీ—

కృష్ణవర్ణుఁడు—అవును! బాబు, పూర్తిగా బూడిద కాకముందే యితఁడు మంత్రిగారైనాడు! భావమరదులకు లోటేమి! నేను కూడా చక్రవర్తికి భావమరదినై యుంటే, యీ పాటికేమగుదునో చూపేవాణ్ణి!

అసఫ్—ఆలాగే! కాస్త నేపుండు.

## ద్వితీయదృశ్యము.

### నూర్జహాను మందిరము—రాత్రి కాలము.

నూర్జహానేకాకినియై, ఆ యాగారమందు నిలువంబడి యుండును.

నూర్జ—ఇదికూడ మదమే! శక్తి యొక్క శిఖరము నధిష్టించితిని. అయిన నింకను మీఁదికిఁ బోఁగోరుచుంటిని! కాని నూర్జహానూ! జాగ్రత్తసుమీ! నేఁడు నీవా శిఖరాగ్రమందు నిలువఁబడితివి! జాగ్రత్త!—కాని, కాని, అల్లెందులకు?—జాగరూకత యెందులకు?—భయమేమి? —ఎవరినిగూర్చి భయము? —నాపుత్రినిగూర్చియా!—ఎవతెకొఱకై యిన్ని రాద్ధాంత సిద్ధాంతములు జరిగెనో,—యే బాలకోసమై యిట్టిప్రళయము గావింపఁ బడెనో, ఆమెయే విద్రోహమొనర్చెనా? ఇఁక తాళుటెవరికొఱకు?—నేఁడన్ని బంధనములఁ గోసివైచికొని వెల్వడితిని! ఈ విశాల విశ్వ

మందు నేఁడు నేనొకర్తుకనే యున్నాను! ఇఁక నేనెవరినిజూచి వెఱ గొందవలయును!—అట్టి భయమెందులకు? —మంచిది! నూర్జ హానూ! నీహాయమును వేగముగ ముందుకుఁ బోనిమ్ము. క్రిందఁ బడిపోదునేమో యని వెఱువకుము! పడిన పడుదువు! జయము లేకున్న నపజయము!—బ్రతుకు లేకున్న మృత్యువు!—వెనుదిరుగ వలయునను వాంఛను చంపివేసుకొనుము!—

(అసఫ్ జహాంగీరులు ప్రవేశింతురు)

జహాం—సామ్రాజ్ఞీ! తనపై మోపఁబడిన నేరమునకు సమాధాన మిమ్మని, మనము మహాబత్ఖానును నెంతనిర్బంధించినను, అతఁడిచ్చు వాఁడుకాడని మన మంత్రి చెప్పుచున్నాఁడు.

నూర్జ—ఎందులకొసఁగఁడు?—ఒసఁగ కేమిచేయును?

అసఫ్—చక్రవర్తి యాజ్ఞను దిరస్కరించును. లేదా విద్రోహము సలుపును—సామ్రాజ్ఞీ! రాజు తండ్రివంటి వాఁడనియు, రాజ్య మాతనిభార్య యనియు, ప్రజలాతని పుత్రులనియుఁ దెలిసికొనుము. ఏలిక ప్రజల నాదరపూర్వకముగఁ బాలించిన, వారలు ప్రేమతోఁ దమ రాజును సేవింతురు. కాని నిష్కారణముగ రాజు ప్రజలయెడఁ గ్రౌర్యము నూపినచో వారుకూడ నట్లే క్రౌర్యము జూపుదురు.

నూర్జ—చూపనిమ్ము! అందులకై మేము వెఱగొందు వారము కాము! విద్రోహము నెట్లణఁగఁ ద్రొక్కివేయవలెనో విరోధుల నెట్లు చించి చెండాడవలయునో మేమెఱుఁగక పోలేదు.

జహాం—ప్రేయసీ! సైనికులపై మహాబత్ఖానునకుఁగల యత్యంతప్రతి పత్తినిగాంచి, నీవే యాతనిని సైన్యాధిపత్యమునుండితీసివైచి వంగ సీమకు సుబేదారుగ నియమించిన బాగుండునని చెప్పితివి. అందుచే వానిని పరభేజుకు లోఁబడి సుబేదారుగ నుండ నానతిచ్చి వంగ భూమి కంపితిని—ఇపుడందులకుఁ గూడ నీయభ్యంతరమున్నట్లు

తోఁచుచున్నది.

నూర్జ—అభ్యంతరమునకుఁ గారణములేకున్న నభ్యంతర పెట్టకయే యుండును! మహాబత్ఖాను, ఒరిస్సానీమనుజయించి,నూరేనుఁగులను స్వాధీనము జేసుకొని యింత దనుక వాని నాగ్రాకుఁ బంపుట యనవసరమని తలఁచెను! కొల్లగొట్టిన ధనమంతయు చక్రవర్తిది కాని, సేనాధిపతిది కాదు!

అసఫ్—ఏనుఁగులను బంపవలసిన కాల మింకను మించి పోలేదు.

నూర్జ—మించిపోలేదా? అసఫూ! నీవు నీమంత్రిత్వమున కవమానము దెచ్చుచుంటివి! చక్రవర్తిప్రభుత్వమును నిస్సంకోచముగఁ దిరస్కరించి—యిదియే తగిన యదనని తలఁచివంగదేశమున మహాబత్ఖాను విద్రోహబీజమును నాట నమకట్టెను! ఇట్లని వాని ప్రస్తుత ప్రవర్తనము చెప్పక చెప్పుచున్నది!

జహాం—అతఁ డిట్లొనర్చుట యసంభవము.

నూర్జ—ప్రభూ! అసంభవ మేమియు లేదు. 'Imposibility' is to be found in the Dictionary of fools—మరణించిన, పిదప బ్రదుకుటమాత్రమే యసంభవము! "నన్ను బంధించు టెవరికి సాధ్య" మని తనయెదుట గర్వముతో ధిక్కరించి పలుకఁగలవానిని చక్రవర్తి యింకను దన ప్రాణంబువలెఁ జూచుకొనుచు, ఇంద్రునివంటి పరాక్రమవంతుఁడని, యాతని నుగ్గడించుచు, సర్వకాల సర్వావస్థల నాతని నామమునే సంస్మరించుచుండుటచే, తనపై సార్వభౌమునకు గాఢవిశ్వాసమున్నదని గ్రహించి, పెచ్చుమీఱిపోయి మహాబత్ఖా నిత్తఱి తనకుఁ దగిన కార్యమును సలుపుచున్నాఁడు.

జహాం—మానవుని విశ్వసించినప్పటికంటె విశ్వసింప నప్పుడే నేనెక్కుడుగ వంచింపఁబడితిని!

నూర్జ—వంచింపఁబడుటయు, వంచింపఁబడకుండుటయు మీ యిష్ట

ము! కాని దేవరా! షాజహాను విద్రోహమువలననే శుష్కపత్రము వలెఁ గొట్టుకొనుచుండగా, నీవు డధిక పరాక్రమవంతుఁడగు మహాబత్ఖానువలనఁ గలుగనున్న భీషణవిద్రోహ ఝంఝూని లాఘుతమున నేలఁగూలుడు రేమో యని వెఱగొందుచుంటిని!

జిహాం—(క్షణకాలమూరకుండి) ప్రేయసీ! సామ్రాజ్యమందిపుడు సుఖ శాంతు లొప్పారుచుండ, నిపుడందు భీషణసంక్షోభముదయింపఁ జేయుచుంటివేల?

నూర్జ—ఝంఝూనిలమునకు ముందు పవననిశ్చలత గలుగుట వాస్తవమే—

జిహాం—సామ్రాజ్ఞీ! నీవేమిచేయ నూహించుచున్నావు?

నూర్జ—మహాబత్ఖానును వంగదేశమునుండి పంజాబుసీమకు బదిలీ గావింపఁ దలఁచుచుంటిని. అంతకంటె విశేషంబేమియు లేదు. పాంచాలరాజధాని యగు లాహోరునగర మాతని యధికారము నకు వెలుపల నుండవలయును.

అసఫ్—మహాబత్ఖాను కడుగర్వి. అతఁడిట్టి మోసమును సహింపఁ జాలఁడు!

జిహాం—అట్లొనర్చినఁ బ్రయోజనమేమి?

నూర్జ—ప్రయోజనమేమో చెప్పఁజాలను. కాని ఆదుర్మతిని తనశక్తి పరిధినుండి తొలగింపవలయును! పాంచాలదేశ మంధతఁడెపుడును మన దృష్టిపథమునతిక్రమించి యుండఁజాలఁడు.

జిహాం—రాజ్ఞీ! నీయభీష్ట మెట్లో యట్లాచరింపుము. నేనేమియుఁ బలుకఁజాలను—పలుకఁదలఁచుకొనలేదు!

నూర్జ—మంచిది! మంత్రీ! మా యాజ్ఞను మహాబత్ఖానున కెఱింగించు భారము నీపైఁ బడినది! నాచేతితో నాజ్ఞాపత్రము వ్రాసియిచ్చు చున్నాను. నీవు దీనిని గొనిపోవ సంసిద్ధముగ నుండుము.

అసఫ్—సార్వభౌమా! మీ యుద్దేశ్యముకూడ నిదియేనా?
జిహాం—అసఫూ! నీవు వెడలిపొమ్ము! నాకు విరక్తిఁ గలుగఁజేయకుము. [అసఫు మారుమాటాడక నిష్క్రమించును]
జిహాం—ప్రేయసీ! నీసామ్రాజ్యమును నీవేలుకొమ్ము. సురాసౌందర్య సంగీతవిరాజితమగు నాసామ్రాజ్యమును నేనేలుకొందును!
నూర్జ—హంచిదళ్లే గావింపుఁడు —నీలవేణీ! నీలవేణీ!!

(పరిచారిక యొకర్తుక ప్రవేశించును. నూర్జహా నేదియో సైగఁజేయును. నీలవేణి నిష్క్రమించును. వెంటనే తెరచాటునుండి సుందరవేషాలంకృతలగు నాడకత్తెలు చక్రవర్తియెదుట కేగుదెంతురు.
నూర్జ—ప్రభూ! మీరు కోరిన యీ యానంద సామ్రాజ్య మెట్లు వెలిగిపోవుచున్నదో విలోకింపుఁడు!
జిహాం—ఆహాహా! ఏమి నాభాగ్యము! ఏమి నా సామ్రాజ్యము!— నిక్కముగ నిది మహిమమయమయినది!—వారాంగనలారా! మీ గానామృతముచే చెవులకు విందుఁగొలిపి, మీ నాట్యచాతుర్యమును జూపుఁడు!

వాద్యంబులతో నృత్యమారంభమగును. స్వహస్తములతో నూర్జహాను పాదుషాకు సురాపాత్ర లందించును.
జిహాంగీరు—(దానిని గ్రోలి,)—"ఆహాహా! ఎట్టి సుఖోత్సవమావిర్భవించినది? ఎట్టియానంద యంత్రము నిర్మింపఁబడినది?—పాడుఁడు! ఆడుఁడు!! పాడుఁడు! ఆడుఁడు!!

వేశ్యలు పాడుదురు:—

గీతము ౧.

స్వాదుసంగీతకలనా ప్రవాహమందు
స్వర్ణనూపుర మధురారవములు దేల
చారుమృదుల ప్రసూన వాసనలతోడ

తరళహాసప్రభలు దిశాంతములఁబర్వ
ప్రవిమలానందబాష్ప ధారావసిక్తి
మోదజలనిధి పొంగి పొంగిపోవ
నాట్యమొనరించి గానతన్మయతముంచి
మదిని సంతృప్తిబఱుప సమ్మదమునోడ
రండు! వేవేగ! రారండు! రమణులార!

జిహం——హృదయేశ్వరీ! ఈగానామృతమెంత మధురముగ నున్నది! సంగీతము నిక్కముగఁ జిత్తమ్మందు వాంఛల నంకురింపఁజేయును!——కాని వాని నీడేరనీయదు. నందనవనసౌరభమును దీసుకొనివచ్చును!——కాని దానిని దీర్ఘనిశ్వాసమున మరలఁ బైకిఁ గొనిపోవును. సౌందర్యావరణమును దొలగించివేయును!——కాని, యనుక్షణము దే నల్లమబ్బు దొంతరలచే, దానిని గప్పివైచును. గాలి బుట్టనలె నూర్ధ్వమున కెగయును!——కాని వెంటనే హాహాకారము సేయుచు గాలిలోఁ గలిసిపోవును.

నూర్జహాను——(పాదుషా మాటలను వినక, నాట్యమును జూడక యేమో యోచించుచుండును.

జిహం——సంగీతము!——కాని;——సంగీతపానము పిపాసయే. సంగీతోల్లాసము దుఃఖమే. సంగీతహాసము హాహాకారమే!——సంగీతాలింగనము కృపాణాఘాతమే!—— సంగీతామృతము గరళమే!—— సంగీతస్వర్గము నరకమే!——పాడుఁడు!——మరలఁ బాడుఁడు!

వేశ్యలు——(మరలఁ బాడుదురు.)

గీతమాల

చారుసంధ్యారుణ ప్రభాచయమువోలె
నస్తమించుచు మరలఁ బ్రత్యక్షమగుచు
శారదేంద్ర ధనుర్ద్యుతిచ్ఛటల రీతి

నలుదెసల స్వర్ణరత్నమంజులములైన
భూషణంబుల కాంతి యుబ్బురము గొలుప
మలయపవమానవీచికా మాలికలను
సాగితూగాడు పుష్పవాసనలరీతి
మృదు మధుర దివ్యగీతికామృతతరంగ
డోలికలపైన నవనాట్యకేళి నలిపి
యీ జహాంగీరు పాదుషా హృదయమునకు
స్వర్గసామ్రాజ్య సుఖము చేపడంగఁజేసి
స్వప్నసీమకు బోదమో చానలార
రండు. వేవేగ రండు నర్తనము సలుప.

ఆకస్మికముగ నాయాగారమందు లేత చీకటులు గ్రమ్మును. వారకాంతలు మాయమగుదురు. నేపథ్యమున వాద్యము వినంబడును. క్రమక్రమముగ నది యాగిపోవును.—ఆయంధకారమున నిమీలిత నేత్రుఁడై జహాంగీరుండును.

జహాంగీరు—(మెల్లగ) నూర్జహాన్!
నూర్జ—ఏమి ప్రభూ!
జహాం—నీవు గంధర్వాంగనవా లేక మానవకాంతవా?
నూర్జ—నేను పిశాచిని!

## తృతీయ దృశ్యము

వంగదేశమున మహాబత్ఖాను భవనము—మధ్యాహ్న కాలము.
మహాబత్ఖాను పచారుచేయుచు యోచించుచుండును.

మహాబత్—నగరసింహుని పుత్రుఁడనై రాణాప్రతాపుని సోదర పుత్రుఁడనై నిజధర్మపరిత్యాగ మొనరించి మహాబత్ఖాను నై విధర్ములైన మొగలాయీలకు దాసుండనైతిని! ప్రథమ యౌవ

నోచ్ఛ్వసితోన్మాదనమున,ప్రభుత్వరాజసమ్మానముల ప్రలోభము వలన, సనాతన హిందూధర్మ పరిత్యాగ మొనరించి విధర్మినైతిని. అట్లగుటవలన, ప్రభుత్వ ప్రతిఫల నందితిని! మొగలు సేనాధిపతినై గొప్ప సమ్మానముం బొందితిని! నేను తమ ప్రభాకరుండనియు, నాశక్తి దైవశక్తియనియు, నా కార్యంబు లీశ్వరప్రేరితంబు లనియు వచించుచు మొగలు సైనికులు నన్ను ప్రశాంతము వినుతించుచుండారు! 'దానం జేసియే నే సనిన మిగుల వెలిగొంది, సేనాపతి పదవినుండి తొలఁగించివైచి,వంగసీమకు సుభేదారుగా నూర్జహాను నన్నీ భూమి కంపినది! ప్రభుత్వంబును బడసితిని కాని నాకు లభించిన దేమి?— ఏమియు లేదు! మాతృదేశమును వీడి, స్వమతమును బరిత్యజించి, ప్రేమబంధనములు ద్రెంపుకొని యుద్భ్రాంతధూమకేతువలె నెయ్యెడకో సాగిపోవుచుంటిని!—నేను కోరిన . స్వర్గలాభమైన సుఖం బొసఁగదని యిపుడు గ్రహింపఁ గలిగితిని! పరులకొరకై, సోదరుల కొరకై, దేశముకొరకై; ప్రయాసపడని యెడల సుఖము పూర్ణమై యుండును. భగ్నమైన ప్రయత్నముల తీవ్రవేదన నిరంతరము నా చిత్తమును నొవ్వఁజేయుచున్నది! అదుగో రాజపుత్రుఁడిట్లే వచ్చుచున్నాఁడు.

[పరభేజు ప్రవేశించును.]

మహబత్—వందేగిసాహజాదా! (ప్రభూ! వందనము!)

పరభేజు—మహాబత్ఖానూ! జనకుఁడేలకో నీయెడల నత్యంత విరక్తుఁడై వంగసీమ సుబా (జిల్లా) నుండి తొలఁగించి, నిన్నుఁ బాంచాల శాసన కర్తగ నియమించెను.

మహబత్—ఏమేమి?—నన్నుఁ జక్రవర్తి పాంచాలశాసన కర్తగా నియమించెనా?

పరభేజ్—అవును! కాని లాహోరు నగరము నీ యధికారమునకు

వెలుపల నుండును.

మహాబత్—(అబ్బురమున)—దానికి హేతువేమి?

పరభేజ్—హేతువేమో తెలిసియుండలేదు. వలయుచో నీ వీయుత్తరమును జూడుము. ఇందు రహస్యమేమియు లేదు. పత్రమిదిగో!

పత్ర మొసఁగును.

మహాబత్ఖాను—(కన్నులపఠించి) ఆశ్చర్యమాశ్చర్యము! ప్రభూ! ఈ యాజ్ఞకుఁ గారణ మేమై యుండును?

పరభేజ్—ఏమై యుండునో నే నెఱుఁగను—మహాబత్ఖానూ! ఆదాబ్ (సలాము!) ఇట్లని పరభేజు నిష్క్రమించును.

మహాబత్—తెలిసినది! దీనికంత కామెయే హేతువు! సేనాధిపతి పదవినుండి నన్నుఁ దొలఁగించి, సమరశిక్ష నా కడఁ బడసిన పరభేజునకు లోఁబడి పని జేయనియమించినను ఆమె ప్రతిహింసాప్రవృత్తి చరితార్థము కాలేదు! ఆ రక్కసి క్రమక్రమముగ నన్నణఁగఁ ద్రొక్కఁ దలఁచుచున్నది. నూర్జహానూ! ఉచ్చప్రత్యాశాగరళము నీ తెల కెక్కినది. దగ్ధవైపోవుటకే నీ చుట్టును మహాగ్నిని రగుల్కొలుపుకొనుచుంటివి! నీ చేతులతో నీ గోతిని ద్రవ్వుకొనుచుంటివి!—'వినాశకాలే విపరీతబుద్ధిః'!—నూర్జహానూ! నీ వినాశము సమీపించినది.

## చతుర్థదృశ్యము

లాహోరు ప్రాసాదాంతఃపురము—ప్రభాతకాలము

నూర్జహాఁ నొంటరిగ మఖమలు తలగడపై

నొరగి కూర్చుండి యుండును.

నూర్జహాఁ—నా జీవన మొక గభీరశూన్యగహ్వరము! నీరు లేకుంటచే దానిని రక్తముతో నింపితిని. శూన్యగహ్వరముకంటె నిదియే

మేలు! నావర్తమాన మొక నిరాశా వైరాజ్యమై యున్నది. ఒక భీషణ హాహాకారంబుచే దాని వ్యాప్త మొనరించి యుంచితిని. అట్లొనర్చకున్న నీ నైరాశ్య నిస్తబ్ధత యసహ్యామై తోచెడిది! క్షణమూరకుండి నాకడనుండి నేనే పారిపోవ బర్వెడితిని! ఇపుడు నా చిత్తము వికారోత్తాపమున బడిపోయినది!—అంకుశ తాడనోన్మాదమున గాక్యము నలువుచుంటిని!

(అసఫ్ ప్రవేశించును)

నూర్జ—అసఫూ! వార్తలేమి?

అసఫ్—మహాబత్ఖాను స్వామముగ వచ్చి శిబిరము వెలుపల నిలువంబడి, చక్రవర్తి దర్శనార్థమై వేచియున్నాడు.

నూర్జ—దర్శనము వలన బ్రయోజన మేమియు లేదని నీ వాతనితో జెప్పుము. పొమ్ము.

అసఫ్—సామ్రాజ్ఞీ! అట్లనుచుంటివేల? అతడు కోరునది దర్శనము మాత్రమే! దాని నొనగుట కే—

నూర్జ—చాలునిక నోరెత్తకుము! నీ యుపదేశము నాకక్కఱలేదు! నాయాజ్ఞల నెరవేర్చుటయే నీపని! ఈ ముహూర్తమందే పాంచాల సీమకు బోవలయునకయు, ఇపుడు దర్శనము వలన బ్రయోజన మేమియు లేదనియు వేగమే పోయి నీవు మహాబత్ఖానున కెఱింగింపుము.

[నిష్క్రమించును.]

అసఫ్—భారతవర్షము యొక్క వర్తమానేతిహాస మొక స్త్రీ స్వేచ్ఛాచార కథయైయున్నది.

[ఈసమయమున జహాంగీ రరుదెంచును]

అసఫ్—(అభివాదన మొనరించును)

జహాంగీరు—అసఫూ! వార్తలేమి?

అసఫ్—సామ్రాజ్ఞి కడ కరుదెంచితిని.

జిహాం—ఏవిషయమున?

అసఫ్—సామ్రాజ్ఞి యాజ్ఞను జూడుఁడు. నే నేమియుఁ బలుక నవసర మేమియు లేదు.

జిహాంగీరు—(పత్రమును జదివి దానిని తిరిగి యిచ్చివేయును)

అసఫ్—ప్రభూ! ఈ యాజ్ఞను నిర్వర్తింపవలయునా?

జిహాం—అవశ్యముగఁ బొమ్ము.

[అసఫ్ నిష్క్రమించును.]

జిహాం—నూర్జహానూ!—గుఱ్ఱమును మిగుల వేగముగ ముందుకుఁ బర్వెత్తించుచుంటివి.

నూర్జహాను—(చక్రవర్తిని గాంచి)—"సార్వభౌమా! ఎంతసేపైనది మీరు వచ్చి?

జిహాం—ఇపుడే—నూర్జహానూ! నాదర్శనాభిలాషివై యరుదెంచిన మహబత్ఖానును నీవు త్రోలివైచితివా?

నూర్జ—అవును. మీదర్శన మొసరింప నతని కేల యనుమతి నొసగ లేదో యెఱుంగుదురా? ఇదిగో! మహబత్ఖానుచే లిఖింపఁబడిన యీపత్రమును చదువుఁడు.

[జిహాంగీ రుత్తరమును దీసుకొని దానిని జదువఁ దొడంగును]

నూర్జ—అతఁ డీపత్రమును తన యల్లునిచేఁ బంపెను. ఉత్తరముఁ గొనివచ్చిన యాచెనటిని దల గొఱిగించి గాడిద నెక్కించి మామ కడకుఁ బంపితిని.

జిహాం—అట్లొనర్పకుండిన యుక్తముగ నుండెడిది!

[పత్రము నొసఁగును.]

నూర్జ—యుక్తముగనుండెడిదా? ఏమియుభయము లేదని తనకుఁజక్రవర్తి జామీ నొసఁగవలయునని లేఖ వ్రాయునా? తా నొక సేవకుఁ

డను మాట మరచి భయము లేక ప్రభువుపై నధికారము సేయఁ బూని నింద్యమగు తిరస్కార మొనరించి విద్రోహమునకుఁ గడంగిన దుర్మార్గుని యల్లునికట్టి మర్యాద సేయకుండుట యుక్తముగ నుండెడిదా?

జిహాం—నూర్జహాన్! నేను పాలుద్రాగు చంటిబిడ్డనైనట్లును నీవు రెండవ బైరమ్‌ఖానువైనట్లును దలంచి, నన్నుఁ జులకనఁజేసి సామ్రాజ్య విషయముల వింతగఁ జర్చించుచుంటివి! రమణీ! మహబ్బత్‌ఖాను సామాన్య మానవుఁడని తలంపకుము! న్యాయశక్తి గర్వములు వాని సొమ్ములు—ఈ మూఁడును భయానక గుణములే యను కొనుము.

నూర్జ—నాపై దేవరకు విశ్వాసము లేనిచో రాజ్యమును మరల మీ చేతులం దుంచుకొనుఁడు!

జిహాం—ప్రియా! విడిచి పెట్టిన దానిని మరలఁ గైకొనను. సామ్రాజ్యము పూర్తిగధ్వంసమైనను కానిమ్ము. నాకుఁ జింత లేదు.

నూర్జహాను—(క్షణకాలము స్తంభితయైయుండి)—నాథా! తామిట్లుంటిరేమి? నాయం దిట్లు విరక్తులై యుండుటకుఁ గతమేమి? ఏమి మార్పు గల్గినది?

జిహాం—విరక్తుఁడనై యుండుట నీయెడలనా? దానికి సాహసించువాఁడు జిహాంగీరా?—ఎట్టి మోహమంత్రంబుచే నన్ను ముగ్ధునిఁ గావించితివో యెఱుంగకుంటిని! కాలభుజంగినీ! ఎట్టి విషాక్త నిశ్వాసముచే నన్ను భిభూతునిఁ జేసితివో నేఁ గ్రహింపఁజాలకుంటిని! నీచే గ్రుంగిపోయి మరల నేనిత్తఱి లేవ నశక్తుఁడనైతిని! దారితప్పి మాఱు త్రోవంబడితిని; ఇపుడు బయట పడుట సాధ్యముగాదు.—నీ యెడ విరక్తుఁడ నెట్లగుదును?

నూర్జ—అట్లైన దేవర నాపైఁ గోపింపలేదా?

జహాం—లేదు లేదు! నూర్జహానూ! మాట వరుసకు మాత్రమట్లంటిని! సామ్రాజ్యమంతయు నీకు సమర్పించితిని. ఇష్టమైన దాని ననుభవింపుము. కష్టమైన దానిని పూర్తిగ ధ్వంసముజేయుము. నాకు లభించిన సామ్రాజ్యముముందు భారత సామ్రాజ్య మెట్టిది?—ఇంక నాట్యమందిరమున కరుగుదము రమ్ము.

నూర్జ—రండు!

జహాం—హృదయేశ్వరీ! సుగానసంగీత సౌందర్యసముద్రమందు భవచ్చుంబ నాలింగన మధుర-స్వనతరంగముల నుద్భవింపఁజేసి యాతరంగాగ్రములపై నన్నుఁ దేలియాడఁజేసి, యీభూమిని నాకుఁ గనుపడకుండ జేయుము. బ్రదికి నన్నాళ్ళు ప్రమోదామోదమ్ములతోఁ గాలము బుచ్చుటే మనకర్తవ్యము!! ఈయైహికజీవనమిందులకే గదా?

పంచమదృశ్యము.

ఉదయపురమున షాజహాను ప్రాసాదము—మధ్యాహ్నకాలము.

మీవారు రాణా యగు కర్ణసింహుఁడును, షాజహాను ను ప్రసంగించుచుందురు.

కర్ణ—ప్రభూ! నాయాతిథ్యమందెట్టి లోపమున్నను మన్నింపుఁడు.

షాజ—లోపమందురా?—జాయాసమేతుఁడనై నేనిట్యెడఁ బొందు సమ్మానమ్మాగ్రాయందుఁ గూడఁ బొందియుండలేదు! కృపాళురై యాశ్రయదాన మొసఁగుటేగాక తాము నాకొఱకై దివ్యభవన మొకటి నిర్మించి, నూతనసింహాసనమున నన్ను గూర్చుండఁబెట్టి నాదేవతాపూజకై చలువరాళ్ళతో మసీదు నొకదానిఁ గట్టించి పరివారసహితముగ నాకనిర్వాచ్యమగు సమ్మానము జేయుచుంటిరి. ఇట్టి మీయుదారాచరణమందెట్టి లోపమైన నుండునా!

కర్ణ—ప్రభూ! మీ కేపుడేమి కావలయును నన్నను, సందేహింపక నాకుఁ దెలుపుచుండుఁడు. మీకు వలసినవాని నొసఁగ శక్తి వంచన లేకుండఁ బ్రయత్నించెదను.

షాజ—నాకుఁ గావలసినవాని నన్నింటిని, నేఁ దెలుపకమున్నే యనుగ్రహ పూర్వకముగఁ దాము నాకొసఁగుచుండిరి.

[మేవారు సేనాధిపతియగు విజయసింహుఁడు ప్రవేశించును.]

కర్ణ—విజయసింహా! విశేషము లేమి?

విజయ—మొగలాయి సేనాధిపతియగు మహబ్బత్ఖాను స్వామిదర్శనార్థమై వేచి యున్నాఁడు.

కర్ణ—ఎవరు! మహబ్బత్ఖానా?

విజయ—చిత్తము మహారాణా!

కర్ణ—సమ్మానపూర్వకముగ నాతనిఁ గొని రమ్ము.

[విజయసింహుఁడు నిష్క్రమించును]

షాజ—వీరాగ్రేసరుఁడగు మహబ్బత్ఖా నాకస్మికముగ నిటకు రాఁగతంబేమి!

[విజయసింహు ననుసరించి, మహబ్బత్ఖాను ప్రవేశించును]

మహబత్—వందేగి షాహజాదా! వందేగి మహారాణా!

షాజ—వందేగి మహబ్బత్ఖాన్!

రాణా—వందేగి సేనాపతీ!

మహబత్—రాణా! నే నిఁక సేనాపతినిగాను.

షాజ—అవును—నీవిపుడు వంగసీమ సుబేదారువు!

మహబత్—అది కూడఁ గాను! సామ్రాజ్ఞి యనుగ్రహముచే నే నా సమ్మానమునుండి తొలఁగింపఁ బడితిని!

షాజ—ఏమేమి! సామ్రాజ్ఞి యాచరణ మెంత ఘోరంబుగ నున్నది. శూరశిఖామణీ! అట్లైన నీవిపుడే పదవి నలంకరించుచుంటివి?

మహాబత్ — ఇపుడు నే నేపదవియందును లేను! — ఇపుడు నేనొక పురాతన రసపుత్ర సైనికుండను! నేను విధర్మిఁ గుట నిక్కమే! — ఆకళంకము నీకుఁ గడిగివై చుట కెట్టి యుపాయమును లేదు! ఏల్లీనన: వేయేండ్లు తపస్సు చేసినను నేనీక హిందువును కాఁజాలను! — ఇంత దనుక మునల్మానుపక్షావలంబినై పోరిన రీతి నీక మీఁద హిందూ పక్షావలంబినై యుద్ధము సలుప వలెనని యాతురపడుచుంటిని!

షాజ — మహాబత్! ఏమి జరిగెనో విశదముగఁ చెలుపుము.

మహాబత్ — ఏమున్నది! — ప్రస్తుతమున సామ్రాట్టు జహాంగీరు కాదు — నూర్జహాను! ఏదోష మెరుగని నన్ను సైన్యాధిపత్యపదము నుండి తొలగించి నాయనుచర యోధుఁడగు పరభేజునకు నొప్పబడి సుబేదారుగా నుండుమని నన్ను వంగదేశమున కంపి, పిమ్మట నేతప్పు లేకుండనే నన్నుఁ బాంచాలసీమ కంపెను. ఒక మాఱు చక్రవర్తి దర్శనము నభిలషించి, యనుమతికై నాయల్లునిఁ జక్రవర్తి శిబిరమునకుఁ బంపగా, నా మానిని యుతనితల గొరిగించి గాడిద నెక్కించి యూరేగించి తిరుగ నాకడ కంపెను! ప్రభువును దర్శింప స్వయముగ నేనే శిబిరద్వారముకడ కరిగి, యవమానింపఁ బడితిని.

షాజ — ఏమి యామె దుష్కృత్యము! ఆశ్చర్య మాశ్చర్యము!

కర్ణ — ఖాన్సాహెబూ! తామాకస్మికముగ నిటకు వచ్చితి రేల?

మహాబత్ — దేవర యధీనమందొక యుద్యోగము నభిలషించి వచ్చితిని. నేఁ బురాతన రసపుత్ర సైనికుఁడను! ప మతస్థుఁడనైననేమి — మీవారు దేశమాత కనుంగు పుత్రుండను! తాము మీవారు దేశాధిపతులు. మీకడ సైన్యాధ్యక్షపదవి లభించు నేమోయను పేరాస చేత నిచటి కరదెంచితిని. దయాపూర్వకముగ నాపదవి దాము నాకొసంగిన, నే నెట్టి మోసమును, ఎట్టి లోప

మును లేకుండ నప్రమత్తుండనై దాని నిర్వహించెదను.

కర్ణ—వీరచూడామణీ! ఈమాత్రమునకుఁ దామింతగ వేఁడవలయునా? మీవంటి విక్రమసింహాలతోడ్పాటు లభించుట మాభాగ్యము! ఈముహూర్తమందే పరమ సంతోషముగఁ దమ్ము మీవారు సైన్యముల కధినాయకుని గావించితిని!

మహబత్—"మీవారు రాణాకు జయమగుఁగాక!" షాజహానునుద్దేశించి—"ప్రభూ! నేను విశ్వాసఘాతుకుఁడనని తలంపకుఁడు! నేను మొగలాయిదాసుఁడనగుట నిక్కము! విధర్మినగుట నిక్కము!! స్వదేశమునకు వ్యతిరేకముగ సమరము సలుపుట నిక్కము!!!—అట్లొనర్చుటకుఁ గారణము నేను సార్వభౌముని యుప్పుదినియుంటినే! ఇపుడు చక్రవర్తికిఁ జెందిన దానిని దేనిని గాని నే ననుభవించుచుంటలేదు! తన చేతితో స్వయముగా సార్వభౌముఁడు మాపూర్వసంబంధ లతికను ఛేదించివైచెను! ఇంతదనుక నేనొక బోనులో నున్న బద్ధభయానకమువలె గర్జించియుంటిని. నేఁడా పంజరమును భేదించుకొని బయట పడితిని. నన్నింతవఱకు మొగలుల పక్షమం దుంచినది మునల్మానుమతమే కాని, మొగల్భక్తి కాదని—నిరూపించుటకు, నాకిపుడు ప్రభు కటాక్షముచేఁ దగిన యదను లభించినది!

షాజహాన్—మహబత్ఖానూ! నీ కోపకారణమును గ్రహించితిని. నూర్జహాను హస్తములందు జనకుఁ డొక యంత్రమువలె నున్నాఁడు! స్వేచ్ఛాచారిణియగు నామె యుచ్ఛృంఖల రాజ్యమం దాత్మాభిమానినైన వాఁ డెవండును వసింపఁజాలఁడు! దానం జేసియే నే నుదయపుర మరుదెంచి, మహనీయుం డగు మహారాణా యాతిథ్యముఁ బడసి సుఖంబుగఁ గాలక్షేపము జేయుచుంటిని. నూర్జహాను గర్వంబడంపఁదలంతు వేని, అంతియ యన

నేల, మొగలాయీల స్వేచ్ఛాచారరాజ్యమును నిర్మూలించి, నీవు పవిత్ర హిందూసామ్రాజ్యమును తిరుగ స్థాపింపదలంతువేని నీకు నేను సంపూర్ణ సానుభూతి నొసంగి, వలయుచో నీయుద్దేశ్యముసు సాధింప నీకుం దోడుపడెదను!

మహబత్—ప్రభూ! తాము మహాత్ములరు! మీరు చూపు సానుభూతికి నేను సదా కృతజ్ఞుఁడనై యుండెదను! [రాణా నుద్దేశించి] రసపుత్రకుల ప్రదీపా! మీసైన్యములో నైదువేలమంది గుఱ్ఱపు రౌతుల నాయనుమానములవఱకు నాయధీనమం దుంచుఁడు.

షాజహాన్—వారితో నీవేమి సేయుదువు.

మహబత్—చక్రవర్తి దర్శనము సంపాదింపఁదలఁచుచుంటిని! అతఁడు నాకు తన దర్శన మొసఁగఁడు!—నానంజేసి నేనే యాతనికి దర్శన మొసఁగెదను!—మహారాణా! నాకేమియు వేతన మక్కఱలేదు! ఇప్పుడు నేఁగోరినదే గొప్పవేతనము! కృపాపురస్సరముగఁ దాము చూపు యనుగ్రహమునకుఁ బ్రత్యుపకృతిగ నేను బ్రతికియున్నంత కాలము మీకడ సేవకుఁడనై యుందును.

కర్ణ—మీవారు సేనాధీశా! మీరు భృత్యులై యుండుట మీవారు దేశమునకుఁ గాని నాకు గాదు! మీ యభీష్టానుసారము ప్రవర్తించుటే నాయభిమతము.

మహబత్—ఇప్పుడు మీసేనానాయకుఁ డెవరు?

కర్ణ—[విజయసింహుని జూపి]—ఇతఁడు. ఈతనిని విజయసింహుఁడందురు.

మహబత్—విజయసింహా! నీ వైదువేల రాజపుత్ర సైనికుల నెన్నుకొనుము. యుద్ధరంగమున జయము సంపాదింపక వెనుదిరిగిపోని యోధులను, ప్రాణముపై నాశలేక యధికముగఁ బ్రసంగింపక క్రియారూపమునఁ దమ శక్తిని వెల్లడించు యోధులను మాత్రమే

పేర్కొనుము!

విజయ—చిత్తము స్వామీ!

మహబత్—విజయసింహా! వారలంగిటు చెప్పినంతనే ప్రాణముల నైన దృజించు వారైయుండవలెను.—మహరాణా! కొంతతడవు విశ్రమింప నాకనుమతి దయసేయుఁడు. మిగుల నలసిపోయి యుంటిని.

కర్ణ—విజయసింహా! ఈయోధవరు నిపుడు విశ్రమాగారములోనికిఁ గొంపోయి, యాతనికి వలయు పరిచర్యల నీవే నలుపుచుండుము. పొమ్ము.

మహబత్—ఇంగిత మాత్రంబుననే వార లసువులఁ ద్యజింపవలయునుమీ! విజయసింహా! తెలిసినదా? మహరాణా! ప్రాణంబుకంటె నాత్మమర్యాద యధికమనిఁ దలంచువారిఁ దప్పక యట్టి మాన్యతయుండితీఱును! ఆదాబ్ (సలామ్)

ఇట్లని మహబత్ఖాను నిష్క్రమించును. విజయసింహుఁడాతని ననుసరించి వెడలిపోవును.

కర్ణ—ప్రభూ!

పాజ—ఏమి రాణా?

కర్ణ—హిందూజాతియేల పడిపోయినదో నే నిపుడు గ్రహించితిని.

పాజ—ఏల?

కర్ణ—మహబత్ఖాను వంటి ధర్మభీరుని, మహీపతిసింహునివంటి కర్మ వీరుని, కొన్ని యాచారములను గూర్చిన వైషమ్యములచే మావాఁడని యాలింగనమాచరించుకొని నిజజాతియందు స్వాగత మొసఁగఁజాలమైతిమని తలఁచునపుడు మాయధఃపతన మేల జరిగినదో విశదమగును. ఎచ్చోట జీవనమున్నదో, యచ్చట నది (Life) బాహ్యవస్తువులను దనలోఁ జేర్చుకొని వానినిఁ దన

వానిని గావించుకొనును. ఎచట మరణమున్నదో యచట నది (Death) శతధాభిన్నమై నలుదెసలఁ బటాపంచలైపోవును! మా వాఁడైన మహాబత్ఖానును మేము పరిత్యజించితిమి—మీరు వానిని మీవానిని గావించుకొంటిరి!—దానం జేసియే మీఁరౌన్నత్య లాభమందితిరి; మేమధోగతిపాలైతిమి! (This passage savours of Burke's political philosophy !)

## షష్ఠదృశ్యము

### ప్రదేశము—సింధునదీతీరము

(స్రవంతి కొక వైపున మొగలైన్యసమేతయై నూర్జహా నుండును. నది యవతలియొడ్డున రసపుత్ర సైన్యముండును. మధ్యమున సేతువుండును. సేతువుపై రాజపుత్రవాహినియుండును. నూర్జహా నేనుఁగునెక్కి యుండును. ఆమె ముందుగ నసఫ్ గుఱ్ఱమెక్కి యుండును.)

నూర్జ—మహాబత్ఖా నైదు వేల సైనికులతో మాత్రమే వచ్చినపుడు మీరందఱు భయకంపితులై యుంటిరా!— సైన్యాధ్యక్షుఁ డెచట?

అసఫ్— అతఁ డావలి యొడ్డున నున్నాఁడు.

నూర్జ—మూర్ఖుఁడు! సైన్యమంతయు నీవలనుండ, నతఁ డావలివైపున నేమి చేయుచున్నాఁడు! ఆవలియొడ్డున కరిగి రసపుత్రుల నాక్ర మింపుఁడని సైనికుల కాజ్ఞాపింపుము.

అసఫ్—సైన్యాధ్యక్షుఁ డిచట లేఁడు.

నూర్జ—నిన్ను సైన్యాధ్యక్షునిగా నియమించితిని.

అసఫ్—సేతుమార్గ మగమ్యమైయున్నది. రసపుత్ర సైనికులు దాని నాక్రమించుకొనిరి!

నూర్జ—అట్లని నే నెఱుఁగకపోలేను. సత్వరమే పోయి రాజపుత్ర

వాహినిని ఛేదించివేయుము.

అనఫ్—అట్లొనర్ప యత్నించిన, మొగలాయి సైనికు లనేకు లడ్డుపడి యెదురు

నూర్జ—మఱియొకసైన్యము—పొమ్ము. ఆక్రమింపుము.

[అనఫ్ నిష్క్రమించును]

నూర్జ—ఏమి యీ మహాబత్ఖాను సాహసము! అయిదువేలసైనికులను మాత్రము వెంటఁగొని, యగణ్యమై నేల యీనినట్లున్న మొగలాయి సైన్యముల తోడను నాక్రమించినాఁడు. ఏమియీవీరుని యసమసాహసము!—ఓ! అదేమిశబ్దము!

సైనికుఁడు—(కుండేలువలె రొప్పుచుఁబ్రవేశించి) సామ్రాజ్ఞీ! మన రాజపుత్రసైన్యమంతయు మహాబత్ఖానుతోఁ గలసినది.

నూర్జ—ఏమి! మన రాజపుత్రసైనికులు శత్రుపక్షము నవలంబించిరా! ఏమి వారి దౌష్ట్యము!

సైనికుఁడు—సమరము సలుపుచు సలుపుచు వార లాకస్మికముగ "జయ్ మహాబత్ఖానుకుజయ్!" అని జయధ్వానము సలిపిరి! వెంటనే వారలందఱొక్కమాఱుగా మహాబత్ఖాను సేనా వాహినులందుఁ గలసిపోయిరి!

[సేతుమధ్యభాగము మండిపోవును].

నూర్జ—సామ్రాట్టింక నావలివైపుననే యుండెనా?

సైనికుఁడు—అవును!

నూర్జ—ముందునకు దుముకుఁడు—అసఫూ!—ఆతఁడేడీ?

అనఫ్—(ప్రవేశించి) సామ్రాజ్ఞీ! మన రాజపుత్రసైన్యము మహాబత్ఖాను సైన్యముతోఁ గలసిపోయినది.

నూర్జ—అట్లని వింటిని. చెప్పవలసిన దింకేమైన నున్నదా?

అనఫ్—రాజపుత్ర సైనికులు సేతుబంధమును దగ్ధమొనరించివైచిరి!

ఆవలి యొడ్డునకుఁ బోవుటకిఁక నుపాయమేమియు లేదు.

నూర్జ—చక్రవర్తి యావలియొడ్డుననే యుండెనా?

అసఫ్—ఆవైపుననే యున్నారు.

నూర్జ—ఈఁతకొట్టి నదమును దాటుఁడు! రసపుత్రులఁ దునుమాడుఁడు!

అసఫ్—సామ్రాజ్ఞీ—

నూర్జ—ఇఁక నేమియుఁ బలుకకుము—పోయి, చెప్పినట్లాచరింపుము.

[అసఫ్ నిష్క్రమించును.]

[సైనికులు నీటదుమికి యీదుకొని పోవసాగుదురు.]

మహాబత్ఖాను యొక్క సైనికులు సేతువును వదలిపెట్టి యావలి వైపున కరుదెంచి, ఆ సైనికులపై ఫిరంగులఁ గాల్చుదురు.

నూర్జహా—(ఆవలివైపునుండి దానిని జూచు మావటివాని నుద్దేశించి), "మావటీడా! ఏనుఁగు నావలివైపునకుఁ దోలుము"

మావటీఁడు—చిత్తము.

నూర్జ—నడుపుము.

[తెరమారును.]

దృశ్యాంతరము

సింధునదీతీరమునఁ జక్రవర్తి శిబిరము—ప్రభాతకాలము
శిబిరద్వారపార్శ్వమున నిరువురు ప్రతీహారులు
నిలువఁబడి యుందురు.

ప్రతీహారులు—ఇదేమి! ఈ యల్లరి యేమి?

ఇరువురు సైనికులు—(వేగముగఁ బర్విడి వచ్చి,) "ఎక్కడ? ప్రతీహారులారా! పాదుషా యెచట?"

ప్రథమప్రతీహారి—ఏమైనది? వెలుపల నింత యల్లకల్లోల మేమి?

ప్రథమ సైనికుఁడు—పాదుషా యెచట? త్వరగాఁ జెప్పుము.
ప్రథమప్రతీహారి—ఏమి జరిగినదో ముందు జెప్పుము.
ద్వితీయసైనికుఁడు—వెనుకనుండి రాజపుత్రసైనికులు శిబిరము నాక్రమించినారు.
ప్రథమప్రతీహారి—అదేమి! అదేమి!! ఏ రాజపుత్రసైనికులు?
ద్వితీయప్రతీహారి—సైనికులెందఱు?
ద్వితీయసైనికుఁడు—అయిదు వేలు! పోయి చక్రవర్తి కిపుడే విన్నవింపుఁడు.
ద్వితీయప్రతీహారి—మన సైనికులేరి?
ప్రథమసైనికుఁడు—అందఱావలి వైపున నున్నారు.
ద్వితీయప్రతీహారి—వారల కీకబురు తెలియలేదా?
ద్వితీయసైనికుఁడు—తెలిసినది—ఇఁకఁ బోయి చక్రవర్తికి వార్తఁ దెలుపుము. ఇఁక సమయములేదు!
ప్రథమప్రతీహారి—చక్రవర్తి కడకు నేఁ బోయెదను.

[నిష్క్రమించును.]

ద్వితీయప్రతీహారి—మన సైనికు లీ వైపున నెందరున్నారు?
ప్రథమసైనికుఁడు—వేయిమంది కంటె నెక్కుడుండరు.
ద్వితీయప్రతీహారి—వారలేమి చేయుచున్నారు?
ప్రథమసైనికుఁడు—యుద్ధ మొనరించుచుఁ బ్రాణముల విడచుచున్నారు. అంతకంటె విశేషమేమి చేయుదురు? రాజపుత్రసైనికులు వెఱ్ఱెత్తి పోయియున్నారు. మహాబత్ఖాను వారల నాయకుఁడై శేషునివలె గయ్యము నలుపుచున్నాఁడు.

[నేపథ్యమున మేఘధ్వానము వినంబడును]—అవిగో! అవిగో!! హాహాహా!

ద్వితీయసైనికుఁడు—ఇరిగో! వచ్చిపడిరి.

ఆవలి యొడ్డునకుఁ బోవుటకింక నుపాయమేమియు లేదు.

నూర్జ — చక్రవర్తి యావలియొడ్డుననే యుండెనా?

అసఫ్ — ఆవైపుననే యున్నారు.

నూర్జ — ఈతకొట్టి నదయును దాటుఁడు! రసపుత్రులఁ దునుమాడుఁడు!

అసఫ్ — సామ్రాజ్ఞీ —

నూర్జ — ఇఁకనేమియుఁ బలుకకుము — పోయి, చెప్పినట్లాచరింపుము.

[అసఫ్ నిష్క్రమించును.]

[సైనికులు నీటదుమికి యీదుకొని పోవసాగుదురు.]

మహాబత్ఖాను యొక్క సైనికులు సేతువును వదలిపెట్టి యావలివైపున కరుదెంచి, ఆ సైనికులపై ఫిరంగులఁ గాల్చెదరు.

నూర్జహా — అవలివైపునుండి దానిని జూచు మావటివాని నుద్దేశించి), "మావటూతూ! ఏనుఁగు నావలివైపునకుఁ దోలుము"

మావటుతుఁడు — చిత్తము.

నూర్జ — నడుపుము.

[తెరమారును.]

దృశ్యాంతరము

సింధునదీతీరమునఁ జక్రవర్తి శిబిరము — ప్రభాతకాలము
శిబిరద్వారపార్శ్వమున నిరువురు ప్రతీహారులు
నిలువఁబడి యుందురు.

ప్రతీహారులు — ఇదేమి! ఈ యల్లరి యేమి?

ఇరువురు సైనికులు — (వేగముగఁ బరుగిడి వచ్చి,) "ఎక్కడ? ప్రతీహారులారా! పాదుషా యెచట?"

ప్రథమప్రతీహారి — ఏమైనది? వెలుపల నింత యల్లకల్లోల మేమి?

ప్రథమ సైనికుఁడు—పాదుషా యెచట? త్వరగాఁ జెప్పుము.

ప్రథమప్రతీహారి—ఏమి జరిగినదో ముందు జెప్పుము.

ద్వితీయసైనికుఁడు—వెనుకనుండి రాజపుత్రసైనికులు శిబిరము నాక్రమించినారు.

ప్రథమప్రతీహారి—అదేమి! అదేమి!! ఏ రాజపుత్ర సైనికులు?

ద్వితీయప్రతీహారి—సైనికులెందఱు?

ద్వితీయసైనికుఁడు—అయిదు వేలు! పోయి చక్రవర్తి కిపుడే విన్నవింపుఁడు.

ద్వితీయప్రతీహారి—మన సైనికులేరి?

ప్రథమసైనికుఁడు—అందఱు ఆవలి వైపున నున్నారు.

ద్వితీయప్రతీహారి—వారల కీకబురు తెలియలేదా?

ద్వితీయసైనికుఁడు—తెలిసినది—ఇఁకఁ బోయి చక్రవర్తికి వార్తఁ దెలుపుము. ఇఁక సమయములేదు!

ప్రథమప్రతీహారి—చక్రవర్తి కడకు నేఁ బోయెదను.

[నిష్క్రమించును.]

ద్వితీయప్రతీహారి—మన సైనికు లీ వైపున నెందరున్నారు?

ప్రథమసైనికుఁడు—వేయిమంది కంటె నెక్కుడుండరు.

ద్వితీయప్రతీహారి—వారలేమి చేయుచున్నారు?

ప్రథమసైనికుఁడు—యుద్ధ మొనరించుచుఁ బ్రాణముల విడచుచున్నారు. అంతకంటె విశేషమేమి చేయుదురు? రాజపుత్రసైనికులు వెఱ్ఱెత్తి పోయియున్నారు. మహాబత్ఖాను వారల నాయకుఁడై శేషునివలె గయ్యము నలుపుచున్నాఁడు.

[నేపథ్యమున మేఘధ్వానము వినంబడును]—అవిగో! అవిగో!! హోహోహో!

ద్వితీయసైనికుఁడు—ఇదిగో! వచ్చిపడిరి.

యుద్ధ మొనరించుచు మహాబత్ఖాను చక్రవర్తుల సైనికులు ప్రవేశింతురు. నిజసైన్యము వెనుక మహాబత్ఖాను నిలువంబడియుండును.

మహాబత్—"ఇంక వధింపకుఁడు"—(సైనికులు, యుద్ధమును విరమించి నిలువంబడగనే) "మొగలైసైనికులారా! అస్త్రపరిత్యాగ మొనరింపుఁడు. లేకున్న, మిమ్ముల పృథగ్ జంపవలసి వచ్చును. మీ ప్రాణములఁ దీయుట నా కిష్టము లేదు. నాకుఁ జక్రవర్తి మాత్రమే కావలయును. బ్రదుకుపై నాశ యున్నయెడలఁ గత్తుల నొరయందుంచుఁడు.

(చక్రవర్తి సైనికు లస్త్రపరిత్యాగ మొనరింతురు)

మహాబత్—ఇంక జక్రవర్తినిఁ బిలువుఁడు.

(జహాంగీరు ప్రవేశించును.)

జహాం—ఈ యల్లకల్లోలమంతయు నేమి?—ఎవరు!—మహాబత్ఖానా?

మహాబత్—అవును ప్రభూ!

జహాం—మహాబత్ఖానూ! దీనియర్థమేమి? ఏమిజరిగినది? ఈ వేషమేమి?

మహాబత్—ఇట్లు గాకున్న మఱియొక యుపాయమునఁ జక్రవర్తి దర్శనమబ్బుట యసంభవమని తలంచితిని! మన్నింపుఁడు. సార్వభౌముని దర్శనము మహాబత్ఖానునకు లభింపఁ జాలదని సామ్రాజ్ఞి సెలవిచ్చినతఱి, మహాబత్ఖానునకు సార్వభౌముని దర్శనము లభించి తీఱవలయునని మహాబత్ఖాను ప్రతినఁబూనెను! ప్రార్థన కంటె యుక్తియే బలవత్తరమని యెఱుంగుదును! కాని ఫిరంగి శబ్దము ముందున్నా రెండును దీసిపోవునని కూడ నే నెఱుంగుదును.

జహాం—నాసైన్యమంతయు నేది?

మహాబత్—ఆవలి వైపుననున్నది. ప్రభూ! వారలింక నీ యొద్దనకు రాఁజాలరు. వారల యాశ వదలుకొనుఁడు. నేను సేతు బంధమును దగ్ధము గావించివైచితిని!

జహాం—అటులనా!—గ్రహించితిని. మహాబత్! నీ యీ దుండగములు మన్నించితిని ఇఁక నీసైనికులకు సెలవొసంగుము—మాటాడ వేమి?

మహాబత్—ప్రభూ! మీరు నాకభయ మొసంగుదనుక వీరు వెడలి పోవరు.

జహాం—నీ యభిప్రాయ మేమి?

మహాబత్—'మహాబత్ఖాను, తాముదూదూ!' యని పిలువగనే దోఁకాడించుచు, దగ్గఱఁ జేరి, 'ఛీ, ఛీ' యని తన్నినవైపుఁ దోఁక ముడుచుకొని పారిపోవు పెంపుడుకుక్క కాదని మీకుఁ దెలియఁ జేయుటే నాయభిప్రాయమ్ము!

జహాంగీరు (బొమలు ముడివైచి)—మహాబత్! నీకు నే నెంతయో దుర్న్యయము సూపుట నిక్కువమే!—నీ కిపుడు వలయు జామీ నేమో తెల్పుము.

మహాబత్—దేవర మృగయా సమయము సమీపించినది. ఇపుడు వేటకై వెడలి, జామీను విషయమై పిదప నాలోచింతము.

జహాం—వేటకా?

మహాబత్—అవును.

జహాం—ఇచట నా వేటగుఱ్ఱము లేదు.

మహాబత్—నే నొసఁగు చుంటిని—విజయసింహా! సార్వభౌముని కొఱకై నాసర్వోత్కృష్టమైన యశ్వమును గొనిరమ్ము. నిక్కముగ నా సైంధవము భారతాధిపునకుఁ దగినది! సైన్యసమేతముగ నీవు సామ్రాట్టు పార్శ్వరక్షకుఁడవై యుండవలయును. ఇఁకఁ బోయి గుఱ్ఱమును గొనిరమ్ము.

[విజయసింహుఁడు నిష్క్రమించును.]

మహాబత్—ప్రభూ! మనము మెల్లగఁ బోదమురండు.

జహాంగీరు — బామబంధుఁడవైతివి — తెలిసినది! నన్నే నీవు జామీనుగ నుంచుకొనఁ దలఁచుచుంటివి — అట్లైన నేను నీ ఖైదినా?

మహబత్ — స్వామీ! పూర్తిగ నట్లని చెప్పఁజాలను! కాని, ప్రస్తుతము నన్ను దేవర పూటవరుసను గా నధీనమునం దుంచవలెను. ప్రభూ! తాము భారతాధీశ్వరులు! — అక్బరు మహాత్ముని నందనులు! — కాని, మీ ప్రభుత్వమిప్పుడొక త్రాగుబోతు వాని యాధాచరణమై యున్నాఁడని ప్రలాపమై, యుచ్ఛృంఖల స్వేచ్ఛాచారమై పోయినది. మీ రెవరు? — ఎందుండి వచ్చితిరి? — అన్యాయ శాసన కార్యదక్షులైన తామెట్టి యధికారమున నొక పురాతన సభ్యజాతి నేల నేలఁగను చున్నారు. హిందువులీ సామ్రాజ్యమును గోల్పోవుటకుఁ గారణము వారలకింక నాశ లేకపోవుటే! — వారల వాసనలన్నియు నూర్ధ్వమునకు జూపి యుందున్నవి! ఆముష్మికైశ్వర్యమే యధికమని తలంచి, వారలైహికసంపత్తును విడిచిపెట్టిరి. దేవర యింకను దుర్న్యయశాసన మొనర్చుట చాలించక కాంతాప్రేరితులై రాజ్యపాలనమును ఘోర దౌర్జన్య భూయిష్టమొనరించి యట్టి హిందువుల యుదాసీన భావమును రేపితి రేని, నిమేషంబులో నీ విపుల మొగల్సామ్రాజ్య మంతయుఁ బ్రభాతమందలి మంచుతెరవలె శూన్యమందు విలీనమై పోవునని యెఱుంగుఁడు. — ఇఁక రండు!

## సప్తమదృశ్యము.

ఆగ్రాయందలి చక్రవర్తి యంతఃపురము — సాయంకాలము.

లయిలా శర్యారులు ప్రసంగించు చుందురు.

శర్యార్ — సతీ! జనకుని వార్త వింటివా?

లయిలా — లేదు. వినలేదు.

శర్యార్—అతఁ డిపుడు మహాబక్షాను కరములందుఁ గైదీయై యున్నాఁడు! నీ జనని యేమాయెనో యెఱుంగుదువా?

లయలా—ఏమాయెను?

శర్యార్—ఆ గజగామిని యేమునెఁగుక్కి సింధు నదమునుదాటఁ బ్రయత్నించెను. కాని, యామె తిరిగి రావలసి వచ్చెను!

లయలా—తరువాత?

శర్యార్—అసఫ్ సాయముఁగొని, చాలచోటుల నామె రణంబు సలిపెను. కాని మహాబక్షాను యోధులచేఁ బూర్తిగఁ బరాజితయై, తుదకు లొంగి, చక్రవర్తినలె నిపుడు తానుగూడ. నా వీరుని యధీనమునఁ గైదీయై యున్నది.

లయలా—శభాస్!—పాపమునకు ఫలమారంభమైనది! — ఈశ్వరుఁడు లేక పోలేదు!

శర్యార్—లయలా! నీ నడత నా కొకించుక—

లయలా—యద్భుతమై యుండును!—కాదా? దానం జేసియే మిమ్ము నే నింతగాఁ బ్రేమించుచుంటిని!

శర్యార్—నీ చరిత్ర నాకత్యద్భుతముగ గన్పట్టుచుండుటం జేసియే నన్నుఁ బ్రేమించు చుంటివా?

లయలా—కాదు, తామద్భుతులై యుండుటంజేసి తమ్మధికముగఁ బ్రేమించు చుందును.

శర్యార్—బహు దినంబులనుండి నీ సంసర్గమందున్నను, నిన్ను నేను గ్రహింపలేకుంటిని.

లయలా—గ్రహింపజాలరు! ప్రియతమా! ఒకప్రశ్న వేసెదను క్షమింపుఁడు—నన్నుఁ గాకున్న మీ రెవరినైన గాని గ్రహింపఁగలిఁగితిరా! మీ సోదరులను గాని, మీ జనకునిగాని, బాగుగ గుఱుతింపఁగలిగితిరా?

శర్యార్—కలిఁగిపిననియే తలంచుచుంటిని!

లయలా—కలిఁగితినని తలంచుచుంటిరా?—నాబంగారు చంద్రుఁడా! మీరు భ్రమపడితిరి! నేఁటివఱకొకరి నొకరు గ్రహింపఁజాలకపో యితిమి. పృథివియందలి ప్రతిమానవుని చరిత్రం బాదుఁగొంతగాక పోయినఁ గొంతయైన నొరులకుఁ జిరాంధకార సంకాశంబై యుం డును! ఈశ్వరుఁడు దయామయుండగుటం జేసి, యిట్టి విధానముఁ గావించెనని తోఁచెడిని! ఆకస్మికముగ నొక్కనాఁడు ప్రపంచమం దలి ప్రతిమానవుని యంతర్గతము వెల్లడియగుచో నీ జగంబెంత బీభత్సమై కన్పట్టును!—ఈశ్వరా! నీ జగతి యందిదిగాక మఱొక నరకముండునా?

శర్యార్—నీవు వచించు నదేమో నాకు బోధపడుటలేదు.

లయలా—అట్లొనర్చు కొన యత్నింపకుఁడు. ఏమియు గ్రహింపఁ జాలకపోవుటే మీ చరిత్ర మాధుర్యమునకు హేతువు!—దానినిఁ గోల్పోవకుఁడు! దానిం బోగొట్టుకొనిన, మీ యందిఁక ప్రేమపా త్రంబగు నదేమియు నుండదు! [నిష్క్రమించును]

శర్యార్—ఇన్నినాళ్లు గడచినను లయలా నన్నుఁ బ్రేమించుచు నుం డెనో, లేక తిరస్కరించుచుండెనో గ్రహింపఁజాలకుంటిని! కాని, యామె జూపుచున్న యిట్టి గ్రహింపరాని యనాదరణము నేనిఁక సహింపఁజాలను. ఇది నాకుఁ గిట్టదని యీ మాటామెకు గట్టిగఁ జెప్పివైచెదను!

## అష్టమ దృశ్యము

సామ్రాట్టు శిబిరము—ప్రభాత కాలము.

మహాబత్ఖా నేకాకియై శిబిరములోనఁ బచారుఁ గావించుచు. నేదియో యాలోచించుచుండును.

మహాబత్—అమె మరణించుటచే యుత్తమము! సామ్రాజ్ఞీస్థానమున

నుపస్థిష్టమై, సామ్రాట్టుపరివార మందామె విచ్ఛేదవిగ్రహాశాంతుల నుద్భవింపఁజేసినది. సామ్రాజ్యమందు విలాసమును, అత్యాచారమును విచ్చలవిడిగా నుద్భవింపఁజేసినది. పృథివియందు సహింపరానిస్పర్థను, స్వేచ్ఛాచారకలుషంబులను గలుగఁజేసినది. అట్టి కాంత నిక్కముగ మరణింపవలయును! రాజపరివారమునకు సామ్రాజ్యమునకు, మానవజాతికిశుభముకల్గుటకై యామె యంత మొందవలయును! ఎంత శీఘ్రములో నంత మొందిన నంత యుత్తమము! నేఁడే యామె కృతాంత మందిరము నేరవలయును!—అదుగో! చక్రవర్తి యిక్లే వచ్చుచున్నాఁడు.

[జహాంగీరు ప్రవేశించును.]

మహాబత్ఖాను—(తలవంచి చక్రవర్తి కభివాదన మొనరించును)

జహాం—మహాబత్ఖానూ! నీ యభిప్రాయమేమి ?

మహాబత్—ఒకమాఱు దేవరదర్శనము నభిలషించితిని—ప్రభూ! దయచేయుఁడు!

జహాం—(కూర్చుండి)—మంచిది. నీయభిప్రాయమేమో తెలుపుము,

మహాబత్ఖాను—[క్షణకాలము నిస్తబ్ధుఁడై యుండి మెల్లగ] ప్రభూ! నా విన్నపమును వెల్లడింపకమున్నే యొక విషయముఁ దెలుపుటావశ్యకమని యోచించుచుంటిని! దేవరను నా యధీనమందుంచుకొని యేలికనైనాచిత్తమువచ్చిన తెఱంగునఁ బ్రవర్తించుచుంటినని తాము తలపకుఁడు! [ఒకించుక నీరవుఁడై] స్వామీ! నా యభియోగ (Accusation or charge) మొకటి గలదు. న్యాయవిచారణము మాత్రము నేఁ గోరుచుంటిని!

జహాం—నీ యభియోగ మెవరిని గూర్చి?

మహాబత్—(మరలక్షణకాలము నిస్తబ్ధుఁడై)—నేనే కాంతకు ప్రతికూలముగ నేఁడభియోగ మొనరించుచుంటినో, యామెరూపము

నామె పదవి నామెయన్యగుణములనన్నిటిని మీరు మఱచిపోవల యునని నాప్రార్థన. ఆమెదోషురాలౌనో కాదో యని మాత్రము విచారింపుఁడు. అపరాధినియని గ్రహింపఁగలుఁగుదురేని, యామె కుచితదండన మొసఁగుఁడు—ఇదియే నా ప్రార్థన!

జిహాం—మంచిది! నీ యభియోగ మెవరిపైన?

మహాబత్—భారతసామ్రాజ్ఞియైన నూర్జహానుపై.

జిహాం—అట్లని ముందే గ్రహించితిని! ఇఁక నీయభియోగ మేమో తెల్పుము.

మహాబత్—ప్రథమాభియోగ మేమన, రహిమానుదాజాచే యువరాజు ఖుస్రునుహతం బొనరించి పిమ్మట రీనాసామ్రాజ్ఞిహరణమునకామె కారణ మయ్యెను!

జిహాం—ఖుస్రూ! అభాగ్యనందనా!

మహాబత్—ద్వితీయాభియోగ మేమన, తనరహస్యాభిసంధిని సాధించుటకై యామె, యాదోషమును నిర్దోషియైన సాజహాను తలపై మోపి, యాతనిని విద్రోహిత్త్యజితుని గావించెను! తదుపరి—

జిహాం—తదుపరి యేమి?

మహాబత్—తృతీయాభియోగ మేమన తన స్వేచ్ఛాప్రవృత్తిని గప్పిపుచ్చుటకై మీ పేరు బెట్టుకొని మీ శుభ్రయశస్సును గళంకిత మొనర్చుచున్నది. ఈ మూఁడు దోషములందొకటియైన నిజంబుకాదని తాము దలంచుచో సంతోషముగ సామ్రాజ్ఞిని విడిచి పుచ్చుఁడు!

జిహాం—ఆమె యపరాధినియే యైన నేమొనర్చవలయునదేమి?

మహాబత్—అపరాధికి దండన మొసంగుటే కర్తవ్యము!

జిహాం—(నీరవుఁడై యుండును.)

మహాబత్—ఈ యపరాధములకుఁ దగుదండనము మృత్యువే!

జహాం—మహాబత్ఖానూ! నేఁ జెప్పుదానిని వినుము. ఆమె—

మహాబత్—న్యాయవిచారణ మొనరింపుఁడు. ధర్మపథము నతిక్రమింపకుఁడు?

జహాంగీరు—(నీరవుఁడై యుండును.)

మహాబత్—దేవర విచారణమున సామ్రాజ్ఞికిది యుచితదండనమా నా కాదా?

జహాం—అవును ఆమె కుచితదండనము మృత్యువే!

మహాబత్—అట్లైన స్వామీ మరణశిక్షాపత్రమున సంతక మొనరింపుఁడు! (లేఖినిని పత్రమును ముందిడును)

జహాం—కాని,—

మహాబత్—ప్రభూ! తాము విచారణ సలిపితిరి! ఇఁకమిగిలిన కార్యము శిక్షించుటయే!—సంతక మొనరింపుఁడు!

జహాంగీరు—(మాఱుపలుకక సంతక మొనరించును.)

మహాబత్—విజయసింహా!—

(విజయసింహుఁడు ప్రవేశించును)

మహాబత్—నీవుపోయి యీ యాజ్ఞాపత్రమును శిబిరమందున్న నూర్జహాను సామ్రాజ్ఞి కొసఁగుము. తదనంతరమున నీవేస్వయముగ నీయాజ్ఞాపాలన మొనరింపుము. రెండవయాజ్ఞకై వేచియుండ నక్కఱలేదు!

(ఆజ్ఞాపత్రముతో విజయసింహుఁడు నిష్క్రమించును.)

మహాబత్—(జహాంగీరునుద్దేశించి)—ఇది దేవరతీర్మానము!—తాముస్వయముగ రాజ్యమునుఁబాలించు నంతకాలము శత్రువైనను మీకు మాఱుమాటాడలేదు. అందులకుఁదమపాలనము న్యాయభూయిష్ఠమైయుండుటే కారణము! కాని కాలక్రమమున దేవర యశశ్చంద్రుని నూర్జహాను ప్రభావరాహువు మ్రింగివైచెను! ఆ

రాహుగళంబునుండి తమ రాజును విడిపించుటయే భృత్యుల కర్తవ్యము! మేము గోరునది విశేషంబేమియు లేదు—జహంగీరు ప్రభువును బడయుటే మా వాంఛ! అది పూర్ణమైన యనంతరమే మా కార్యము ముగియును!

జహాం—(మారుమాటాడక తలవంచుకొని యుండును).

విజయసింహుఁడు— (మరలఁ బ్రవేశించి) మరణించుటకుఁ బూర్వ మొకమారామె సార్వభౌముని జూడఁగోరుచున్నది.

జహంగీరు—(మహాబత్ఖాను ముఖమును విలోకించును.)

మహాబత్—దర్శనమా! దర్శన మెందులకో యడిగిరమ్ము!

విజయసింహుఁడు నిష్క్రమించును.

జహంగీరు—(నీరవుఁడై, తలవంచి నేలఁజూచుచుండును).

మహాబత్—నూర్జహా నెట్టిమంత్రబలంబున మీవంటి న్యాయపరతంత్రులను మ్రింగివైచుచున్నదో యెఱుఁగఁజాలకుంటిని!—కాని ఆ కాంత యంత మొందిన పిమ్మట, ఇపుడు మిమ్మావరించియున్న నల్లమబ్బు తొలఁగిపోయి మీరే,—తప్పక నాకు ధన్యవాద మొసఁగుదురని నేనెఱుఁగుదును!

విజయసింహుఁడు—(తిరిగి ప్రవేశించి) "మృత్యుముఖమునఁ బడుటకు ముందొకమాఱు భార్య భర్తను జూడఁగోరుట ధర్మమని యామె పల్కినది."

మహాబత్—మంచిది. ఆమె నిచటికిఁ గొనిరమ్ము.

విజయసింహుఁడు—(నిష్క్రమించును)

మహాబత్ఖాను—స్వామీ! జాగరూకులై యుండుఁడు!—సామ్రాజ్ఞిని జూడఁగనే మరల మంత్రముగ్ధులు కాకుఁడు. అప్రమత్తులరై యుండి, మనసును గట్టిపఱచుకొనుఁడు. జహంగీరు సార్వభౌములని తామ జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు!

(విజయసింహు ననుసరించి నూర్జహాను (ప్రవేశించి) యభివాదన మొనరించును.)

నూర్జ—ఈ సంతకము మీదేనా?

జిహాంగీరు—(మాఱుమాటాడక యూరకుండును.)

నూర్జ—అట్లైన నిది మాయకాదు! ఈ అక్షరములు నిక్కముగ జిహాంగీరు సార్వభౌమునివి కావేమో యని తలంచితిని. ఏలనన ఇంతకుముందు దిట్టిదిసంభవమని తలంపలేదు! ఇచటికి రాకపూర్వము కూడ నిది విశ్వసనీయము కాదని యోచించితిని. కాని యిపుడు సత్యము విశదమైనది— సత్యమే యని గ్రహించితిని! ఇఁక నేను చెప్పవలసిన దేమియు లేదు! ప్రభూ! ఇవు డాసన్నమైన మృత్యువు నన్ను రవంతైన దుఃఖపెట్టుటలేదు. ప్రాణనాథుని చేతులలో మరణించుట బ్రహ్మానందమే యగును. అట్టి మృత్యువు నాకతిప్రియంబు! నా ప్రాణేశ్వరుఁ డొసంగిన వరమని తలంచి నేనామృత్యువు నాలింగన మొనరించుకొందును! ఏకరము నామరణ శిక్షాపత్రమునందు సంతకము కావించెనో,—ఆ హస్తమును, నా ప్రాణాధికుని యాహస్తమును చచ్చుటకు మున్నొకమారు ప్రేమపూర్వకముగ ముద్దు బెట్టుకొని పిమ్మట మహానందముతోఁ జచ్చిపోయెదను. ప్రియతమా! ఇదియే నా కడసారి ముద్దు. (జిహాంగీరు కరమును ముద్దిడుకొనును).

జిహాం—మానినీ! ఈ సంతకము నాయది కాదు!

నూర్జ—ఏమి! ఇది దేవరసంతకముకాదా?

జిహాం—నూర్జహానూ! నీతలపై వేయినేరముల భారమున్నది! కాని వానిని నే నించుకైనఁ బాటింపలేదు. ఆ యపరాధముల నేను లక్ష్యంపనైనలక్ష్యంప లేదు! ప్రాణాధికుండైన పుత్రునిహత్యను, ప్రాణసమయగు ప్రాణేశ్వరి చావును, మాఱుమాటాడక సహించితి

నని యెఱింగిన నీ వీచేవ్రాలు నాదికాదని గ్రహింపఁజాలకపోవు! ఈవ్రాలొనర్చినది నా హస్తమే!—కాని, యీచేవ్రాలు మహబత్ఖాను చేవ్రాలు!

నూర్జ—(మహబత్ఖానుపై దృక్కులఁబఱపి)—తెలిసినది! ఇఁక నేఁ జెప్పునదేమియులేదు. మహబత్ఖానూ! నీవు గెల్చితివి!—ఎప్పుడీవు జిహాంగీరు కరంబుతో నూర్జహానుమరణాజ్ఞాపత్రంబుపైఁ జేవ్రాలుఁ జేయించి, పృథివియందెవరును నలుపఁజాలని కార్యంబొనరించితివో, యపుడే నా పరాజయము సంపూర్ణమైనది. (మహబత్ఖానువైపుగ నొకించుక తలవంచి)—కాని, మహబత్ఖానూ! ఈ జయము నీకు గౌరవదాయకము కాదు!—నేను అబలనగు నాడుదానను. నీవు వీరుండవు; పురుషుండవు! నే నెట్టిదాననైన నాడుదానను! ఈ విజయమునందు నీపౌరుష మేమియు లేదు. తలవంచి నా పరాజయమును నేనొప్పుకొందును! (జిహాంగీరు నుద్దేశించి)—నాథా! నాకు సెలవొసంగుఁడు! ఈ జీవన రాజ్యమునుండి యిపుడే మరణసీమ కరిగెదను! ఈ తేజోలోకమును వీడి, యంధకార గహ్వరమును జొచ్చెదను; యీ యుత్సవ మందిరమునుఁ ద్యజించి నిస్తబ్ధజగతియందుఁ బ్రవేశించెదను! హృదయేశ్వరా! నాకిఁక సెలవొసంగుఁడు!

(మోకరించును.)

జిహాం—(లేచి, నూర్జహానును లేవఁదీసి, యామెను నిజవక్షమునఁ జేర్చుకొని)—నూర్జహానూ! సుందరీమణీ! నాజీవనతేజమా! నా మనోహారిణీ! నా యిహలోక సర్వస్వమా!

నూర్జ—(ప్రియతముఁడగు దేవరప్రేమాలోకము నా మృత్యుపథమును నాకు జూపించుఁగాక!—ప్రాణేశ్వరా! మరణమనిన భయము నా కిసుమంతయైన లేకున్నను,—సత్యమేసుమా,—చచ్చిపోవుట

నాకిష్టములేదు. చావఁగోరు వారెవరు. ఎవ్వఁడు చిరరోగియై శల్యావశిష్టుఁడై దుర్భర వేతనలఁ గృశించునో ఎవ్వఁడు చిరనిర్వాసితుఁడై యొంటరిగఁ గష్టభూయిష్ట జీవనము నలుపునో,—యెవ్వని కీపృథివియందుఁ గావలసినవా రెవ్వరును లేరో, యెవ్వఁడు సర్వభ్రష్టుఁడై యెప్పుడును దీరని యాకటబాధ పడుచుండునో యెవ్వనిని మానవులు పూర్తిగఁ బరిత్యజించివైచిరో,—యెవ్వని నీశ్వరుఁడు శాపాయుధాఘాత పరంపరలచే గాసిలఁజేసి పెడమొగము వెట్టుకొనెనో,—అతఁడుకూడ మరణింపఁగోరఁడు! [కంపిత స్వరమున]—నేను సర్వభ్రష్టనుగాను! సర్వాంగసుందరినై, యనుపమ లావణ్యోపేతనై, యతులైశ్వర్యసంయుతనై, దేవునివంటి హృదయేశుఁ బడసి సర్వసౌఖ్యముల ననుభవించుచుంటిని! [డగ్గుత్తికతో]—మనోహరా! నాకింకను బ్రతుకుపై గలయాశఁ దీరలేదు! భోగవాసన తృప్తికాలేదు! ప్రణయవాంఛ యుడుగ లేదు! నే నింకను సౌఖ్యవారాశి వీచికలపై నీఁదులాడఁ గోరుచుంటిని! పుష్పోద్యానముల విహరింప వేడుక పడుచుంటిని! ప్రమోదపర్యంకమున హాయిం బొందఁ నభిలషించుచుంటిని! నాధా! వల్లభా!! ప్రియతమా!!! జీవితేశ్వరా!!!! [జహాంగీరు వక్షముపైఁ బడి వెక్కి వెక్కి యేడ్వదొడంగును.]

జహాంగీరు [విషణ్ణముఖుండై, జాలిఁగొలుపు దృక్కుల మహాబత్ఖాను పైఁ బఱపుచు, గద్గదస్వరమున]—తండ్రీ! మహాబత్ఖానూ,—(అని యేమియుఁ బలుకనేర కూరకుండును).

మహాబత్—ఏమి ప్రభూ!

జహాం—ఒక మనవి!—

మహాబత్—ప్రభూ! సెలవిండు! భారతాధీశ్వరుని యెట్టియాజ్ఞనైన వినయవిధేయుఁడగు మహాబత్ఖాను శిరసావహించి నెరవేర్చునని

ప్రతిజ్ఞ గావించుచున్నాను.

జిహాం — మహాబత్ఖానూ! నేనే వినయపూర్వకముగ నీమె ప్రాణభిక్ష వేఁడుచుంటిని — చూడు షూమె విలపించుచున్నది! తండ్రీ! ఒక్కించుక కరుణజూపుము!

మహాబత్ — ప్రభూ! మంచిది! — సామ్రాజ్ఞీ! నీకు విడుదల యొసఁగితిని. ఇఁక వంతమానుము! — నూర్జహానూ! మానవాతీతమైన నీ బుద్ధిబలమును, నీ యసాధారణ సౌందర్యమును, నీ విశ్వవిజయ శక్తియు నిన్నిదినములనుండి సాధింపలేని దానిని నేఁడొక ముహూర్తములో నీ యశ్రుసలిలము సాధించినది.

శ్రీ

# నూర్జహాన్

## పంచమాంకము

### ప్రథమదృశ్యము

కాబూలుదగ్గరఁ జక్రవర్తి శిబిరము—ప్రభాతకాలము.

జిహాంగీరు నూర్జహానులు నిలువంబడియుందురు.

నూర్జ—ప్రభూ! వినయమునఁ దలవంచి తాము మహాబత్ఖాను ప్రభుత్వము నంగీకరించితిరి. భృత్యునియందుఁ దాముజూపు భక్తివిశ్వాసములు మిగుల శ్లాఘ్యములు!

జిహాం—నూర్జహానూ! దెప్పిపొడుచుటవలన లాభమేమి? మన ప్రస్తుతావస్థ యెట్టిదో గ్రహించుకొనుము. మనమిప్పుడు మహాబత్ఖాను కరములందుఁ బంధితులమై యున్నాము. ఎవ్వని మోకాల చేతులు మోడ్చి వినయవిధేయతలతో నిలువఁబడి, నీ ప్రాణభిక్ష వేఁడవలసివచ్చినదో? వానినిపుడు దోషినిగ మనము మోపెట్టిన లాభమేమి?

నూర్జ—స్వామీ! నేనతనిపై నెట్టి యపరాధమును మోపుచుంట లేదు. ఇంతలోఁ దాము పెంపుడుబిడ్డలై పోతిరని మాత్రము నుడివితిని!

జిహాం—అట్లగుట నిక్కువమేయని నీకంటె బాగుగ నేనెఱుంగుదును! అట్లు కానిచో నాకు నేఁ డిట్టిగతి పట్టకయుండెడిది!

నూర్జ—అవును! మీ రనినది మిక్కిలి నిక్కమే!’

జిహాం——దానికేమి?——మహాబత్ఖాను శాసనమందు నేనెట్టి లోపము ను గాంచుటలేదు? ఏకార్యమందునను, అతఁడు మన కెట్టి యంతరాయముఁ గల్గించుచుంటలేదు.

నూర్జ——అవును మీరనినది 'నిక్కమే!'

జిహాం——కాశ్మీరమును పోఁగోరి, పోతిమి! కాబూలు గాంచి వచ్చితిమి! మన కెట్టి యిబ్బందియుఁ గలుగకుండఁ గమనప్రమత్తుండై భృత్యునిభంగి నతఁడు మనల ననుసరించి వచ్చుచున్నాఁడు! అట్లని నీవుమాత్ర మెఱుఁగవా?

నూర్జహాను——ఎఱుంగకేమి యేలుంగుదును! మీరనినది 'మిక్కిలి నిక్కవము!' అహ దినమతఁడు మనల ననుగమించి వచ్చుట నిక్కముగ భృత్యునివలెనే!

జిహాం——ప్రతిదినము ప్రొద్దుపొడువకమున్నే యతఁడు మనల దర్శింప నరుదెంచుచు, నన్ను సామ్రాట్టనియు, నిన్ను సామ్రాజ్ఞియనియు సంస్తుతించుచు, తలవంచి మన కభివాదన మొనరించుచు వెడలి పోవుచున్నాఁడు.

నూర్జ——అవును. మీరనినది మిక్కిలి 'నిక్కవమే'! భృత్యుని భక్తి వలన దేవర యిపుడు మిగుల సుఖమనుభవించుచున్నారు!

జిహాం——సుఖమనుభవించు చున్నను, దుఃఖమనుభవించు చున్నను, నింతకన్న వేరుపాయము లేదు.

నూర్జ——మీరనినది 'మిక్కిలి నిక్కము.'

పిదప నామె యేదియో యోచింపఁదొడంగును

జిహాం——ఏమి యోచించుచున్నావు?

నూర్జ——ఉపాయ మున్నదా లేదా యని.

జిహాం——నూర్జహానూ! వృథ నీ మేమమున దుఃఖమును గల్పించుకొనుచు, నీవూరక బాధపడెద వేల? రాజ్యపాలనము గురుతరము!—

జరుగవలసిన దేదో జరిగినది. అట్లని పలుమాఱు చెప్ప నెందు లకు? సామ్రాజ్యము నాశనమై పోవుచున్నది—పోనిమ్ము! నేను విచారింపను.

[నిరసమున నూర్జహాను మరల నేదియో యోచింపఁదొడంగును.]

జిహాం—ఎవరికి వాంఛయున్నదో, వారినే సామ్రాజ్యము నేలుకొనని మ్ము! సామ్రాజ్యమునకై మనము విచారింపవలదు. ఇఁకపోయి మన మానందక్రీడలఁ దేలుదము రమ్ము! వారికెవరును విఘ్నము గల్పింపరు.

నూర్జ—వాని సద్దు పెట్టకుండుట వారి యనుగ్రహము! కాలశరత్కాలమేఘమువలె ననుగ్రహ మస్థిరమైనది! తొలకరి మబ్బకంటె నది యధికంబుగ గర్జించును!

జిహాం—ఉపాయమేమియు లేనితఱి, ఆ విషయమునే పలుమారు తలఁచుకొనుచుండినఁ బ్రయోజన మేమి?

దౌవారికుఁడు (ప్రవేశించి)—ఖోదాబంద్ (ప్రభూ!) సేనాధిపతి యొకమాఱు దేవరదర్శనము వేఁడుచున్నాఁడు.

[అని యతఁడు నిష్క్రమించును]

[జిహాంగీరుకూడ నిష్క్రమించును.]

నూర్జ—(నిష్క్రమించు పతిపై స్థిరదృక్కులఁ బఱపుచు, అతఁడు వెడలిపోవఁగనే దీర్ఘనిశ్వాసమును విడిచి) "ఇఁక నుపాయమేమి? ఏమియును బోధపడుటలేదు. మబ్బులు మూసుకొని వచ్చుచున్నవి. చీకటి పేరుకొనిపోవుచున్నది! ఎంత వెదకినను దారి కనఁబడుట లేదు. నూర్జహానూ!—ఇఁకెందులకు?— ఇప్పుడైన వెనుకకు మరలుము! మరలుము!!—కాని అట్లు వెనుదిరుగుట నీ తరము కాదు! కలవరపడకుము. ముందంజవేయుము! కొంచెము జాలవర కెక్కితివి. ఎక్కుటకంటె నిప్పుడు దిగుటయే మిగుల భయానకమై యున్నది!

నూర్జహానూ! నడువుము! నడువుము!! వెనుకకు జూడకుము. ఇపుడు కూడ నీవు శిఖరమును జేర-లేకపోవు! చతురంగక్రీడయందుఁ దప్పునడక నడిచితివి! అయినను ధైర్యము వీడకుము! జయింపఁగా గలవు. ఆడుము! విరమింపకుము!

## ద్వితీయ దృశ్యము.

కాబూలు మార్గము సాయంసమయము

మహాబత్ఖాను దారిప్రక్క నిల్చుండి దూరమునఁ జూచుచుండును.

మహాబత్—తుదకొక సామ్రాజ్యభారము నాపై బడినది! దీనినిఁ నేఁ గోరుకొనలేదు. ఈ యైశ్వర్యము నేఁడు నన్నొక సంకెలవలె బంధించి వైచినది. ఇంటిచుట్టు నున్న రాతిగోడవలెనది నా కూపిరి యాడనిచ్చుట లేదు. ఘోరసర్పమువలెనది నాశరీరముపై కెగఁ బ్రాకుచున్నది! దానినుండి విడివడుట కుపాయ మేమియు లేదు! ఎంత పెద్ద బరువు. అసహ్యమై యున్నది! అట్లయ్యు దానిని వహింపవలయును! ప్రతిహింసార్థము వేచియుంటిని!—అది లభించినది. కాని, యిపుడొక మహాకర్తవ్యభారము నాపైఁ బడి యున్నది! దారిబోవుచు నీయనాథ సామ్రాజ్యము నేలుకొంటిని! ఇపుడు దానిని లాలింపవలయును! రక్కసి బారినుండి దానిని రక్షింపవల్లయును! అదుగో ప్రొద్దుగ్రుంకుచున్నది. నేఁ గూడ శిబిరములోని కరిగెద!

[నిష్క్రమించును.]

కొందఱు దస్యులు ప్రవేశించి, మహాబత్ఖాను మార్గమున కడ్డు వత్తురు.

మహాబత్—మీర లెవరు?

ప్రథమదస్యులు—మేము కాబూలీలము.

మహాబత్—మీ కేమి కావలయును?

ద్వితీయదస్యుఁడు—మీ శిరము!

ఇట్లని యీదస్యు చక్ర మాకస్మికముగమహాబత్ఖాను నాక్రమింతురు! మిగులఁ గోపముతో మహాబత్ఖాను దస్యులపైఁ బడి నిముసములో వారల నందఱి జంపి వేయును. కాని యింతలో మఱికొందఱు కాబూలీలు కత్తులఁ దాల్చి, వచ్చి యాతని నెదురింతురు. సంకుల సమరము జరుగుచుండును. అపుడు కొందరు సైనికులతో ప్రవేశించి, యతనికి సాయపడును. దొంగలు విజయసింహుని జంపుదురు. మహాబత్ఖాను కోపమున విజృంభించి వారినందరఁ దునుమాడఁ దొడగును. చావగా మిగిలినవారు పారిపోవుదురు.

విజయ—సేనాపతీ!—సేనాపతీ!!

మహాబత్—ఏమి విజయసింహా!—

విజయ—నాకు గాటమగు గాయము తగిలినది. నాకు చావు సమీపించినది!

మహాబత్—విజయసింహా! విజయసింహా!! దొంగల చేత నీకు మరణముగలిగినదా!—మిత్రమా! నామూలమున నీకు మృత్యువాసన్నమైనది.—అయ్యో! నీ కెట్టి మరణము ప్రాప్తించినది!

విజయ—ప్రాప్తింపనిండు!— చింతలేదు ! — ప్రభుప్రాణరక్షార్థమై రణంబు సలిపితిని కాని—ప్రభూ!—ప్రాణములు పోవకేమున్నె ఒక సంగతి చెప్పెదను.—పోయెద—దేవర—ప్రాణములఁ—దీయుటకై —యొక—కుట్ర—అయ్యో!—యింక జెప్పఁజాలకుంటిని!—అంతయును!—నెట్లు !—నారాయణా—అయ్యో! పోవుచుంటిని!—ప్రభూ!—శ్రీహరీ! నారా—!

[ప్రాణముల విడచును ]

మహాబత్—[మిత్రునిపైఁబడి]—పవిత్రరసపుత్రకుల కిశోరమా? ప్రభు

రక్షణార్థము ప్రాణత్యాగ మొనర్చి రాజపుత్రోచిత కార్యమే సలి పితివి! కాని, మిత్రమా! ఈ మరణము నీకు నా మూలంబునఁ బ్రాప్తించెను! నేను పాపిని! మరణించి నీవు వీరస్వర్గమును జేర జయించిన నేను నిలయుంబు జేరుదును! సఖా! వీరుండవైన నీకై విలపించుట తగదు.—కాని, [ఒకించుక చింతించి]—ప్రతిహింసా మూలంబున నా పాపమునకుఁ బ్రాయశ్చిత్తముఁ గావించుకొందును! ప్రతీకార మొనర్పక యీ దురాత్ములను—విడువను!—కాని యీ ఘటనమునకు హేతువేమి?—కాబూలీలు నన్ను హత్యఁ గావింపనేల?—ఎట్టి కారణము గోచరించుట లేదు!—వీరికి నే నేమియుఁ గీడు చేసి యుండలేదు!—నన్ను వీరు జంపు టెందులకు!

[సైనికుఁ డొకఁడు ప్రవేశించును]

మహాబత్—ఏలవచ్చితిరి?

సైనికుఁడు—సామ్రాట్టు శిబిరమును బ్రవేశించి కాబూలీలు రక్షక భటుల నైదువందలమందినిఁ జంపి వేసినారు.

మహాబత్—ఏమి!—ఈ యడవిమనుష్యుల క్రౌర్యమింతవరకు వచ్చినదా!—మంచిది!—రామసింగూ—ఈ నగరమందలి కాబూలీల నందఱ జంపివేయుఁడని నా సైనికుల కాజ్ఞాపింపుము!—హత్యాక్రియ యిప్పుడే ప్రారంభము కావలెనని చెప్పుము!

## తృతీయ దృశ్యము

సార్వభౌముని శిబిరము—రాత్రికాలము

నూర్జహానేకాకినియై యుండును.

నూర్జ—మానవు లందఱు పృధివికిఁ గ్రీడావస్తువులు! జగంబాక ముహూర్తమునఁ గొందఱ నత్యాదరమునఁ దన హృదయ సీమపైఁ జేర్చుకొనును. పరముహూర్తమందే వారలఁ గోపముతో భూత

లముగఁ బడవేయును! జగత్తొక శిశువువంటిది, తన యాట బొమ్మల నెవరైనఁ దొడలపై నుంచుకొని లాలించినచో సంతోషమున నుప్పొంగిపోవదు. వానిని మూలఁ బారవైచినచో గోపింపదు. ఆయాడినవస్తువుల మానసంబాభిమానములతోఁ దన కవసరము లేదు. అల్లే మానవు లేడ్చినను నవ్వినను నీజగత్తు చెవిటిదై యుండును లేక, మనుష్య సుఖదుఃఖము లీశ్వరగ్రాహ్యములు కావని తెలఁపవలెను! భగవంతుని సృష్టియొక్క మహదుద్దేశమందీ మానవుల సుఖదుఃఖములకుఁ జోటులేదు. మానవ సుఖదుఃఖము లీశ్వరుని విశ్వకర్మాగార—(కారుఖానా)— మందు గగనమున కెగురఁగొట్టఁబడును. స్ఫులింగ ధూమరాసులవంటివి. సృష్టికర్త వానిని లక్ష్యపెట్టఁడు! కాలచక్రము (The wheel of Time) విశ్వఘటనామార్గములను బ్రద్దలుచేసుకొని ముందునకుఁ బర్విచుచున్నది!—విశ్వవేదన యొక్కగ నది బొమలెత్తి చూచుట లేదు.

(జహంగీరు ప్రవేశించును)

జహాం—ఏమి యీకోలాహలము!—నూర్జహానూ! నీకు వినిపించుట లేదా?

నూర్జ—వినిపింప కేమి? జనాబ్! అదేమి కోలాహలమో యెఱుంగుదురా?

జహాం—ఎఱుఁగను. తెల్పుము.

నూర్జ—అది మృత్యుమహోత్సవనాదము. మహాభక్తాను శాసనమునఁ గాబూలీ లంగలు వధింపఁబడుచున్నారు!

జహాం—అట్టి కఠిన శాసన మతఁడేల చేసినాఁడు!

నూర్జ—ఏలనా? కాని, మీానల్లమందు మత్తువదలెనో లేదో తెల్పుడు!

జహాం—నూర్జహానా! వారలఁ జంపుటకుఁ గారణం బేమి?

నూర్జ—నేఁటి సంధ్యాసమయమున మార్గమధ్యమందుఁ గొందఱు కాబూలీలు మహాబత్ఖాను నెదుర్కొనిరి! అంతియ కాక వారల్లో మన కావలివాండ్రనైదువందలమందిని జంపిరి!—ఇవే కారణములు! వీనికంటె విశేషమేమియు లేదు!

జహాం—కాబూలీలు మహాబత్ఖాను నేల చుట్టుముట్టిరి. వారలే హేతువున మన సైనికుల వధించిరి?

నూర్జ—గ్రహచారము! మహాబత్ఖానుగారు మహారాజ పదవి నలంకరించెనన్న వారెఱుంగరు. అతఁడింకను సేనాధిపతియనియే యానిర్భాగ్యులు తలఁచిరి!

జహాం—సేనాధిపతిని మాత్రమేల వార లెదుర్కొనవలయును?

నూర్జ—దేవరకు సంగతి చాలవఱకు బోధపడినట్లు తోఁచుచున్నది! అట్లైన మఱికొంత బోధపఱచుకొనుఁడు! మహాబతానును జంపివేయుఁడని కాబూలీలను నేనే ప్రేరేపించితిని!

జహాం—నీవా!!!

నూర్జ—అవును నేనే!!!—ఇపుడే యాకసమునుండి దిగివచ్చితిరా యేమి?—నేనే! నేనే!! నేనే!!!

జహాం—సామ్రాజ్ఞీ! ఎవ్వఁడు నీకు ప్రాణభిక్ష నొసఁగెనో వానిని హత్యఁ గావింప నాజ్ఞాపించితివా? ఇంత కృతఘ్నతయా?

నూర్జ—సామ్రాట్! నేనాభిక్షను వేఁడియుండలేదు!

జహాం—నీవు వేఁడకుండుట నిక్కమే! కాని, నీకొఱకై నేనే వేఁడితిని! అట్లొనర్చుట నాబుద్ధి పొఱపాటని యిపు డెఱింగితిని! మరణమే నీకు శ్రేయమని నే నపు డెఱుంగనైతిని!

నూర్జ—అట్లైనఁ దేవర కనుతాపము కలుఁగుచున్నదా?

[మహాబతుఖాను ప్రవేశించి యభివాదన మొనరించును]

జిహాం—మహాబతుఖానా! రమ్ము!—ఈయల్లకల్లోలమంతయు నేమి?

మహాబత్—కాబూలీల వధింపుడని నా సైనికుల కాజ్ఞాపించితిని!

జిహాం—అట్టి యాజ్ఞ నీవేల యొసఁగితివి?

మహాబత్—ప్రభూ! నాయపరాధమేమియు లేదు. నేను వారలకెట్టి యనిష్టమును గావించియుండలేదు. కాని, వారలు,—

[దౌవారికుఁడు ప్రవేశించును]

దౌవారికుఁడు—స్వామీ! కొందఱు కాబులీయుద్రూవులు దేవర దర్శనమును వేఁడుచున్నారు.

మహాబత్—వారలఁ దీసుకొని రమ్ము.

[దౌవారికుఁడు నిష్క్రమించును.]

మహాబత్—ప్రభూ! నన్ను వధించుటకై వీరలు కొందఱిని నాపైఁ దోలిరి. అంతియకాక వీరలు దేవరవారి రసపుత్ర సైనికుల నేను వందలమందిని జంపివైచిరి!—నే నిప్పుడు వీరలకుఁ దగు శాస్తి గావించుచుంటిని.

[ఉద్రూవులు ప్రవేశింతురు.]

ఉద్రూవులు—భారతసామ్రాట్టునకు భారతసామ్రాజ్ఞికి జయమా గాక!

జిహాం—మహాశయులారా! మీర లిచటకు రాగతంబేమి?

మొదటి యుద్రూవు—భారతాధీశ్వరా! కృపాళులై పురవాసుల హత్య నాపివేయుఁడు.

[చక్రవర్తి ముందర నుద్రూవులు మోకరింతురు. సామ్రాట్టు శిరమెత్తి మహాబతుఖానును విలోకించును.]

నూర్జ—అభాగ్యులగు నుద్రూవులారా! సార్వభౌముఁ డీతఁడు కాఁడు. [మహాబతుఖానును జూపుచు]—సార్వభౌముల వారీయన!

(స్తంభితులై యుగ్రామాపులు మహాబత్ఖానును విలోకించి, మరల జహాంగీరుపై దృష్టులఁ బఱపుదురు.)

జహాం—మహాశయులారా! ఈమె చెప్పినది నిక్కమే! ఈయోధవరుల యెడ దాక్షిణ్యమొనర్చిరి. అతని క్షమాభిక్ష వేఁడుఁడు. ఈవిషయమందు నాకెట్టి యధికారము లేదు.

మొదటియుగ్రామాపు—యోధవరా! అట్లైన, తామే యీపురవాసుల రక్షింపుఁడు.

మహాబత్—మహాశయులారా!—ఈయుపాయము—కడు యుక్తముగనే యున్నది! నన్నుఁ దుర్మూఢ నమకట్టి, నిష్ఫలులై, యిపుడతఁడిచ్చిన యభయమునఁ గృపాభిక్ష వేఁడవచ్చితిరి! అయ్యలారా! నాయైనువండల రసపుత్ర సైనికులు తమ కెట్టి హాని చేసిరి?

మొదటి యుగ్రామాపు—స్వామీ! మేమే పాపము నెఱుఁగము.

మహాబత్—మీరేమియు నెఱుఁగనే యెఱుఁగరా?

రెండవ యుగ్రామాపు—ప్రభూ! నిక్కము నెప్పుచుంటిమి. మేమేమియు నెఱుఁగము. మామాటలు విశ్వసింపుఁడు.

మహాబత్—నేనట్లు విశ్వసింపఁజాలను.

మూఁడవ యుగ్రామాపు—స్వామీ! ఆయార్తనాదమును వినుఁడు. నగరపు మూలమూలలనుండి వెడలుచున్న యాధూమరాశిని విలోకింపుఁడు. మీసైనికులు మానిలయంబుల కగ్ని ముట్టించుచున్నారు.

మహాబత్—ఉచిత కార్యమునే సలుపుచున్నారు. నాలుగవ యుగ్రామాపు—వధింపఁబడు వారలలో నెందరే పాపమెఱుఁగని స్త్రీలున్నారో, యెందఱు ధర్మవ్రతవృద్ధులున్నారో, యెందఱు నిస్సహాయశిశువులున్నారో, యోచింపుఁడు. వారలెట్టి యపరాధమును జేసి యుండలేదు.

మహబత్—కావింపనిమ్ము,—కావింపక పోనిమ్ము! నేనది విచారింపను. మీ ప్రార్థన నిష్ఫలము! ఇఁక వెడలిపొండు!

ఖుస్రూవులు—(మరల జిహాంగీరు కడ కేకరించి),—"స్వామీ! ఇఁక మాకు రక్షణమెట్లు?

జిహాం—(కన్నుల నీరు బెట్టుకొని ముఖము కప్పుకొనును కొందరు కాబూలీ కాంతలేడ్చుచు వచ్చి యాతని కాళ్ళపైఁ బడుదురు)

కాబూలీ కాంతలు-"ప్రభూ! రక్షింపుఁడు! రక్షింపుఁడు!! రక్షింపుఁడు!!!

జిహాం—మహబత్ఖానూ!—

మహబత్ఖాను— (నీరవుఁడై యుండును.)

మొదటి కాంత—బాబయ్యా! మా బిడ్డలఁ గాఁపాడుఁడు!

నూర్జ—కాంతలారా! చక్రవర్తి యాతఁడు కాఁడు ఆయన! మహబత్ఖానును జూపును.

కాబూలీ కాంతలు—(మహబత్ఖాను కాళ్ళపైఁబడి) "ప్రభూ! భిక్ష వేఁడుచుంటిమి!—మా శిశువుల రక్షింపుఁడు. వారలకు మాఱుగ మమ్ముల్ జంపివేయుఁడు!"

మహబత్—ఫరిద్! పోయి నీవాహత్యాకృత్యమును నివారింపుము. చక్రవర్తి యాజ్ఞయని చెప్పుము—మహాశయులారా! మీరిఁకఁ బొండు!

(జిహాంగీరు, నూర్జహాను, మహబత్ఖానుల కభివాదన మొనరించి ఫరిద్ కాబూలీ కాంతలతో నుస్రూవులు నిష్క్రమింతురు.

మహబత్—శెర్ అలీ!

శెరాలీ—ఏమి స్వామీ!

మహబత్—గుడారము లెత్తివేయుము. సామ్రాట్టిచటినుండియిప్పుడు వెడలిపోవును. యీ గూటవికుల యూర వారుండుట భద్రము కాదు. శెర్ అలీ నిష్క్రమించును.

మహాబత్ఖాను—(పచారు చేయుచుండును.)

జహాంగీరు—(నీరవుఁడై యుండి కొంచెము సేపైన పిదప) "మహాబత్ఖానూ!

మహాబత్—ప్రభూ! ఏమియాజ్ఞ.

జహాం—ఈ పిస్తోలును దీసికొని నన్ను వధింపుము!! ఇక నే సహింపఁజాలను!!!

మహాబత్—తెలిసినది! ఇట్టి నిరాటంకమగు నాజ్ఞనొసఁగుట దేవర కభీష్టమని నే నెఱుఁగుదును!—స్వామీ! నేనిట్టి యాజ్ఞల నొసఁగుట దేవరవారి క్షేమమును గోరియే గాని చక్రవర్తి నైతినని తలంచుటచే మాత్రము కాదు!

నూర్జ—అట్లులనా! మహాబత్ఖానూ! చక్రవర్తియన నీకెవ్వరు? విశ్వాసఘాతుకుండవై నీవు మమ్ము మా యింటినుండి దరిమివైచి, మా కనులయెదుటనే మా గృహమును బ్రవేశించి లోపల గడియవేసికొని యచటి సింహాసనమందుఁ గూర్చుంటివి. కృతఘ్నుండవై ప్రభుభృత్య సంబంధమును తలక్రిందుజేసి నీ నిరంకుశ ప్రభుత్వమును స్థాపించి, అధికారదండముతో మమ్ము నీ చిత్తమువచ్చినట్లు కొట్టుచున్నావు. అక్బరుసార్వభౌముని తనూభవుని, నీవు బంధితునింజేసి యాతనినామమున నీ స్వేచ్ఛాచార శాసనమును బ్రచారమొనరించుచుంటివి!—మహాబత్ఖానూ! చక్రవర్తి యని, యిపుడెవరిని బలుకవలెను.

మహాబత్ఖాను—(నీరవుఁడై యుండును.)

జహాం—అయినను, నీశాసనము న్యాయసమన్వితమై యున్నంతకాలము నేనేమియు మారు మాటాడలేదు. మహాబత్ఖానూ! నాపాలనము దుర్నయభూయిష్టమని, సామ్రాజ్యమును నా చేతులనుండి యూడఁబెఱికి కొనియు,—

మహాబత్—ఏమో సెలవిండు.

జిహాం—సామ్రాజ్యమును నాచేతులనుండి యూడఁబెఱికి కొనియు, నీ వన్యాయంబున కొడిఁగట్టితివి! నే నిట్టి యన్యాయము నెన్నఁడు జేసి యుండలేదు! ఒకరి యపరాధమునలన మఱొకరిని హత్యఁగావింపుఁడని నే నెన్నఁడు నాభటుల కాజ్ఞాపింపలేదు! న్యాయవిచారణ మందు నేను నా ప్రాణసమయగు సామ్రాజ్ఞికిగూడ మరణదండనము విధించిన రాజాజ్ఞాపత్రము నందు చేవ్రాలుజేసి తదనంతరము నిన్ను నేను—భారతాధీశ్వరుండనగు నేను,—చేతులు మోడ్చి యామె ప్రాణభిక్ష వేఁడితిని! నీ న్యాయవిచారణమ్మది యూ?—సామ్రాట్టునయ్యు, నిరుపాయుండనై నీ దుర్నయంబు నూరక జూచుచుండవలసి వచ్చినది!—ఇఁక నాకీ బ్రదుకేల?—మహాబత్ఖానూ! కృపాళుండవై నన్ను వధించి వేయుము!!— భారతాధీశ్వరుండైన జిహాంగీరు నీపాదములకడ మోకరించి తనప్రాణమును దీయుమని వేడుచున్నాఁడు.

[పిస్తోలు నొసఁగును]

మహాబత్—ప్రభూ! మీ సామ్రాజ్యమును మీరే గైకొనుడు. మీరింతకు మున్నెట్టి సామ్రాట్టులో యిపుడుకూడ నట్టి సామ్రాట్టులే! నేను మీ భృత్యుండను! క్రోధవశంబున నొడలెఱుంగక యపరాధము సలిపితిని! నన్ను శిక్షింపుఁడు.

[సార్వభౌముని పాదములపైఁ దనకత్తి నుంచును]

జిహాం—మహాబత్! నీ విట్టి మహాత్ముఁడవా? [క్షణము నిస్తబ్ధుఁడై యుండి,] పురుషసింహా! భ్రమపడి మానవమాత్రు లపుడపు డపరాధము సలుపుచుందురు! కాని, ఆ భ్రమను గ్రహించి యెవ్వఁడు తనంతదానే, నిజాపరాధమునకై శిక్షను శిరసావహింప సాహసించునో, యాతఁడు మరఁడుగాక మనుజుండే యైనచో మహానీ

యగుణ గరిష్ఠుండైన మహాత్ముండవు!—మహాబత్ఖానూ! నీ ఖడ్గమును నీవు కొనుము!!—మేము నీ సర్వాపరాధముల మన్నించితిమి!!

## చతుర్థదృశ్యము

అసఫ్‌యొక్క గృహప్రాంగణము—రాత్రికాలము.

అసఫ్ కర్ణసింహులు నిలువఁబడి ప్రసంగించుచుందురు.

అసఫ్—పరఫేజురాకొమరుఁడు సంగసీమలో మృతి నొందిన యనంతరమందే, శర్యారును భావి సామ్రాట్టుగావింపవలెనని నూర్జహాను జహాంగీరుచే నొక యనుజ్ఞాపత్రము వ్రాయించుకొనెను! ఏలనన, షాజహానే సామ్రాట్టైన, తన ప్రభుత్వ మంతరించునని యామె బాగుగ నెఱుంగును!

కర్ణ—షాజహాను ప్రభు వెచట?

అసఫ్—గోల్కొండయందు.

కర్ణ—చక్రవర్తి వ్యాధి మిగుల తీవ్రముగ నున్నదా !

అసఫ్—అవును!

కర్ణ—మహాబత్ఖాను వార్త యేమైన నెఱుంగుదురా?

అసఫ్—అతఁడాకస్మికముగ స్వయముగా రాజ్యలక్ష్మిని విడచి, ఫకీరై యెచటికో పోయెనని ప్రజలు చెప్పుకొనుచున్నారు.

కర్ణ—ఆశ్చర్య మాశ్చర్యము!—మహాబత్ఖాను చరిత్రము నాకొక ప్రహేలికవలె దోచుచున్నది.

అసఫ్—అతనినే నొకించుక యెఱుంగుదును. శిలాఖండమువలెఁ గఠినుఁడయ్యు, అతఁడు కుసుమముకంటెఁ గూడ కోమలమై యుండును! నిర్ఘాతము వంటి యప్రతిహతప్రభావముఁ గలిగి యుండియు, అతఁ డబలాశ్రుబిందువున మునిఁగిపోవును.

ఈసమయమున ఫకీరు వేషమున మహబ్బత్ఖాను ప్రాంగణమందుఁ బ్రవేశించును.

అసఫ్—ఎవరు నీవు?—ఓహో!—మహబ్బత్ఖానా!

మహబత్—ఒకప్పుడు నేను మహబ్బత్ఖానునై యున్న మాట నిజమే!

కర్ణ—ఆశ్చర్యము! సేనాధిపతీ! మీకు నూరేండ్లాయువుండును.

మహబత్—ఏమి?

కర్ణ—మేము మీ మాటే జెప్పుకొనుచున్నాము.

మహబత్—అది నా భాగ్యము!

అసఫ్—మహబ్బత్ఖానా! నీ వాకస్మికముగ నిటకు రాఁగతంబేమి?

మహబత్—రాకూడదా? సామ్రాజ్ఞిచేఁ దఱుమంబడిన మహబ్బత్ఖానునకు సామ్రాజ్ఞి సోదరుఁడు తన యాలయమునం దాశ్రయ మొసఁగుట కిష్టపడఁడా?—అట్లైనఁ జెప్పివేయుము. నే నిప్పుడే మరలి పోదును!

అసఫ్—మహబతూ! సామ్రాజ్ఞి నడతనుబట్టి నన్ను దూషింపకుము. నే నందులకు బాధ్యుఁడనుగాను. ఇఁక నా విషయముఁ జెప్పు మనెదవా? మహబ్బత్ఖానును ప్రేమించునట్లు భారతవర్షమున నెవరిని ప్రేమించుచుంటలేదని గొంతెత్తి చెప్పఁగలను! మిత్రమా! నాగృహంబులోని కేల, నాహృదయము లోనికి రమ్ము.

[ఆలింగన మాచరించు కొనును]

మహబత్—రాణా! మీకొఱకై తమ రాజధానియగు నుదయపురమునకుఁ బోతిని. తామాగ్రా యందుంటిరని విని యిచటికి వచ్చితిని.

కర్ణ—అటులనా?

మహబత్—నా కార్యముల నెర వేర్చుకొనుటకై మీ కడ నాఱు మాసముల సమయము వేఁడితిని. ఆ యాఱుమాసములు గడచి

పోయినవి. మొదటి వేతనంబుగ నైదువేల రసపుత్ర సైనికుల వేఁడితిని. వారలఁగూడ బడసితిని. ఇఁక శేషించిన నా జీవనమును దేవరకుఁ బరిచర్యయందు వినియోగించెదను—ఇపుడు మీయాజ్ఞ యేమి?

అసఫ్—ఆశ్చర్యము! మహబత్ఖానా! నీ వొక సమస్య వలెనున్నావు!

మహబత్—అట్లుండని దెవరు?

అసఫ్—కాని, నీ వందఱను మించితివి!

మహబత్—ఎల?

అసఫ్—సామ్రాజ్యమును పిడికిట నుంచుకొనియు విడిచి వైచితివి!

మహబత్—అవును!

అసఫ్—ఎల విడిచితివి?

మహబత్—నాచిత్తము చాల సంక్షోభించినది.

అసఫ్—అందుచే, నీవు చక్రవర్తిని సామ్రాజ్యమును, ఆ వ్యాఘ్రి యెదుట విడిచి వచ్చితివా?

మహబత్—అవును. నేనేమి చేయఁగలను. ఈశ్వరుఁ డీవలఁ బన్ని నాఁడు. అతఁ డేదానిని, విప్పివైచును!

కర్ణ—మహబత్ఖానా! ఈశ్వరుఁడు తన చేతులతో నెవరినిగూర్చియు వలపన్న లేదు. విప్పి వేయలేదు మనుజుని తోడనే యారెండు పనుల నతఁడు సాధించుచున్నాడు.

మహబత్—అట్లే కానిండు. ఎవరి ద్వారమున నతఁడా జాలమును విప్పింప నిచ్ఛగించునో, వారినే విప్పనిండు.

కర్ణ—సేనాధిపతీ! మీరే యాజాలమును విప్పి వేయవలెను. మీకీశ్వరుఁడు శక్తి నొసఁగుట దానిని తాళమువైచి, దాచుకొనుటకై గాదు!

మహబత్—నేను దేవర భృత్యుండను. ఏమి చేయ మందురో యానతిండు.

కర్ణ—భృత్యులనియు, నేనేదియో ముదల నొసంగవలయు ననియుం దలపకుండు. మన మిర్వురము మిత్రులముగాని నేను ప్రభువును, మీరు భృత్యులునుగారు. తాము వైచుకొనిన తాళమును నే నిప్పుడే దీసి వేయుచుంటిని. మహాకర్తవ్య భారమును, మీ మహా క్యముపై సంపూర్ణముగ మోపుచున్నాను.

మహాబత్—ఏమి చేయ మందురో యానతిండు.

కర్ణ—ఈ పనికి మాలిన జిహాంగీరు సామ్రాట్టును సింహాసనమునుండి క్రిందికిందింపి, తగు వాని నొకని నందు గూర్చుండఁ బెట్టవలయును.

మహాబత్—తగిన వారెవరు?

అసఫ్—సామ్రాట్టు తనయుని గూర్చుండఁ బెట్టుటయే యావశ్యకము.

కర్ణ—నిశ్చయము!

అసఫ్—అట్లైన షాజహాను శర్యారులలో నొకని నెన్నుకొనవలయును. శర్యారు చక్రవర్తియైన, నూర్జహానే సామ్రాజ్ఞియైయుండును. దుర్బల శర్యారామె యల్లుడు.

కర్ణ—షాజహానును చక్రవర్తినిఁ గావించుట నా యభిమతము.

మహాబత్—నా యభిమతము కూడ నదియే!

అసఫ్—అట్లైన జిహాంగీరును సింహాసనచ్యుతునిగావింప నక్కఱలేదు. హాకీము [భిషగ్వరుని] మాటప్రకార మతఁడు మాసము, రెండు మాసముల కంటె విశేషకాలము బ్రదుకఁజాలఁడు! కాని నూర్జహాను శర్యారు కొఱకై యుద్ధము సలుపును. ఏలనన శర్యారే భారత సామ్రాట్టు కావలెనని జిహాంగీరు వలన నామె యనుజ్ఞా పత్రమును వ్రాయించుకొనెను!

మహాబత్—మంచిది!—యుద్ధము మాకుఁ గ్రొత్తగాదు. కర్తవ్యమును నిర్వహింపఁ గదన నన్నాహములఁ గావించెదము కాని

యిపుడు మిగుల నలసియుంటిమి__అసఫూ! నీ నిలయమునందు నే దుండుటకు నా కొకించుక తావొసఁగెదవా?

అసఫ్__అట్లనుచుంటివేమి? మహాబత్! నీవు నా సోదరుండవు; రమ్ము, లోనికిరమ్ము__ఒకించుక తాళుము. ముందు నేఁ బోయి జూచి వచ్చెదను__

[నిష్క్రమించును.]

మహాబత్__రాణా! తామాగ్రా సింహాసనమున నాసీనులు కాఁ గోరుదురా?

కర్ణ__నేనా?

మహాబత్__అవును మీరే! తామిచ్ఛగించుచో, నీ తరుణమందే నవహిందూసామ్రాజ్యస్థాపన మొనరింతును. అట్లొనర్చుట నా కసాధ్యము కాదు. నేను ముసల్మానుడ నైతిని__పోనిందు__గత జలసేతుబంధన మేల? విధర్మినైతినని నేనిఁక దుఃఖపడను__మీ కాగ్రాసింహాసనము కావలసినచోఁ జెప్పుఁడు__ఈ విషయ మా సమయమున జ్ఞప్తికి రాకపోయెను!

కర్ణ__ఏ సమయమున?

మహాబత్__పిడికిటనున్న సామ్రాజ్యమును విడిచివుచ్చునపుడు. అయిన నేమి__ఇప్పుడైన సమయము మించిపోలేదు. తాము హిందూ సామ్రాజ్యోద్ధారణమును గోరుచుంటిరా?

కర్ణ__మిత్రమా! లేదు.

మహాబత్__ఏల?

కర్ణ__మా సామ్రాజ్యమును మేము మరల స్వాధీనముఁ గావించుకొని నను, నిలుపుకొనఁజాలము.

మహాబత్__ఏల?

కర్ణ__ఎంతకాలము హిందువుల మగు మేము మరల మనుష్యులము

కాఁజాలమో, యెంతకాలము హిందువులు సామ్రాజ్యాధిపతులై యుండుట వికారస్వప్నమని మిగుల రోదించి గ్రహింపఁ గలిగితిని! ఖన్నాసాహేబూ! మా జాతి మిగుల యధమమైనది! సోదరుల శ్రేయస్సుకై యత్నించుటటుండనిండు. సోదరుని వచ్చఁజూచి గూడఁ నసహింపఁజాలము! అన్యజాతీయు లెవరైన వచ్చి మమ్ముఁ బీడించుచో, మే మాపీడనమును తలవంచి యనుభవింతుము!—కాని, మా సోదరుఁడు మాపై నధికారము వహించుట నసహింపఁజాలము. నేనుసామ్రాట్టునైన సర్వహిందువులకును గన్నెఱ్ఱ యగును. మరల దేశమందు రక్తనదులు ప్రవహించును. ప్రజలందఱు నాశన పిశాచము నోటఁ బడిపోదురు. దానంజేసి, వారు పరుల యధికారము క్రిందనే యుప్పొంగుచున్నట్లు మున్ముందుగూడ నుండుటయే మిగుల యుక్తము! స్వపరిపాలనముకంటె, పరపాలనమే హిందువులకు విశేష సుఖదాయకమై యున్నది!

మహాబత్—నిజంబు చెప్పితివి. అట్లు కాకున్న, హిందువుల కిట్టి దుర్దశ యేల ప్రాప్తించును?

(అసఫ్ మరల ప్రవేశించును.)

అసఫ్—మహాబతూ! రమ్ము.

మహాబత్—వందేగి రాణా!

కర్ణ—వందేగి సేనాపతీ! వందేగి మంత్రి మహాశయా!

అసఫ్—వందేగి రాణా!

(మహాబత్ యసఫు లొక వైపుగను, కర్ణసింహుఁడు రెండవ వైపును నిష్క్రాంతులగుదురు.)

పంచమదృశ్యము

గోల్కొండ—రాత్రికాలము.

ఖాదిజా యేకాకినియై పాడుచుండును.

గీతమాలం.

ఒక్కక్షణమైన నెడబాయకుండ నాదు
హృదయ సింహాసనము నధిష్టించి యుండి
నా విభుండు నాదు జీవితానందమూర్తి
నన్నుఁ బ్రాణాధికగఁ జూచుచున్నగాని,
నామదికిఁ దృప్తిలేక క్షణక్షణంబు
ప్రాణనాథుని కోసమై పరితపించితిని.
ప్రవిమల ప్రేమవార్ధి తరంగపటల
మందు విడువకనేఁ దేలియాడుచుండి,
యేమి పాపంబొ కాని సహింపరాని
హృదయ దాహంబుచేఁ దపియించుచుందు
ప్రేమ యన నేమొ యెరుఁగని బేలనగుట
ఇంతగా దుఃఖపడుచుందు నేమొ! నేను

షాజహాను—(ప్రవేశించి) ప్రేయసీ! దుఃఖవార్త!

ఖాదిజా—ఏమది? ఏమది?

షాజ—జనకుఁడు మృతినొందెను.

ఖాదిజా—అల్లా! అల్లా!! అల్లా!!!

షాజ—ఇదిగో! నీ జనకుఁడు లిఖించిన పత్రమును జదువుకొనుము.

[ఖాదిజా పత్రమును గైకొని చదువఁ దొడఁగును.]

షాజ—అదృష్టపిశాచి తుదకు నా జనకుని గూడ హత్య గావించెను. ఆతనిని విలాసమందు ముంచి మూర్ఖుని గావించి, కామాంధుని

జేసి—తుదకు జీవనమధ్యాహ్నసమయమున నతనివధించివైచినది!

ఖాదిజా—సామ్రాజ్ఞిహత్యఁ గావించెనా?

హాజ—దీనిని హత్య యనక, యేమనవలెను?—శఖ్రాను నామె యెట్లు వధించెనో, నా జనకుని గూడ నట్లే వధించినది!

ఖాదిజా—సామ్రాజ్యార్థమా?

హాజ—అవునందులకే!—[నిట్టూర్పు నిగిడించి "నూర్జహాను సామ్రాజ్యార్థము సంగ్రామము సలుపు" ననియు, "అవలీలగ నామె రాజ్యమును జేఁజేత నీ కర్పింప" దనియు నీజనకుఁడు లిఖించెను!

ఖాదిజా—నాథా! మనకు సామ్రాజ్య మెందులకు? మన మిందుండి దూరంబుగ నేదేని వన గ్రామంబున కరిగి, కృషీవలులవలె సుఖంబుగ జీవనము గడుపుదము; భూఖండము కొరకు కయ్యమునకుఁ గాలు ద్రవ్వనేల?

హాజ—సతీ! నీ వింకను బాలికవు. గడ్డము వట్టుకొని బ్రతిమాలెదను. కొంచెము వ్యక్తత వహింపుము.

ఖాదిజా—మనము కపోతదంపతులవోలె నున్నచో సుఖింపఁ గలము.

హాజ—అటు లగుటకు నే నొప్పుకొనను. సతీ! నీ విఁక పోయి, మన యాగ్రాప్రయాణంబునకై వలయు సన్నాహము సలుపుము.

ఖాదిజా—"నాథా"! [అని హాజహాను కరంబులఁ బట్టుకొనును.]

హాజహాను—ఇఁక వెడలిపొమ్ము. ప్రేమాలాపము తరువాత.

[ఉభయులు నిష్క్రమింతురు.]

## షష్ఠదృశ్యము

నూర్జహాను యాగారము—రాత్రికాలము.

ఏకాకినియై యామె నిలువంబడి యుండును.

నూర్జ—నూర్జహానూ! ఈకొఱవిదయ్యము వెంట (Will o 'the-wisp or

Ignis-fatures) నిన్నిదినములు గ్రుమ్మరితివి—ఏమి లాభించినది!—లేదు—కాని, నడక చాలింపలేను. నాశక్తితో నేను నడచి పోవుట లేదని నేఁడు గ్రహించితివి! ఒక తూర్జితాభ్యాసము నిన్నొక జంత్రపు బొమ్మవలె నడపుకొని పోవుచున్నది. పోవుచునే యుంటివి!—యేలనన, పోవుటకన్న వేఱుపాయ మేమియును లేదు.—మృత్యువెదురైనను నడక మానలేదు!

[శర్యార్ ప్రవేశించును.]

శర్యార్—సామ్రాజ్ఞీ! నన్నుఁ బిలచితిరా?

నూర్జ—అవును—చక్రవర్తి మరణించుటకుఁ బూర్వము నిన్నతేఁడు రాజ్యమున కుత్తరాధికారిని గావించి పోయెను! ఇదిగో! యాతని యనుజ్ఞాపత్రము! సైన్యసమేతముగ నీ వాగ్రా కరిగి, సింహాసనమును స్వాధీనము గావించుకొమ్ము.

శర్యార్—నేనే!

నూర్జ—అవునునీవే! నాసోదరుండైన యసపును, వీరోత్తముఁడనియు, నిగ్రహానుగ్రహానసమర్థుండనియుఁ బేరువడసిన మేటిశూరుండగు మహాబత్ఖానును, మీవార్ను రాజ్యాధిపతియగు కర్ణసింహుఁడును, కలిసి షాజహానును జక్రవర్తి నొనర్ప యుద్ధసన్నద్ధులై యున్నారు. కాని వారింకను బహుదూరమందున్నారు! ప్రస్తుత మామార్గులు ఖుస్రుయొక్క నందను నొకని సింహాసన మందుఁ గూర్చుండఁ బెట్టినారు! నీవు పోయి వారలతో యుద్ధము సలుపుము!

శర్యార్—నేను, యుద్ధ మొనర్ప వలెనా?

నూర్జ—అవును! ఇఁక నాలస్య మొనరింపకుము. పొమ్ము. నేనిప్పుడే సైనికుల కాజ్ఞ యొసఁగుచుంటిని!

[నిష్క్రమించును.]

శర్యార్—నేను సామ్రాట్టు నౌదునా? తలంచిన మాత్రాన హృద

యును కంపించుచున్నది. యుద్ధము సలుపుట నేనా! ఇట్లని యెన్నఁడుఁ దలపలేదు. అట్లొనర్చుట నాకు సాధ్యమగునా!—

[యోచింప దొడంగును.]

[లయిలా ప్రవేశించును]

లయిలా—నాథా!

శర్యార్—ఏమి సతీ!

లయిలా—సామ్రాజ్యార్థము తాము సంగ్రామము సలిపెదరా?

శర్యార్—అవును, సలిపెదను! ఆశ్చర్య మేమున్నది?

లయిలా—ఆశ్చర్య మేమియు లేదు—కాని, యుద్ధము దేనితోఁ జేయుదురో జెప్పుఁడు! నాథా! యుద్ధమన నేమో యెఱుంగుదురా?

శర్యార్—లయిలా! నీ పరిహాస వాక్యంబులచే నన్నుఁ దేలిక పఱుపకుము. నేను నీ భర్తను తెలిసినదా?

లయిలా—మీకున్న దివ్యడా గౌరవభారమే. అందుపై దామిపుడు సార్వభౌములగుచో మఱింత భారమును వహింపవలసి వచ్చును! మీరద్దానిని వహింపఁజాలరు!—మోయఁజాలని బరువెత్తుకొనిన వారు క్రుంగిపోవుదురు.

శర్యార్—చాలు ఊరకుండుము. నీ మెట్టవేదాంతము నాకడఁ గట్టిపెట్టుము. నేను మూఢుఁడనుగాను. నాకుఁ జాలపఱకు బోధపడినది. తప్పక నేను మహాహావంబు సల్పెదను! ఏల చేయలేను? నేను మనుష్యుండను గానా? నీవు నన్నెల్లప్పుడు, తిరస్కరించుచుందువు. నీ వనుకొనినంత పనికి మాలినవాఁడనుగానని దృష్టాంత పూర్వకముగ వేగమే నీకు జూపెదను.—యుద్ధమొనర్చి చక్రవర్తి నయ్యెదను!!

లయిలా—హృదయేశ్వరా! కుత్సితులరాలైన యాకాంత పన్నినపట్టు త్రాళ్ళయుచ్చునందు బడిపోకుఁడు! అంత మొందుదురు!—

ఈసంకల్పమును వీడుఁడు!

శర్యార్—వీడుటెట్లు? నేఁ జక్రవర్తినై పోతిని! జనకుఁడు నన్నుఁ జక్రవర్తింగావించి మరణించెను. నేను సింహాసనమందుఁ గూరుచుండుటే మిగిలియున్నది! ఇవు డందులకై పోవుచున్నాను. నన్నెవరైన నడ్డుకొన్నచో యుద్ధమొనరింతును.

లయలా—హతభాగా! నాపలుకుల నాలింపుము. ఇటనుండి పారిపోవుటకై యత్నింపుఁడు. ఈనుడిగుండమునఁబడినచో మిమ్ము నేరక్షింపఁజాలను. నా జననియైన యా రాక్షసివాతఁ బడకుఁడు. జాగ్రత్త!! జాగ్రత్త!!!

నూర్జహాను మరలఁ బ్రవేశించును

నూర్జ—ఏమి లయలా! నాకు వ్యతిరేకముగ నీభర్తను బ్రోత్సహించుచుంటివా?

లయలా—అవును! నా ప్రియుని రక్షించుకొను నధికారము నాకుఁ గలదు.

నూర్జ—ఏమీ! రక్షించుకొను నధికారమా?

లయలా—అవును!—ఆహా! ఇప్పటికిని నీ పేరాశ దీరలేదా?—నీ శక్తి నశింపలేదా?—నీ మదం బుడుగలేదా? నా వల్లభుని నీ చిటుకన వ్రేలికిఁ గట్టివైచుకొని, యిపుడు కూడ సామ్రాజ్యమును శాసింపఁ దలంచుచుంటివా?—ఆహా! ఈ దుర్బలుఁడు, ఈరుజాశీర్ణమూర్తి, ఈ కంపితశరీరుఁడు లోకైక వీరుఁ డగు మహాత్ఖాను నెదురించి నిలుచునా?

నూర్జ—వెనుక నే నుంటిని గదా!

లయలా—నీవా? నీ కిపుడున్న శక్తి యెంత పాటిది? నీ శక్తియై యున్నవాఁడు నేఁడు సమాధిలో నిశ్చలముగ, హిమమువలెఁ జల్లనైన దీర్ఘనిద్రఁ జెందియున్నవాఁడు. నేఁడు నీ దురాలోచన

వలననే, మహాబత్ఖాను, కర్ణసింహా, షాజహానులును, నీ సోదరుఁడగు వసఫును, నీకుఁ బ్రతికూలులై నిలచిరి! ఇఁక నీ వెటనుండువు! ఇఁక నీ దర్పమెందులకు?—జననీ! స్వా వల్లభుని నీ యురిత్రాళ్ళ యందుఁ గట్టివేయకుము!

నూర్జ—లయిలా! నన్నెదురించి నిలువఁగలవా!

లయిలా—నూర్జహానూ! సాధుసంకల్పసాధన మెట్టిదో నేఁ జెప్ప నక్కఱ లేదు!

నూర్జ—నేను సామ్రాజ్ఞినని యెఱుంగుదువా?

లయిలా—ఒకప్పు డామాట నిక్కమే! కాని,—ఆ దినములు గడచి పోయినవి. ఇప్పుడు సామ్రాజ్ఞి యెవతెయైన నున్నచో, నామె లయిలా! [ప్రియుని నుద్దేశించి]—వల్లభా! ఎన్నండును సామ్రాట్టును గానని మీ రొకప్పుడు శపథ మొనరించితిరి! అట్లే మీ రెన్నఁడు గారనియుఁ గాఁజాలరనియు నేనెఱుంగుదును. అయినను మాటి మాటికి నిషేధించుచున్న నన్నుఁ బాటింపక మీ రీ పిశాచిని ప్రళయావర్తమునఁ బడినచో నేను మిమ్ము రక్షింపలేను. నా మాట వినుఁడు! [నిష్క్రమించును.]

నూర్జ—శర్యార్! నీవు దుష్టురాలైన యీ గర్వశిమాటల సరకుగొనకుము. నిన్ను సామ్రాట్టును జేయుభారము నాపై నున్నది! చిరకాలమునుండి భారతవర్షమును బాలించుచుంటిని! అట్టి నేను నీకుఁ గుడిభుజంబునై యుందును! జహాంగీరు నిన్నే సామ్రాట్టుగా నెన్నుకొనియెను. నేనుండగ నీవు భయపడనేల? ఇఁక నాలస్యము చేయకుము! వేగమే సైన్యసమేతముగఁ జని, యాగ్రాపట్టణమును ముట్టడించి స్వాధీన మొనర్చుకొనుము! మఱికొంత సైన్యమును వెంటఁ బెట్టుకొని వేగముగ, నిన్ను నేఁగలసికొందును—పొమ్ము!

[శర్యార్ నిష్క్రమించును.]

నూర్జహాను—(క్షణకాల మటునిటు పచారు చేయుచు)—"వృధా! వృధా!! వృధా!!! ఓ మూఢమానవుఁడా! చిరునవ్వు నవ్వుచు జయభేరి మ్రోగించుచు వచ్చిపోవుదు నని యెఱుంగక, సర్వనాశనమున కెదురుగఁ బర్వెత్తుచుంటివి! మృత్యువును కవుంగిలించుకొని, మఱింత గట్టిపట్టుటకే నీవు బ్రతికి యుంటివి. పండిన కొలఁది నీవు క్రుళ్ళిగించుచుంటివి!!!—ఈ జీవనమే యొక మృత్యువు. ఈ హాసమే దాని హాహాకారము!! ఈ తేజమే యంధకారము. యొక యార్తనాదము!!!—ఇది వృధా సన్నాహమని స్పష్టముగఁ దెలియుచునే యున్నది! అధఃపతనము, భయావహమై గభీరమై యెదుటఁ గన్పట్టుచున్నది! ఒక్కమాఱుగా పర్వతశిఖర మెక్కి నిలిచియుంటిని.—మరల సుడిగుండములోఁ బడిపోతిని! ఇఁక రక్షణము లేదు!—వినాశకల్లోలము వినవచ్చుచున్నది. చాలదగ్గరకు వచ్చినది. దుర్విధి తన యదృశ్యతర్జనితో దూరమందున్న దేనినో జూపుచు నన్ను బిలచుచున్నట్లున్నది.—"నీ సర్వనాశనమందే యున్నది!—నిక్కముగ నీ విందే ప్రవేశింపవలయును!" విధ్వంస దేవతాముఖమున వాడియైన కఠోరహాసము పొడగట్టుచున్నది. ఆ నవ్వున కర్థమిది:—"నీ కొఱకై శవపర్యంకమును బఱచుచుంటిని! రమ్ము!!—బిఱాన రమ్ము!!!"

## సప్తమదృశ్యము

ఉదయపురోద్యానమందలి రాజమహాలు—ప్రభాతకాలము
(మహబత్ఖాను, రహీమాన్, కర్ణసింహ, ప్రభృతు లుందురు—
వా రెవరికొఱకో ప్రతీక్షించుచుందురు.

దూరమున వాద్యధ్వని—పిదప షాజహాను సార్వభౌముఁడు ప్రవేశించును.)

అందఱు—జయ్! షాజహాను సార్వభౌమునకు జయ్! !—జయ్! ! షాజహాన్సార్వభౌమునకు జయ్!!!— జయ్!!!! షాజహాన్సార్వభౌమునకు జయ్!!!!—

మహాబత్—ప్రభూ!—ఇదిగో జహాంగీరు సార్వభౌముని రాజమకుటము!

తలవంచి వినయముగ నందించును

షాజ—చిరునవ్వుతో దాని నందుకొనును

అందరు—(జయధ్వానమొనర్తురు)

షాజ—(నవ్వుచు) మహాబత్ఖా! నే రాకమున్నే, నీవు నాకొఱకై సామ్రాజ్యమును జయించితివి! నీకు యథోచితపురస్కార మొనఁగుటకు నే సమర్థుండను గాను! నేఁడు నాకు గలిగిన యీ సమ్మానమునుంకు నీ చేతినుండియే వచ్చినది. నీవు దీనిని పిడికెడు మట్టివోలె నడుదారిలోఁ విసరి వైచితివి!

కర్ణ—ప్రభూ! అతని కార్యము సోత్రోట్టగుట గాదు—సామ్రాట్టొనర్చుటయే!

షాజ—ఇపుడు సామ్రాజ్ఞి కైదియా?

మహాబత్—చిత్తము ప్రభూ!

షాజ—ఆమెను విడచి పెట్టుము. ఆమె భరణమునకై వత్సరమునకు బదివేల నాణ్యముల నీయఁ దలంచితిని.

మహాబత్—దేవర యాజ్ఞాప్రకార మొనర్చెదము.

షాజ—మిగిలిన రాజ కుటుంబమున కిట్టి యేర్పాటు లొనర్పఁబడినవి.

రహిమాన్—స్వామీ! ఆ యేర్పాటుల నన్నిఁటినేఁ గావించితిని.

షాజ—ఓహో అట్లనా! మహారాజ బిరుదాంకితుండవగు నీవే యట్లొనర్చితివా?—ఏమి యేర్పాటు లొనర్చితివి?

రహిమాన్—ఖుస్రుయొక్క నందనుల నిర్వురను జంపివైచితిని! పర్వేజు పుత్రద్వయము మీవలనే మడిసినది. శర్యార్ తనూభవుని గొంతుపిసికి చంపివైచితిని. శేషించిన శర్యార్‌ను గ్రుడ్డు దీయుఁజేసి గ్రుడ్డివాని నొనర్చితిని. అతఁడికెన్నఁడు సామ్రాట్టు కాఁజాలఁడు!

షాజ—(పిడుగు పడినట్లు క్షణకాల మూరకుండి)—"ఏమి! ఈమాటలన్నియు సత్యమేనా!—రహిమాన్ మహారాజ్! సంకోచింపక సత్యము వచింపుము."

రహిమాన్—ప్రభూ! నేను వచించిన వన్నియు వేదాక్షరములు! ప్రభునమ్ముఖమున భృత్యుఁ డసత్యమాడ సాహసించునా?

షాజ—ఓః! ఏమి భీషణము!! ఏమి పైశాచికము!!!—ఈ కృత్యములన్నియు నెవరొనర్చిరి?

రహిమాన్—దేవర భృత్యుఁడే!

షాజ—నూర్జహాను బేగం! నీవు మహాఘములు నెన్నిటినో సల్పితివి! నీ శక్తి చే వానిని గప్పివైచి రక్షణ మొనఁగితివి!—అట్లొనర్చుటే ఘోరతర కిల్బిషము!—ఇన్ని హత్యలా!—ఇంత పైశాచిక దారాత్మ్యమా! ఇదెట్లు సాధ్యమయ్యె!—ఇది సంభవమని నేఁ దలంపనైన దలంప లేకున్నాను—సేవకా! రహిమానును నూపి-బంధింపుము!

ప్రతీహారి—(రహిమాన్ మహారాజును బంధించివైచును!)

రహి—చేతులు నులుముకొనుచు—స్వామీ! ఇదేమి! ఇదేమి! భృత్యుండను! భృత్యుండను!! మహోపకారి.—

షాజ—ఛీ!—హంతకా! నా సోదరుని, నా సోదర పుత్రులను హత్యఁ గావించిన నేను మిగుల సంతసింతునని దలంచితివా?—వేయిమంది విరోధులు మరణించినను! పృధివియందెవ్వరైన నట్లు సంతోషింపఁ గలరా?—నా సోదరుఁడును, నా సోదరుని పుత్రులును—

హో!—రాక్షసుఁడా! నీ కెట్టిశిక్ష విధింతును! మరణ శిక్షకు నీ వనర్హుఁడవు. కాదు! నీ కుచితమగు దండన మీపృథ్వియందింకను పుట్టలేదు!—కాని నీదండనము మృత్యువే కానిమ్ము!—అయ్యో! తల తిరిగి పోవుచున్నది. నేనేమియు యోచింపఁ జాలకున్నాను!—సేవకా! వీనిని వెలుపలికిఁ దీసుకొనిపొమ్ము. మహాబత్ఖానూ! ఈ క్షణముందే పిస్తోలుతో వీనిని గాల్చి జంపివేయుము!

మహాబత్—ప్రభూ! ఇది న్యాయప్రభుత్వము. ఏ రాజునింత వరకిట్లు పాలింప లేదు!

(ఇరువురు సేవకులు రహీమాన్ మహారాజును గట్టిగఁ బట్టి వెలుపలికిఁ గొనిపోదురు. మహాబత్ఖాను వారల వెనువెంటనే వెడలిపోవును!)

షాజ—అయ్యో! కుమారులారా! శర్యాఖా! హతభాగ్యసోదరా!—నేను దోషినని తలంపకుము. (వెలుపలినుండి పిస్తోలు శబ్దమును, రహీమాన్ మహారాజు నార్తనాదమును వినంబడును.)

షాజ—పోనిమ్ము.—పృథ్వీవక్షముపైనున్న పాప ప్రకాండభారము తొలఁగి పోయినది.

కర్ణ—భారతాధీశా!—గడచిన దానికై వగచినఁ బ్రయోజన మేమియు లేదు. ఇపుడు బ్రదికి యున్న వారలకు యథావిధిగ నేవేని యేర్పాటులొనర్పుఁడు.

షాజ—చిత్తము! (ఒకించుక సేపూరకుండి)—మహారాణా! ఏమి యొసఁగి మీఋణము దీర్చుకొనఁగలను. సామ్రాజ్ఞి సైనికులచే చుట్టుముట్టడింపఁబడి యోడిపోవనున్నపుడు తాము నాకాశ్రయ మొసఁగితిరి! మీవారు సైన్యము లన్నింటిని నాకొఱకై యుద్ధ భూమికంపి జయలక్ష్మిని నాకుఁ బ్రసాదించితిరి!

కర్ణ—ధర్మపక్షమున అధర్మవిపక్షమున యుద్ధమొనరించి, రసపుత్రోచిత కార్యము నలిపితిని.

పాజ—రసపుత్రులకు జయమగుగాక! ఒకించుక యూరకుండి—తదనంతరము దీర్ఘకాలము మీ యాతిథ్యమందుంటిని; ఈ భవనమీ సింహాసన, మీ మశీదు తాము నా కొఱకై నిర్మించితిరి.—రాణా! నేను వెడలిపోయిన పిదప వీనిని నాస్మృతి చిహ్నములుగ నుంచెదరా?

కర్ణ—ప్రభూ! కాలపురుషుని వ్రాత బడకుండ వానిని రక్షింపఁగలుగు నంతదనుక నవి యట్లే యుండగలవు.

పాజ—పగడములతోఁ గట్టిన యీ మసీదు నేమి సేయుదురు? అది హిందూధర్మేతరుల యారాధనమందిరము కాదా?

కర్ణ—ప్రభూ! నేఁడు పతితులైనను, హిందువు లంతగ హీనులు కాలేదు! యెంతకాలము మీవారి వంశమందు దీపము పెట్టువా రొకరైన నుందురో, యంతకాల మీ మసీదునందుఁ బ్రత్యహము సంధ్యాకాలమున దీపము పెట్టుటకు నూనెకఱవు లేదు!

పాజ—హిందువుల యౌదార్యము ధన్యమగుగాక! నేను ముసల్మానుండనయ్యు, నా రక్తనాళములందు మూఁడు పాళ్ళు హిందూ రక్తమే ప్రవహించుచున్నది. మహారాణా! మీ మకుటమును దీయుఁడు.

కర్ణ—(తీసివేయును.)

పాజ—(తన మకుటమును దీసి దాని నాతని శిరమందిడి, యాతని మకుటమును దాను పెట్టుకొని)—"కర్ణసింహా! నేటినుండి మన మిర్వురము సోదరులము; హిందూముసల్మాను లీ ముహూర్తము నుండి పరస్పరవైరములఁ జాలించి, ఒక్కతల్లి బిడ్డలని యెఱింగి, సోదరులట్లు మెలంగుదురు గాక!

## అష్టమదృశ్యము

యమునాతీరమందలి ప్రాసాదము—రాత్రికాలము

వాయువు నిశ్చలముగ నుండును. ఆకాశమునఁ బడమట నల్ల

మబ్బులు గనపడును.

అనష్ ఖాదిజాలు మేడపై నిలువఁబడి ప్రసంగించుచుందురు.

ఖాదిజా—జనకా! సామ్రాజ్ఞికి పిచ్చియెత్తినది. నిర్మానుష్య ప్రదేశములందుఁ గ్రుమ్మరుచు తనలోఁ దానేదియో గొణుగుకొనుచు, క్షణకాలము నవ్వుచు, మఱొకక్షణమున విలపించుచుఁ గాలము పుచ్చుచున్నది. మఱొక యాశ్చర్యదృశ్య మేమన, నామె యొక ప్పుడు పిడికిలి బట్టి మరల దానిం దెఱచి, చాలసేపు దాని వంకఁ దీవ్రముగఁ జూచుచుండును.

అనష్—[దీర్ఘనిశ్వాసము విడచి]—ఆ యభాగిని శక్తి పూర్తిగ నన్నగిలి పోయినది. ఇపుడామె యొక యనంతశూన్యమునందుఁ బడి పోయినది!—అమ్మా! ఇపుడామె యెచట నున్నది?

ఖాదిజా—ఎఱుఁగను. పోయి తెలిసికొని వచ్చెద—ఆహా! ఆకసమున మేఘమాలిక లెట్లు కానంబడుచున్నవో! ఝంఝానిల ముద్భవించు నని తోఁచుచున్నది!

ఈ సమయమున నంధుఁడైన శర్యార్ చేతినిఁ బట్టుకొని, లయలా ప్రవేశించును.

లయలా—మామ యిందే యుండెనా?

అనష్—లయలా!—నీ తోడనున్న వా రెవరు?

లయలా—నా యంధవల్లభుఁడు.

అనష్—ఆహా! బిడ్డా! వారలు నిన్నంధుని గావించి వైచిరా?

శర్యార్—అవును మామా! వారలు నన్నుఁ జిరాంధునిఁ గావించిరి.

జగమంతయు నిపుడొక యనంతైక్యమువలె [Oneness of form] దోఁచుచున్నది!— కేవల మొక గాఢశూన్యాంధకారముమాత్రము కానఁబడుచున్నది. స్థావరజంగమము లన్నియు నొక్కరీతిగా నున్నవి.... ఓః! ఏమి కష్టము!— భూమా! మానవులనంధులఁ గావింతు వార లెట్టి క్రూరులు!

లయలా— [ఏడ్పు నాపుకొని కంపిత స్వరమున]— ఆహా! వార లెట్టి దురాత్ములు!

శర్యార్— ప్రేయసీ! వలదని నీ వెన్ని భాషణములు నన్ను వారించినను మూర్ఖుఁడనై నీ పలుకులఁ బాటింపనైతిని. సలిపిన శపథమును భంగ మొనరించితిని!— ఇపుడు ఫలమనుభవించుచుంటిని!

లయలా— ప్రియతమా!— ఆ విషయమును స్మరించిన ప్రయోజనము లేదు. అతీతము— నతీతమే! భవిష్యము— భవిష్యమే!—

శర్యార్— నా కింకను భవిష్యమా!— నా భవిష్య మొక మేరలేని నిరాశయే. ఒక యనంతశూన్యము [Dullness]; యావజ్జీవాంధకారము; ప్రభాతస్వర్ణరశ్మి యికఁ నా కనులముందు నృత్య మొనరించుచు నన్నలరింపఁ జాలదు; చంద్రుఁడు నిశీథాకాశజలనిధిపై వెన్నెల తెరచాపనెత్తి తన పడవను నడుపఁజాలఁడు; నవవసంతోదయమున బృథివిపై నుండి శ్యామలతాతరంగములు ప్రవహింపనేరవు— సౌందర్యస్మృతి మాత్రము నా హృదయదర్పణమునఁ బ్రతిబింబితమైయున్నది!

లయలా— వల్లభా! విచారింపకుము? నేను మీ పార్శ్వమందే యుంటిని. వారలు మీ సర్వస్వమును బలవంతముగ నపహరించుకొని పోఁగలరు; కాని, మీ లయలా నపహరింపఁజాలరు! దుఃఖింపనేల? నే నుంటిని. మీకు నేను విశ్వసౌందర్యగాథల నశ్రాంతము వినిపింతును. అంతియకాక దానికంటెఁ గూడ మనోహర

ములై బాహ్యదృష్టికి గోచరింపక కేవలము హృదయానుభూతము లగు మాతృవాత్సల్యమును పత్నీప్రణయమును, దుహితృసేవను, భక్తుని భక్తిని కృతజ్ఞుని కృతజ్ఞతను, త్యాగి త్యాగమును, మీకు వినిపించెద. నాథా! మీరు విచారింపకుఁడు. మీ యర్ధాంగినగు నేను నీడవలె, నెప్పుడును మీ వెంటనుందును.—

శర్యార్—పత్నీ! అదియే నా కున్న యేకమాత్రసుఖము నే నిపుడు గ్రుడ్డివాఁడను. కాని యిన్ని దినంబులు గడచిన పిదప నిన్నుఁ బొందఁగలిగితిని.

[The reader may be given to understand that Seryar—the gullible, credulous, incircumspect and innocent Seryar—couldn't heretofore comprehend the philosophical Layala. Experience—miserable, poignant and excruciating though—enabled him now to divine the deep psychology of his noble and loving spouse.] నా యం దిసుమంతయైన సుందరంబగు దానిని నీవు వీక్షించి యుండలేవు. నేఁడు— [The compunc-tious Seryar remembers a past parley with his consort and avers with chagrin that in him there is nothing, beautiful or commendable]

లయలా—నేఁడు తాము సర్వాంగ సుందరులు. నా నేత్రములందుండిన మీ యిసుమంత కాలిమంబును జహాంగీరు సార్వభౌముని మృత్యువు తనవెంటఁ దీసికొని పోయినది. మరణానంతర మాతని మొడల నాకు ద్వేష మేమియు లేదు.—నేఁడు తాం మతిదీనులై, యసహాయులై యున్నారు. తాము నా ప్రాణతుల్యులని దలంచితిని! కాని నా ప్రాణములకంటె మీరే యెక్కుడని యిపుడు యోచించుచున్నాను. ఇంతకు బూర్వమెన్నఁడు నే నిట్టి యవ్యాజానురాగంబును జూపఁజాలనైతిని. నేఁడు మీవంటి సుందరు లేరి?

[By beauty Layala doesn't mean a prepossessing person or a vivacious outside but a resplendent inside.]

అసఫ్—అయ్యయో! స్త్రీ దేవతగా మారిపోఁగలదని వింటిని. రేవా సామ్రాజ్ఞిదేవియై యుండెను. కాని ఆమె చరిత్రమంతయు స్వర్గగాథయే! దానిని మేము బాగుగ మనసున కెక్కించుకొనలేక పోతిమి. కాని, మర్త్యసంగీతము స్వర్గగాథను దిగఁద్రొక్కి యనంతపథమునకు బోఁగలదను విషయము నీవే నిశ్చయపఱచితివి.

ఖాదిజా—అదిగో! సామ్రాజ్ఞి యిట్లే వచ్చుచున్నది! సౌందర్యనిధియైన యామె యిపు డెట్లున్నదో చూడుఁడు! పాప మామె యున్మాదినియైపోయినది. తనలోఁ దానేమో గొణుగుకొనుచున్నది!

(నూర్జహానేదియో వాగుచు, ఆ ప్రదేశమునఁ బ్రవేశించును)

నూర్జ—ఆహా! ఎట్టిశక్తి నెల్ల పాడుచేసితివి! ఎట్టి నిశ్శబ్ద మొనరించితివి! కారణమేమి? (క్షణ మూరకుండి) ఇపు డేమియు లేదు. (పిడికిలిబట్టి పిసపదానిం దెఱచి) ఇదిగో! చూడుఁడు! (అందఱికిని గుప్పిలిఁ జూపును.)

అసఫ్—సామ్రాజ్ఞీ!—సోదరీ!—

నూర్జ—ఎవరూ! ఓహో! అసఫా! ఒక కథ జెప్పనా? విందువా? వినుము! అనగనగా నొకరాజు గలఁడు! ఆ రాజు కొకరాణి కలదు. రాజు రాణిని మిక్కిలి ప్రేమించువాఁడు! కాని, ఆ రాణి మానవి కాదు!—రక్కసి! మాయలమారి! సమస్తరాజ్యము నామె మాయాపురముఁ గావించివైచెను! పిమ్మట నామె రాజపుత్రుని మ్రింగివైచెను. తదనంతరమున రాజును మ్రింగెను; మ్రింగి, తగుదునని తానే ప్రభుత్వము చేయసాగెను. అనంతరము రాకొమరుఁ డొకండా రాక్షసి వాఁతనుండి తప్పించుకొని, విదేశమునకుఁ బారిపోయెను. కొన్ని యేండ్లలో నాతఁడు పెద్దవాఁడయ్యెను. పెద్దయై, యొకనాఁడు భేరీధ్వానులతో వచ్చి, రాజకుటుంబమును మ్రింగుచున్న యా రక్కసిని జుట్టుబట్టి యీడ్చి,

చావుమని నేలఁ గూల్చెను.—ఒకించుక తాళి, దీర్ఘనిశ్వాసమును విడచి—నేడంతయు భిన్నమై పోయినది!

అసఫ్—నూర్జహానూ!

నూర్జ—నూర్జహానెవరు? ఆమె లేదే! చనిపోయినది!

అసఫ్—వినుము—మిహిరా!

నూర్జ—మిహిరా!—ఆమెకూడఁ జనిపోయినది! వారలిరువురు కూడఁ బోయిరి! మిహిరున్నిస్సా పోయినది! నూర్జహానూపోయినది!!

అసఫ్—సోదరీ! లేదు.

నూర్జ—"లేదు" అనఁగనే నమ్మెదనా! వారలిరువురు మరణించుట నా కనులతోఁ జూచితిని! మిహిరునిస్సా శెర్ఖాను భార్య నూర్జహాను జిహాంగీరు సతి. మిహిరున్నిసా శెర్ఖానును జంపివైచెను: నూర్జహాను జిహాంగీరును జంపివైచెను! జలధరగర్జనము-అదిగో! వినుము! జిహాంగీరు కంఠస్వరము? ఎంత కరుణ!—దేనిచేఁ జంపివైచితివి?—సౌందర్యము చేతనా? సౌందర్యమా!—లేకున్న జ్ఞాపకపోవును! అన్యసాధనాఘాతముచే నెవరును జావరు!—సౌందర్యము కతన నున్నా—ఆ! కాదు! కాదు! సౌందర్యము వలన నాత్మనమనహారవైచితి!— నీ భర్తలఁ జంపి పిమ్మట విషము ద్రావి, నీవు జచ్చితివి!—మిహిరునిస్సా మరణించెను! నూర్జహానూ మరణించెను!!

అసఫ్—ఉన్మత్తతామధ్యమున నొక శృంఖల మున్నది!

[Her words are not incoherent or rhapsodical]

నూర్జ—అసఫ్! నేను వారించి యుండలేదా? [అసఫ్ శిరంబునఁ గరం బిడి—సోదరా! వింటివి కాదు! అందుచే నామె యంత మొంది నది! ఎందుల కంత మొందదు?—విషము ద్రాగిన మారణింపరా?

ఖాదిజా—అత్తా!

నూర్జ—ఎవరు! [సభయసమ్మానములతో] ఓ! బేగమ్‌సాహేబా! సలామ్! [సలా మొనరించి వెనుకకుఁ దగ్గును] సలామ్! [మేఘగర్జనము] అదిగో! శర్ఖాను కంఠధ్వని!—ఏమిగభీరము? వింటివా?

ఖాదిజా—అత్తా! ఝంఝూనిల మావిర్భవించుచున్నది. లోనికి రమ్మా.

నూర్జ—ఇది ఝంఝూనిలము కాదు. శర్ఖాను మొఱ! సజీవుఁడై యుండ నతఁ డెన్నఁడు గద్దించియుండలేదు!—ఇపుడట్లొనర్చుచుండ నేఁ?

లయిలా—జననీ! లోనికిరమ్మా—ఝంఝూనిలము!

నూర్జ—కానిమ్మా! కానిమ్మా!—ఆకసమునుండి కడవలతో గ్రుమ్మరించినట్లు వర్షధారలు నాపైఁ బడనిమ్మా! నిలువఁబడి యీ జలపాతము నీక్షించెదను!—ఆహా! ఏమిసుందర మేమిభయంకరము!! [నూర్జహానపుడు రెండుచేతులను పిసికిలించి విప్పి యాకసమందలి మెఱుపులను జూచుచుండును.]

ఖాదిజా—ఓః—వాయువెంత వేగముగ వీచుచున్నది.—భీషణము భీషణము! ఝంఝూనిల ముత్పన్నమైనది!

అనఫ్—ఓః! ఏమి విద్యుత్కాంతి.—ఏమిగర్జనము!!

లయిలా—మాతా!—రమ్మా! [చేతిని బట్టుకొనును.]

నూర్జ—[తనయమౌళిపై హస్తముంచి]—లయిలా! నీవు మిహిరునిస్సా నెఱుంగుదువా? ఆమె నీ జనని! నూర్జహానెవ్వతెయో యెఱుంగుదువా? ఆమె నీ సవతితల్లి! నే నెవతెనందువా?—నీకు నేనేమౌదును?—నీకు నేనేమియుఁగాను! నేను నీకేమియుఁగాను!—[కరుణాస్వరమున]—ఏమీ కాను!!—ఓహోహోహోహో!

[క్రందన మొనరించును.]

లయిలా—అదేమి!—అమ్మా! నీవే నాకన్నతల్లివి! నూర్జహాను కాని, మిహిరునిస్సా కాని నాకు జనయిత్రి కాదు! నీవే నామాతవు!

సూర్జ — సత్యమే! — ఓః! — ఏమి యానందము! సత్యమే! — అమ్మా! అట్లని నీవెట్లెఱింగితివి? [మేఘ గర్జనము] అదిగో! మరలవినుము!!!

[స్తంభితయై నిలువంబడి పోయెను]

లతాంలా — సూర్జహాను మిహిరునిప్పాలిరువురు సౌభాగ్యగర్వితలై, యుచ్ఛ్వాసినులై, సుఖులై యుండిరి! వారలకుం గుమారి యక్కఱ లేకపోయినది. కాని, నీవు నాహృత్వైభవము! నాశోభాలినవు! నాదుఃఖిత జననివి! — హా తా! నీకిపుడొక నందని యావశ్యకము! అట్లే యీ నాయంధపతికిం బత్ని యావశ్యకము! మిమ్ముల నేండెట్లు ప్రేమించుచుంటినో, యట్లింతకు మున్నెన్నఁడును బ్రేమించియుండ లేదు! నే నిపుడు మీ దానను! ఒకలదాననుగాను! కాన — [ఒక కరంబునం బ్రియునిహస్తమును, రెండవహస్తమున జననికరంబును బట్టుకొని] — అమ్మా! రమ్ము! ప్రాణేశ్వరా! రండు! నా నేత్రాశ్రుధారలతో సతతము మీదుఃఖక్షతములం గడిగివైచుచుండెదను! — కూతుకర్తవ్యమిందే యున్నది!! నారీ సామ్రాజ్యమిందే గలదు!!!

తెరపడును.

[The external storm, spoken of towards the finish of the play, represents the terrible turmoil in the heart of the distracted Nurjahan. It is the want of master-writers (as I observed on a previous occasion) to speak of Nature as one that echoes human sentiments. Similar instances can be found in Shakespeare, Scot, Bankimchândra and writers of the like ilk to boot Dwijendralal.]

So the reader at length tears himself from the company of his historical comrades. For long he is tossed hither and thither on the ripples of emotion low and high. Now I feel an ungovernable yearning to descant upon the different characters that entertained us all the while. This wish notwithstanding, apprehension of further intrusion upon the reader's patience precludes any serious endeavour in that direction. I'll therefore for then once assay to bring into bold relief, by a compendious comment, only those characters which stand prominent in the play to wit, Nurjahan and Mahabatkhan.

## NURJAHAN

Brought through the snowy hills under the most unfavourable circumstances, plucked by the disconsolete parent from the protection of the noxious viper in the Himalayan confines, brought up subsequently in the lap of luxury in the vicinity of Akbar's court and dowered with the rich damask of sylphish beauty, 'which might paragon all description and excel the quirks of blazoning pens,' Nurjahan, in the spring-tide of her age, attracted the amorous attention of prince Ṣalim. But Salim's lecherous longing was nipped in the bud and Nurjahan's—she was however called then as Mihirunnisa—hand was vouchsafed unto Serkhan, a person whose strength and valour were not a whit less than those of any of the great heroes who shed lustre in the demesne of History. Discomfiture to gain the hand of the debonair damsel whose angelic bodily contortions were pressed night and day by the voluptuous caress of Salim's passionate thoughts exacerbated the feelings of the ebullient prince and pressed him to demonstrate an inflexible determination to attain the fruition of his desideratum by means foul, vindictive and malicious. The dark self of the disgruntled Jehangir found a fitting agent in the person of Rahiman (D. L. Roy calls this man as Bandar Raja) who is

the villain of the play and who, like every other villain, fell a pray to Nemesis! So the infatuated Jehangir succeeded in despatching Serkhan and drawing the buxom widow into the meshes of his lascirious yearning.

So far, we have nothing to say against Nurjahan. She was unobtrusive and docile and equally blemishness and immaculate. She had great veneration for her valorous and noble spouse, albeit she couldn't love him with all her heart in as much as poor Serkhan had nothing about him of power and pelf, her love towards which being, ever since her frequent visits to the royal court, tantamount to that which Jehangir cherished towards her. So the unlucky Serkhan suffered a ship-wreck upon the rock of his very affections and ultimately lost his life in the flower of his age not on account of the cruel blade of Murder but on account of the poignant thought of finding no chord of reciprocal love in the heart of his better—half!

The tragic end of her great husband severely lacerated the heart of Nurjahan and whipped into wakefulness the lofty sentiments of ratiocination and virtue which theretofore were sleeping in the inmost recesses of her mind. *But the Devil caught her in his tight grip* Nurjahan made collossal attempts to extricate herself from his grip, yea to exercise him ere long. But the unfortunate Nurjahan had to contend against tremendous odds. Her very brother the incircumspect, here-brained and adventitious Asaf and even the saintly Reva held up to her sight, urged by Jehangir, the meretricious splendours of the royal position and the magnificient honours that hedge round the Moghul throne. But for the assistance that thus requisioned to him by these innocent machinations, the Devil would have been throttled to death by the compunctious Nurjahan; but for this help, the sanguine hopes of Jehangir would have mercilessly been dashed to the ground; but for this help, the contritious Nurjahan would certainly have found her way into some sacrosanct sanctuary to apotheocise the sacred memory of her departed lord! Nurjahan, alas! succummed to the blandishments dancing attendance on her, fell down with a heavy thud from the pedestal of repentant thought, identified herself with the Devil and resolved to make the royal house-

hold a veritable Pandemonium. Bartering her beauty and vivacity to "power and pelf," she took the reins of Government and (as the swift events tell us) flung Khasru, Reva and Jehangir into the vortex of destruction though her endeavours to injure the noble Shajahan and the valiant Mahabatkan were completely foiled. History says that her malicious designs turned ultimately as boomerangs upon her head, drove her to distraction and held up to her pale lips the bitter cup of misery. The unfortunate lady her vicious actions notwithstanding therefore draws tears of compassion and commiseration from the eyes of the reader but not an out burst of anathemas from his tongue for all that she wrought sitting on the throne of Jehangir. I can even make bold to aver that the reader feels a sort of admiration for the bonny lady who wrestled for long with the Devil and who, as many a soliloquy in the play testify, was constrained to work out her nefarious designs in spite of herself. Flashes of philosophic truth frequently emanated from her lips and proved the metal wherewith she was made. She could ultimately transcend the mephtic purlieus of distraction and stare in the face of Wisdom in the light of holy love which the pithy sermon of Layala vouchs afed unto her—Layala that loved the mother and aspersed the Devil in Nurjahan, Layala that dauntlessly smashed Jehangir with the hammer of holy objurgation, Layala that acted as the apostle of truth and love, Layala that like 'the lily of the valley,' spreads an aroma of virtue and sancitity over the whole drama from start to finish, Layala that wound up the play with a succint peroration on the glories filial affection and feminine duty!

## MAHABAT-KHAN.

Mahabatkhan, the proselytised Muslim and the son of Sagarsimha, brother of the great Ranapratap, imbibed the ideas of his parent, who (as the readers of Mewarpatan very well knew) turned against Mewar in behalf of the Great Moghul and who, when he received the stirring inspiration of the Great Satyavati, metamorphosed himself and met death in a manner befitting the son of Rajastan, as well as those of Pratapasinha, whose very appellation makes the blood in our veins bubble with emotion and engenders in us the feelings of